
ఉషాకిరణ్ మూవీస్
ప్రేమాయణం
రామోజీరావు ♥ శ్రీధర్
గణేష్‌పాత్రో. యస్.పి.బాలసుబ్రహ్మణ్యం. యం.వి.రఘు. గౌతంరాజ
భాస్కరరాజు. శివ-సుబ్రహ్మణ్యం. అట్లూరి రామారావు.
UKiran Art Dept

# సితార చేస్తున్న అద్భుత



చిరంజీవి మార్కు
సుప్రీం నేరేషన్!



విజయశాంతి వైపు
రసమయ కథనం!



శారద బ్రాండు
ఉద్వేగం, ఉత్కంఠ!



ఎ.కోదండరామిరెడ్డి
మార్కు ఎడ్వంచర్!

# ప్రయోగం ఎలా ఉంటుందో!



జంధ్యాల మార్కు
కామెడీ!



యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
బాణీ సెంటిమెంటు!




Seeరియల్‌లో ఇంతవరకు వచ్చినవారు!

వారానికి ఒకరు చొప్పున వివిధ రంగాలకు చెందిన సినీప్రముఖులు
'క్లైమాక్స్' Seeరియల్‌లోకి ఇలా వారం వారం వస్తూనే వుంటారు!
తమ తమ 'మార్కు'లతో మిమ్మల్ని అలరిస్తూనే వుంటారు!!
ఎ ఒక్కవారం మిస్ అయినా ఎంతో నష్టపోయినట్టే!
కనుక ప్రతివారం మిస్‌కాకుండా చదవండి!!




Seeరియల్

ఇది మీ అభిమాన సినీవారపత్రిక

**సితార** చేస్తున్న అద్భుత ప్రయోగం!!

# చతుర ప్రపంచం

## కుక్కగోల

పూర్వం వేటకెళ్ళేటపుడు కుక్కలు యజమానికి అండగా నిలిచేవి. విశ్వాసానికి చిహ్నంగా పేరును సంపాదించుకున్నాయి.

పూర్వం ఈజిప్టులో కుక్కను కూడా కుటుంబ సభ్యునిలాగే చూసుకునేవారు. తమ పెంపుడు కుక్క చనిపోతే స్వంత బంధువు చనిపోయినట్లే శోకసంతప్తదినాల్ని పాటించేవారు. మరణించిన పెద్దలకూ, జీవించినవారి వారనులకూ ఆచార వ్యవహారాల్లో వారధిగా ఉండేది కుక్కేనని ఆనాటి వారి నమ్మకం. ఓ మనిషి మరణించినపుడు శవంపైన సైతాన్ దృష్టి పడకుండా 'కుక్క' అడ్డుకుంటుందని విశ్వసించేవారు. కంటిచుట్టూ గుండ్రని వలయాలున్న పసుపురంగు కుక్క రాక్షసులకి, పిశాచాలకి కూడా భయపడదని చెప్పుకునేవారు.

హంగేరిలో కుక్కకు మానవసమాజంలో మంచి స్థానమే ఉండేది. పరుల్ని మోసగించినవాళ్లు కుక్కలుగా జన్మించి తమ దోషాల్ని సరిదిద్దుకుంటారని వాళ్ళు నమ్మేవారు.

న్యూగినియాలో ప్రజలు కుక్కని పవిత్రమైనదని భావిస్తారు. కుక్కల్ని కరెన్సీగా కూడా ఉపయోగించుకునేవారు.

పశ్చిమభారతదేశంలో కొందరు కుక్కని కాలభైరవుని నమ్మినబంటుగా భావించి పూజించటం ఉంది. గుప్తరాజులకాలంలో వరాహమిహిరుడు రాసిన "బృహత్సంహిత"లో ఒక అధ్యాయం మొత్తం కుక్కల్ని గురించే చెప్పబడింది. కుక్కచేష్టలు, వాటి అర్థాలు, కుక్కల్లోని రకాలు అందులో చాలా విపులంగా చర్చించారు ఆనాడు.



కుక్కల్ని వాటి శకునాల్ని నమ్మి దైనందిన జీవితంలో పనులు ఎలా జరుపుకునేవారనేది ఎంతగా ఉంటుంది. కుక్క నోట్లో చెప్పుతో ఎదురైతే ఆ చూసిన వ్యక్తికి వెళ్తున్న కార్యం సఫలమవుతుందనే నమ్మకం ప్రగాఢంగా ఉండేది. ఎవరేనా ఇంటి గడపదాటి బయటకు వెళ్తుండగా, మాంసం ముక్క నోటకరిచిన కుక్క ఎదురొస్తే ధనలాభం కలుగుతుందట. కుక్క ఇంటిగోడమీద గీకుతూవుంటే ఇంట్లో దొంగతనం జరుగుతుందని నమ్ముతారు.

## అటంబాంబు పేలితే...

ఒక మెగాటన్ను అటంబాంబు పేలినపుడు సృష్టి ఆగిపోయి ప్రళయం ముంచుకొచ్చిందా, పృథ్వి అంతా స్మశానవాటికగా మారిపోయిందా? అనే భావన రాకమానదు. దానివల్ల సంభవించే నష్టాలకు లెక్కేలేదు. భవనాలు, వాహనాలు, చెట్టుచేమా, పశువులు, మానవులు, పంటలు– సమస్తం బూడిదరాశిగా మారిపోతాయి- హాహాకారాలు చేసేందుకు కూడా ఏ ప్రాణీ మిగలదు.

ఒక బాంబుపేలగానే ఒకటిన్నర కిలోమీటర్ల కాంతికిరణం వెలువడుతుంది. వెంటనే భూమి ఉష్ణోగ్రత పెచ్చుపెరుగుతుంది. విద్యుదయస్కాంతక్షేత్ర ప్రభావం వలన విద్యుత్పరికరాలు, అయస్కాంతపు పనిముట్లు పనిచేయటం ఆగిపోతుంది. బాంబుపేలినచోట ఒక కిలోమీటరు వ్యాసపరిధిలో చుట్టూరా ఉష్ణోగ్రత కోటి డిగ్రీల సెంటీగ్రేడు వరకు హెచ్చుతుంది. ఇది సమస్త ప్రాణుల్నీ ఆవిరిచేయగల అత్యధికమైన వేడిమి. మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఇనుము, ఉక్కు నిలువునా కరిగిపోతాయి. మనుషుల సంగతి చెప్పనక్కరలేదు. ఉన్నఫళంగా భస్మమై కుప్పగూలటం తథ్యం. 6 కిలోమీటర్ల దూరంలో ఉన్న ప్లాస్టిక్, నూలు, చెట్లు తమంతటతామే జ్వలించటం ప్రారంభిస్తాయి. బాంబుపేలిన స్థలానికి 8 కిలోమీటర్ల దూరాన ఉన్న బట్టలు సైతం మండిమసైపోతాయి. బాంబుపేలిన స్థలానికి 11 కిలోమీటర్ల దూరంలో ఉన్న మనుషుల శరీరం కాలిగాయాలవుతాయి. ఆ గాయాలు ఏ మందులకూ లొంగక ప్రాణాలు హరించితీరతాయి. బాంబు పేలిన మరుక్షణంలోనే అన్ని గ్యాస్‌స్టేషన్లు, పెట్రోలుస్టేషన్లు భగ్గున మండిపోతాయి. రెండు మూడురోజుల్లోగా పాతికలక్షల జనం మృత్యువు పాలవుతారు. మరో 3/4 జనాభా రెండుమూడు నెలల్లోపలే చనిపోతారు. రేడియేషన్ ప్రభావంవలన జనాభా యావత్తూ నాశనమై ఎటుచూసినా శూన్యమే మిగుల్తుంది. కొన్ని సంవత్సరాల వరకు పంటలు పండవు. పైర్లు పెరగవు. ప్రకృతిలోని చెట్టూచేమ, పశుపక్ష్యాదులు, మానవులు నశించిపోయి ఆ దేశంబీడుగా, ఎడారిలా, మరుభూమిలా మారి వెలవెలబోతుంది.





# 96 కోట్ల ఏర్‌పోర్ట్!

జీవితంలో ఒక్కసారైనా విమానంలో ఎక్కాలని కలలుగనే వారున్నట్లే విమాన ప్రయాణాల్లో ప్రపంచం చుట్టి వస్తూ ఉపాహారం ఒక దేశంలో, మధ్యాహ్న భోజనం మరో దేశంలో, రాత్రి డిన్నర్ ఇంకో దేశంలో చేసేవారూ ఉన్నారు.

ఢిల్లీలో 1981లో ప్రారంభించిన ఇందిరా గాంధీ ఇంటర్నేషనల్ ఏర్‌పోర్టు నిర్మాణం 1985 నాటికే ముగిసినా లోపల అలంకరణ తదితర పనుల వలన ప్రారంభోత్సవం ఆలస్యం అయింది. దీని నిర్మాణంలో ఎందరో అధికారులు ఎన్నో లక్షల రూపాయలు స్వాహా చేశారని డిస్మిస్ అయ్యారు కూడా.

ఈ అంతర్జాతీయ విమానాశ్రయ నిర్మాణానికి ఖర్చు 64 కోట్ల రూపాయలవుతుందన్న తొలి అంచనా తారుమారై 96 కోట్ల రూపాయల దాకా ఖర్చయ్యాయి. అరవై వేల చదరపు మీటర్లలో విస్తరించుకున్న ఈ విమానాశ్రయాన్ని ఏటా 33 లక్షల 50 వేల మంది ప్రయాణీకులు వాడుకోగలరని అంచనా.

రెండువేల హెక్టార్ల విస్తీర్ణంతో 1990 నాటికి మరో ఎనిమిది ఇలాంటి పెద్ద ఏర్‌పోర్టులు నిర్మించాలని ఓ ప్రతిపాదన ఉంది. ఇందిరా గాంధీ విమానాశ్రయం లోపలి భాగం అపురూపంగా అలంకరించబడింది. విమానం రాకపోకలకి విడివిడిగా రెండు ప్రత్యేక మార్గాలు ఏర్పాటు చేశారు. విమానం ఎక్కడానికి మెట్లెక్కే శ్రమ లేకుండా నేరుగా విమానంలోకే తీసుకువెళ్లే సన్నని యాంత్రికంగా కదిలే దారిని ఏర్పాటుచేశారు. కస్టమ్స్, సెక్యూరిటీ అధికారులు ఒకేసారి 28 మందిని చెక్ చేసుకోవచ్చు. 840 అడుగుల మేరకు కన్వేయర్ బెల్టు ప్రయాణీకుల సామాన్లను మోసుకు రావడానికి, తీసుకుపోవడానికి ఏర్పాటుచేశారు. అరవై లక్షల ఖర్చుతో వి.ఐ.పి.ల లాంజీలను అలంకరించారు. ఇవన్నీ మున్ముందు మరింత విశాలం చేసుకునేందుకు వీలుగా కూడా నిర్మించారు. ఈ ఏర్‌పోర్టు మరిన్ని సౌకర్యాలు పెంపొందించుకుని ఉన్నత శ్రేణి విమానాశ్రయంగా ప్రపంచంలో ప్రఖ్యాతి చెందాలని మనవారి ఆశ.

# వరుణా... కరుణించు!

వరుణ దేవుడు కనికరించి వర్షాలు కురిపిస్తే భూతలం సస్యశ్యామలం అవుతుంది. లేదా తాగడానికి మంచినీరు సైతం లభించక ప్రాణికోటి హాహాకారాలు చేయక తప్పదు. కర్నాటక రాష్ట్రంలోని షిమోగా జిల్లా గురుపురా గ్రామంపై వరుణదేవుడు శీతకన్ను వేయటంతో కరువు పిడికిల్లో నలిగిపోయారు అక్కడి ప్రజలు. ఇంద్రుడిని, వరుణుడిని మెప్పించడానికి



ఆ ఊరి పౌరులందరూ కలిసి పూలతో అలంకరించిన గాడిదల్ని ఊరేగింపుగా నడిపించారు. ఈ ఊరేగింపును చూసి వరుణుడు సంతోషించి వర్షాలు కురిపిస్తాడని వారి ఆశ.

తమిళనాడులోని సేలం జిల్లాలో మరో ఆసక్తికరమైన వరుణాహ్వాన పద్ధతి ఉంది. ఒక మగ గాడిదకూ, ఆడ గాడిదకూ హిందూ ఆచారాల ప్రకారం వేదమంత్రాలతో రంగ రంగ వైభవంగా ఈ పెళ్ళి జరుగుతుంది. గాడిద పెళ్ళికొడుకుచేత సిల్కు ధోవతి కట్టిస్తే, గాడిద పెళ్ళికూతురు సర్వాంగ సుందరంగా అలంకరించబడుతుంది. పెళ్ళితంతు ముగిసేక ఈ గాడిద వధూవరులను సన్నాయి మేళాల్తో ఊరేగిస్తారు. ఈ అశేష జనసందోహాన్నీ ఊరేగింపునూ చూసి వరుణదేవుడు పులకరించిపోయి కరిగి నీరైకురుస్తాడని వారి ఆశ.

గుజరాత్‌లోని కొన్ని ప్రాంతాలవారు వర్షాలు సరిగా కురవనపుడు ఒక వ్యక్తిని చెట్టు ఆకులతో అలంకరిస్తారు. ఆ వ్యక్తి ఊళ్ళోని ప్రతి ఇంటిముందూ ఆగుతాడు. గ్రామీణులు అతనిపైన నీళ్ళు చిలకరిస్తారు. "మేం ఎలా నీళ్ళు చిలకరిస్తున్నామో అలాగే దేవతలుకూడా హర్షంతో మామీదా, మా ఊళ్ళో, మా పొలాల్లో వర్షం కురిపించాలి" అని దాని అర్థం.

పశ్చిమబెంగాల్ ముర్షీదాబాద్ జిల్లాలో మరొక విచిత్రమైన ఆచారం ఉంది. వర్షాలు కురవనపుడు రుద్రదేవుడికి పూజలు చేస్తారు. ఈ పూజల్లో ఒక భాగంగా శివలింగాన్ని నీళ్ళల్లో ముంచుతారు. ఆపకుండా అఖండ రుద్రాభిషేకాలు చేస్తారు. వీటికి సంతోషించి రుద్రుడు తన జటాజూటంలోని గంగమ్మను ఇలాతలంపైకి పంపిస్తాడని వారి నమ్మకం.

ఉత్తరప్రదేశ్‌లోని ఎన్నో ప్రదేశాల్లో వర్షాగమనం కోరి పూజలు చేస్తారు. వారంరోజులపాటు ఎడతెరిపి లేకుండా గంగాజలాన్ని శివలింగంపైన పోస్తుంటారు మరికొన్ని ప్రాంతాల్లో చిన్నపిల్లలు వీధుల్లో పరుగులుపెడుతూ గడప గడపకూ నీళ్ళు చల్లుతారు. వరుణదేవునికి ఇది స్వాగతం అని వారి అభిప్రాయం.

మధ్యప్రదేశ్ మహిళలుకూడా ఈ పద్ధతిని పాటిస్తారు. బీహార్‌లో వర్షానికి స్వాగతం చెప్తున్న ఆచారాలు విచిత్రంగా ఉంటాయి. ముజఫ్ఫర్ జిల్లాలోని గ్రామాల్లోనివారు ఒక కుండలో ఓ కప్పను తెచ్చిపడేస్తారు. అయిదు ఇళ్ళ నుంచి నీళ్ళు తెచ్చి ఆ కుండలోకి పోస్తారు. కప్ప బెకబెకలాడుతూంటే గ్రామస్థులు వానపాటపాడతారు. మరో జిల్లాలో యువకులు ముఖానికి నల్లరంగు వేసుకుని నృత్యం చేస్తారు. గంతులు వేస్తారు. వరుణుడు ఇవి చూసి నవ్వుకుని, మేఘాలకు చిల్లులు పొడవాలనీ, తద్వారా వర్షం కురుస్తుందనీ వారి ప్రగాఢవిశ్వాసం.

కవర్‌పేజీ ఫోటోగ్రాఫర్: **మేడిది సీతారాం**

# మోహనరాగం నవలపై చతుర సమీక్షలు

'చతుర' నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై నవంబర్ సంచికలో ప్రచురితమైన అక్కినేని కుటుంబరావు గారి 'మోహనరాగం'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న వాటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## మోహనరాగమా?

*(ప్రథమ బహుమతి రూ.100/-పొందిన సమీక్ష)*

'మోహనరాగం' 'సారాజ్యెం' రాసిన అక్కినేని కుటుంబరావుగారు రాసింది కాబట్టి దుర్భిణీతో చూడక తప్పదు.

సుజాత, మోహన్‌లకు పేదల కష్టాలపట్ల ఆర్ద్రత ఉంది. ఏదో చెయ్యాలనే తపనా ఉంది. కానీ సేవాసంస్థలో తాము చేస్తున్నది బూటకమనీ, నాటకమనీ, తాత్కాలికంగా వాళ్ళ కళ్ళను వెలిగించే సత్తువ కూడా ఈ వెలుతురుకి లేదని తెలుసు. ఒకచోట మోహన్ చంద్రంకి 'సుజాతని జీవితంలోకి ఆహ్వానించడం, సాహిత్యంతో నిత్యసంబంధం, నీ స్నేహం....' అంటు రాస్తాడు కూడా. అయినా అక్కడే కొనసాగుతూ 'మనం ఏం చెయ్యలేమా? చెయ్యవద్దా? ఎందుకు ఆలస్యం? ఏమిటీ అడ్డం?' అంటూ అర్థాంతరంగా ప్రశ్నలతో ముగిస్తారు. ప్రభుత్వం ఊబిలో దున్నపోతే. కాని పేదలకు పెద్దయెత్తున తాత్కాలిక సహాయం అందజేయాలంటే దాన్ని కదిలించక తప్పదు. శాశ్వత పరిష్కారం కావాలంటే ప్రభుత్వమేకాదు, వ్యవస్థను కూడా మార్చక తప్పదు. కానీ తన కథనం ద్వారా ఈ వాస్తవాన్ని ఎస్టాబ్లిష్ చేసే అవకాశం రచయిత జారవిడుచుకున్నారు.

సుజాత, మోహన్‌ల ప్రేమను చిత్రీకరించడానికి రచయిత 'నువ్వు లేకపోతే నేను బతకలేను' వంటి పదజాలాన్నే వాడారు. మోహన్-చంద్రంల మధ్య ఎంత గాఢమైన స్నేహబంధం ఉన్నా ఇటువంటి డైలాగులు రాగూడదే! 'ప్రేమ' అనేసరికి పడికట్టు పదాలు పరిగెట్టుకొచ్చేస్తాయా? రమణమ్మ, చౌదరీలు ఎంతగానో ప్రేమించుకున్నారు, చాలా అన్యోన్యంగా జీవించారు. చౌదరి బతికుంటే రమణమ్మ జీవితం వేరేవిధంగా ఉండేది. కానీ అతను లేకుండా కూడా ఆమె జీవించి లేదా? అలాగే స్త్రీ, పురుషుల తొలి సమాగమాన్ని ఇప్పటికీ చాలామంది యథాశక్తి అతిశయోక్తులతో అందలం ఎక్కించారు. దీని చుట్టూ ఉన్న భ్రమల్ని తొలగించాల్సిందిపోయి కుటుంబరావు కూడా 'నేను సైతం....' అంటూ దానికి బలం చేకూర్చారు. నిజానికి శృంగారమంటే 'ఇంతేనా' అనిపించేటంత చప్పగా తొలి సమాగం ఉండొచ్చు. ఒకరి మనసులు ఒకరు తెలుసుకోడానికి సమయం పట్టినట్టే ఒకరి శరీరాలొకరు తెలుసుకోటానికీ సమయం పడుతుంది. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే 'వెన్నెల్నీ విరుల్నీ పూయించే' ప్రసక్తి 'పెళ్ళి' తరువాత కనబడదు.

నవల కొన్ని మనస్తత్వాలని, కొన్ని సంఘటనలని, కొన్ని అభిప్రాయాలు చెప్పడానికి తప్పించి సమగ్రంగా లేదు. సబిత, బుచ్చిగాడు, వీరరాఘవయ్య వంటి పాత్రలు ఇట్లావచ్చి, అట్లా తప్పుకుంటాయి. పంకజవల్లి, చంద్రం పాత్రల స్వరూప, స్వభావాలు పూర్తిగా బోధపడవు. అక్కడక్కడా కంటిన్యూటీ కూడా లోపించింది. చంద్రంని కలుద్దామని బయలుదేరిన సుజాత, మోహన్‌లు అతన్ని కలవరు. తన పెళ్ళికి తల్లిని తీసుకురావడానికి వెళ్ళా

ల్సిన మోహన్ వెళ్ళినట్లు లేదు. అసలు వీళ్ళ పెళ్ళికి సన్నాహాలేగాని, అది జరిగినట్లు కనబడదు.

'మోహన రాగం' పేరు, నవలలోని విషయానికి అంతగా నప్పలేదు.

— సి. వెంకటేశ్వరరావు సికింద్రాబాద్

## ఆకలి రాగం

(ద్వితీయబహుమతి రూ. 75/-పొందిన సమీక్ష)

నవంబరు 'చతుర' నవల 'మోహనరాగం'- నాయకుడైన మోహన్ పేరున 'మోహనరాగ'మైందే కాని, నిజానికది ఆకలి రాగం. భారతదేశంలో- ముఖ్యంగా మారుమూల గ్రామాల్లోని ప్రజల ఆకలి కేకలకు గొంతిచ్చి, నేటి ఆర్థిక వ్యవస్థలోని అవకతవకల్ని బాగా అవగతపర్చారు రచయిత. తెలంగాణా మాండలిక శైలి రచనకు పరిపుష్టినిచ్చింది.

నేడు తామరతంపరగా ప్రభుత్వం ప్రవేశపెడ్తున్న రకరకాల స్కీములను గురించిన ఆలోచన రేకెత్తించడంలో సఫలీకృతులయ్యారు రచయిత. "రాయలసీమ సేవాసమితి, వయోజన విద్య, మాతా, శిశు సంక్షేమ పథకం" వగైరా ఏ పథకాల్నయినా ప్రజల్లోకి తీసుకువెళ్లాలంటే ముందుగా వారి ఆకలి తీర్చాలి. "కాలేకడుపులకు చదువులుకాదు, గింజలు కావాలి" "అన్నం పెట్టి నువ్వేంచెప్పినా వింటారు" అనటం అక్షర సత్యం. గ్రామాలలో మూర్తీభవించిన దరిద్రం, దైన్యం, అనారోగ్యం- ఈరమ్మ, శాంతమ్మ, బుచ్చిగాడులలోకళ్ల కుకట్టినట్లు చూపించారు. వారి ఆకలి మెదడును తినేసింది. తెలీని బాధ ఎడద లోతుల్లోంచి ఎగదన్నుకొచ్చి, ఏమీ చేయలేని నిస్సహాయతతో నలిపేసింది. "మనం ఏం చెయ్యలేమా? చెయ్యవద్దా? ఎందుకాలస్యం? ఏమిటి అర్థం?" ఈ ప్రశ్నలే చదువరులను కూడా అడిగిస్తాయి.

ప్రాథమిక అవసరమైన 'ఆకలి' వరకు రచయిత దృశ్యాత్మక కథనం ఆమోదయోగ్యమే. కాని ఇందులోని రమణమ్మ- చౌదరిల ప్రేమకథ, సుజాత- మోహన్‌ల ప్రణయం- ఇవి కూడా మరో రకమైన 'ఆకలి' అనే ఉద్దేశంతో రచయిత మధ్యలో చొప్పించారా? ప్రభుత్వం పెట్టే స్కీములకి, ఈ కులాంతర వివాహాలకి సంబంధమేమిటి?

సుజాత, మోహన్‌ల మధ్య శారీరక సంబంధానికి తప్ప రమణమ్మ పాత్రకు అస్తిత్వం లేకుండాపోయింది. ఛాయపాత్ర కూడా ఛాయామాత్రమే. ఒక స్వాతంత్ర్యయోధుడిగా వీరరాఘవయ్య బ్రిటిషు పాలనలో వ్యవసాయాభివృద్ధికే కృషి జరిగింది కాని పారిశ్రామికీకరణ, వనరుల అన్వేషణ ఎందువల్ల జరగలేదో, ఒక దేశ ఆర్థికాభివృద్ధికి వైజ్ఞానిక వికాసం ఎంత అవసరమో గుర్తించలేకపోవటం అవమానకరం. రచయిత అంతగా నీరాజనాలెత్తిన వైద్యశాస్త్రం కూడా వైజ్ఞానిక అంశమేనని గమనించాలి.

ఒక చిన్న నవలలో అనేక అభ్యుదయాంశాలను ఒకేసారి చొప్పించేయాలన్న ఆరాటం పఠితల ఏకాగ్రతను భంగపరిచింది. సమగ్ర పరిశీలన, ప్రణాళిక లేకపోవటమే ఇందుకు కారణం.

— రాయనూతల లక్ష్మి, సి. మల్లవరం

## వాస్తవానికి అద్దం

(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)

అనుక్షణం బతుకు పోరాటమే. ఆకలి... ఆకలి... ఆకలి. అయిదేళ్ళకొక్కసారి వచ్చే నాయకులకంతా తెలుసు. కనుకనే "ప్రాజెక్ట్‌లు, చెరువులు, పరిశ్రమలు" మీ ముందుంచుతామని వాగ్దానాలు. కాని ఇవన్నీ అమాయకంగా నమ్మే ప్రజలు ఓటు వేస్తున్నారంటే నమ్మలేము. అక్కడా ఆకలే గెలుస్తున్నది. తాత్కాలికంగా . బియ్యమో, డబ్బో, మద్యమో ప్రభావం చూపుతుంది. స్వార్థం మనిషిని మింగేసింది. తన పొట్టకోసం కుత్తుకలు కోసే రాక్షసత్వం మానవులలో బయలుదేరింది. ఈ నవలలో వీరరాఘవులు చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం. మోహన్, సుజాత, పంకజవల్లి లాంటి సహృదయులు నిస్సహాయతతో, ఆవేదనతో క్షణంక్షణం నరకం అనుభవిస్తున్నారు. ప్రాథమికావసరమైన తిండి, దానితో బాటు వైద్యం లేనప్పుడు అంగన్‌వాడిలాంటి పథకాలెన్నైనా నిష్ప్రయోజనం. మన ప్రాజెక్టులు ఎన్ని పంచవర్ష ప్రణాళికలు గడిచినా

పూర్తికావు. నిర్మాణ వ్యయం పెరుగుతూనే ఉంటుంది. అందుకు ఎన్నో కుంటిసాకులు. మన ప్రతిష్ఠ దిగంతాలకు వ్యాపింపజేయాలని, ఏషియాడ్‌లు, సార్క్‌లు, అలీనోద్యమ శిఖరాగ్ర సమావేశాలకు కోట్లాది ఖర్చు చేస్తూనే వుంటాం. కరువు, వరదలు, తుఫాన్లు వస్తూనే ఉంటాయ్. తాగేందుకు గుక్కెడు నీళ్ళు కూడా లేక చస్తూనే ఉంటాం.

ఈనాటి గ్రామీణుల కడగండ్లను, స్వాతంత్ర్యం వచ్చిన 40 ఏళ్ళ తరువాత కూడా జనాభాలో సగంమంది కడుపునిండా తిండికి నోచుకోలేదనే నగ్నసత్యాన్ని చక్కని శైలితో మన కళ్ళముందుంచారు. సాహిత్యం వాస్తవాలకు అద్దంపడుతూ, సమస్యలకు పరిష్కారం సూచిస్తూ సందేశాత్మకంగా ఉండాలి. ఈ లక్షణాలున్న నవల "మోహనరాగం".

— **రాధాహరినాథ్**, దేవరకొండ

## నా అనుభవమూ అదే!

***(రూ: 25/- బహుమతి పొందిన సమీక్ష)***

**నే**నొక స్కూల్ మాస్టర్‌గా అడవిలోని దీనుల, దుఃఖితుల మధ్యకు ఉత్సాహంగా వెళ్లి అక్కడ గడపలేక వచ్చేశాను. వాళ్ళకు చదువు కంటే ముందు అన్నం కావాలి. తర్వాతనే ఏమి చెప్పినా- ఏది చేసినా. ఆహారం ఇవ్వకుండా చదువు చెప్తాం, వైద్యం చేస్తాం, ధర్మ ప్రబోధం చేస్తామంటే ప్రయోజనం లేదు. ఇది తెల్సుకుని కూడా నేను ఏమీ చేయలేని నిస్సహాయతతో ఆ పరిస్థితుల నుండి బైటకొచ్చిన వాస్తవాన్ని నాల్గు సంవత్సరాల తర్వాత "మోహనరాగం" ద్వారా గుర్తుకు తెచ్చింది "చతుర"

పేదరికం, ప్రకృతి క్రౌర్యం మధ్య నలిగి నాశనమౌతున్న సహమానవ సమూహం కోసం ఒక మామూలు ఉద్యోగి ఏమీ చేయలేక వ్యథతో కుమిలిపోతున్నాడు. సమాజాన్ని నిలువునా దోచుకుతింటున్న రాజకీయ రాబందులు ఇలాంటి విషయాలను చదివితే మార్పు వచ్చే అవకాశం లేదు. వాళ్ళ అరాచకాలకే సమయం చాలదు. ఇక మంచి పుస్తకాలను, ఆలోచనాపరుల మాటలను పట్టించుకొంటారా?

సిద్ధాంత ప్రచారాలు ఎవర్నీ రంజింపజేయవు. కానీ కథనం ద్వారా సిద్ధాంతాలను, ప్రజా వ్యథలను హృదయాలకు ఇంజెక్టు చేయవచ్చునని ఎందరో రచయితలు తమ రచన ద్వారా నిరూపించారు. అక్కినేని కుటుంబరావుగారు కూడా పైవాదాన్ని సమర్థించే విధంగా నవలను రూపొందించారు. కాకపోతే ప్రేమ మోతాదును తగ్గించి ఆమేరకు మరికొన్ని దుర్భర జీవితాలను పాఠకుల ముందుంచితే బాగుండేది. విస్తృత విషయం వైయక్తిక ప్రేమల మధ్య లుప్తమైపోతుందని గ్రహించాలి.

ఇన్వెస్టిగేటివ్ రైటర్లమని బోర్డులు తగిలించుకొని పాఠకులమీద చెత్తను కురిపిస్తున్న రచయితలకు కనువిప్పు కల్గించాలి 'చతుర' నవలలు. ఒకరకంగా సాహిత్యానికి, మరో రకంగా సమాజానికి హితకారిగా 'చతుర' మార్గం చూపుతున్నది.

— పి. **నాగేశ్వరరావు**, కట్టుబడిపాలెం

## కన్నీటి చుక్క

***(రూ: 25/- బహుమతి పొందిన సమీక్ష)***

**న**వలకు ముందుగా 'చతుర' "మోహనరాగం" నవలను పరిచయం చేస్తూ "గుండెల్ని పిండే సన్నివేశాలతో కదిలించి, ఆలోచింపచేసే పల్లెప్రజల జీవిత గమనంలోని యదార్థ సంఘటనలకి సజీవ రూపకల్పన మోహనరాగం" అని రాసిన మాటలు నవలని ఆద్యంతం చదివేలా చేశాయి. నవల చదివిన తర్వాత కలిగిన అనుభూతి కూడా ఇదే. అక్కినేని కుటుంబరావు సాహిత్య ప్రయోజనాన్ని అవగాహన చేసుకొన్న వ్యక్తి. సమకాలీన సమస్యల్ని ఆయన సరిగానే అర్థంచేసుకొన్నారని 'మోహనరాగం' నిరూపిస్తుంది. వరదలు ముంచుకు వస్తోంటే పల్లపు ప్రాంతాలలో ఉండవద్దని మాత్రమే చెప్పి చేతులు దులుపుకొనే ప్రభుత్వాన్ని ఆయన ఎత్తిచూపారు. మెట్ట ప్రాంతాలలో తాత్కాలిక నివాసం ఏర్పాటు




చెయ్యడం చేతకాని ప్రభుత్వ అసమర్థతను సునిశితంగా విమర్శించారు. ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో కూడా భారతదేశంలోని ఆకలి చావులు ప్రభుత్వం ఎంత కప్పి వుంచినా దాగని సత్యం. ఈ పచ్చినిజాన్ని 'మోహనరాగం' నవలలో చెప్పినప్పుడు గుండె కలచివేసినట్లయింది. ప్రతి పాత్రకి ఒక విలక్షణత్వాన్ని కలుగచేశారు రచయిత. సమర్థవంతంగా ఆ కథను మొదటినుంచీ చివరిదాకా నడపగలిగిన రచయిత అభినందనీయులు. 'అందరికీ అన్నీ తెలుసు. తెలిసే తలవంచుకు నడిచిపోతున్నాం' అనే మాటలు సూటిగా హృదయానికి తగిలేయి. చివర్లో రచయిత స్పష్టంగా చెప్పారు. అన్ని రోగాలకీ మూలం మాల్‌న్యూట్రిషన్ అని. పరిశుభ్రమయిన నీరు లేకపోవడంవలనే మనం 70 శాతం రోగాలకి గురిఅవుతున్నాం. పరిశుభ్రమయిన నీరు అందించడంలోనే ప్రభుత్వం తన అసమర్థతను బయటపెట్టుకొంది. ఇక పోషకాహారాన్ని అందరికీ ఎలా సమకూరుస్తుంది? కష్టపడి చెమటోడ్చి ప్రకృతి వైపరీత్యాలకి ఎదురొడ్డి పండించే గ్రామస్తులకి తినడానికి సరైన తిండి లేదు. కట్టడానికి సరైన బట్టలేదు. వాళ్ళకోసం కనీసం కన్నీటి చుక్కయినా రాల్చగలమా మనం?

— వై. మురళీకృష్ణ, రాజమండ్రి

## మినీ కాపీకథ

*(రూ. 25/- బహుమతి పొందిన లేఖ)*

సెప్టెంబరు నెల "చతుర"లో ప్రచురించిన కోనే హరిబాబు రాసిన మినీ కథ "అతిథి దేవోభవ" జి. అనంతశయనంగారు "స్రవంతి" వారపత్రికలో 12-3-87 సంచికలో రాసిన మినీ కథకు కాపీయే. ఆ కటింగ్ జతపరుస్తున్నాను.

ఓనవల కాదు. కథకాదు. కవితకాదు. కనీసం వ్యాసం అయినా కాదు- మినీ కథనా కాపీ కొట్టటం! హతవిధీ... మన రచయితలింత దౌర్భాగ్యస్థితిలో ఉన్నారా?

— ఎల్. రవిచంద్ర, సిద్దిపేట

# చతుర

సంపుటి : 10 జనవరి 1987 సంచిక : 12

## ఈ నెల ప్రత్యేక నవల

ఆడపిల్లలు కాబోయే భర్త గురించి, తాము గడపబోయే ఆనందమయ వైవాహిక జీవనం గురించి కమ్మని కలలుకంటారు. కానీ, వారిలో చాలామందికి ఆ మూడుముళ్లూ పడ్డాక అత్తల్లే ఓ నరకమై, కట్టుకున్నవాడే యముడుగా ప్రత్యక్షమైతే....? కలలు కల్లలై, సుఖాల సౌధాలు పేకమేడల్లా కూలిపోతే....? వారి హృదయ వేదన ఎలా ఉంటుంది? ఈరోజుల్లోనూ అకారణంగా కోడళ్ళను రాచి రంపాన పెట్టే అత్తమామలున్నారా? కష్టసుఖాలు పంచుకోవలసిన భర్తే క్రూరంగా ప్రవర్తించి తననే సర్వంగా నమ్ముకుని తనవెంట వచ్చిన పరాయి ఇంటి ఆడపిల్లకు ప్రమాదరాలు పంచవలసిందిపోయి తనే ఓ విలనై ఆమెను ఆత్మహత్యకు ప్రేరేపిస్తాడా? కూర్చున్నా తప్పు, నిల్చున్నా తప్పు; మాట్లాడినా ఓ తప్పు, మాట్లాడకున్నా తప్పు నంటూ ఏదో ఒక సాకుతో ఎందుకు హింసిస్తారామెను అత్తమామలు...?

ఇదంతా ఎక్కడో కాదు... మన ముందే, మన చుట్టుపక్కలే జరుగుతోంది. రేపు మనింట్లో కూడా అలానే జరుగుతుందా?

ఆడపిల్లల హృదయ వేదనను, అత్తింటి ఆరళ్లను కరుణామయంగా చిత్రించారు 'రక్తం కార్చిన కాటుక కళ్లు'లో రచయిత యం. విశ్వనాథ్.



రాసినవి తక్కువేగానీ వాసి బాగుండాలనే పట్టుదలగల యువ రచయిత యం.విశ్వనాథ్. "పట్టణంలో బ్రతుకుదామని" అనే నవల పుస్తక రూపంలో ప్రచురితం కాగా, కొన్ని కథలు వివిధ పత్రికల్లో వచ్చాయి. తను రాసిన ప్రతి రచనకూ మంచి ప్రోత్సాహం లభిస్తోందని సంతృప్తి వెలిబుచ్చే ఈ యువ రచయిత డిగ్రీ పూర్తిచేసి మహబూబ్‌నగర్ జిల్లా నాగర్‌కర్నూల్‌లో వ్యాపారంలో స్థిరపడ్డారు.

# రక్తం కార్చిన కాటుక కళ్ళు



నాలుగు గదులున్న పెంకుటిల్లు. విశాలమైన ఆవరణలో స్వచ్ఛత కొట్టవచ్చినట్లుగా వుంది. అస్తమిస్తున్న సూర్యుడు అరుణ వర్ణంలో మెరిసిపోతున్నాడు. ఆవరణలోని గులాబీచెట్లు ఒక్కసారిగా వీచినగాలికి వింజామరల్లా వూగుతున్నాయి. గులాబీలు ఎర్రగా మెరిసిపోతున్నాయి. ఒక క్రమంలో పెరిగిన పచ్చిక కనువిందు చేస్తోంది.

పావని, కమల, జ్యోతి, సరోజ పచ్చికపై కూర్చుని వున్నారు. వారి ఊహల్లో భవిష్యత్తు ఇంద్రధనుస్సులా వుంది.

మరో నాలుగు అడుగుల దూరంలో కూర్చుని ఉన్న వాసుదేవరావుగారి ముఖంలోకి ఆత్రుతగా చూస్తున్నారు వారందరూ. అందం, అణుకువ, వివేకం వాళ్ళ ముఖాల్లో ప్రస్ఫుటిస్తున్నాయి.

"లక్షల సంవత్సరాలక్రితం కోతి రూపాంతరం చెంది మనిషిగా మారాడని సిద్ధాంతపరంగా నిరూపించాడు డార్విన్

వేల సంవత్సరాలుగా నైతికంగా, సిద్ధాంతపరంగా ఎదుగుతూనే వున్నాడు మానవుడు

స్వార్థపూరితులైన కొందరు నైతిక విలువలు కోల్పోయి సమాజం నడిచే బాటలో ముళ్ళు పరిచారు. సమాజగతిలోకి ప్రతీ మానవుడూ ఆ బాటగుండానే పయనించవలసి వస్తోంది.

తెలివైన కొందరు ఆ బాటలో పడిన ముళ్ళను తొలగిస్తూ నడుస్తారు. తమ వెనక వచ్చేవారికి ఏ మాత్రం ఇబ్బందికలగకుండా చూస్తారు

అయినా ఈ గమనంలో స్త్రీకి రక్షణలేదు. సున్నితమైన పాదాలతో ఈ ముళ్ళబాటగుండా పయనించాలి. ఏమాత్రం అజాగ్రత్తగా ముందు కాలిడినా ముల్లుగుచ్చుకుంటుంది.

ముల్లు గుచ్చుకుంటుందని గమ్యం చేరకుండా మొదటి మెట్టుదగ్గరే నిలబడిపోవడం జరగదు. ఇది సృష్టి క్రమానికే విరుద్ధం"

ఈ ప్రయాణంలో స్త్రీ చెడు సాంప్రదాయాలనే ముళ్ళు కాకుండా, క్రూరమృగాల్లాంటి పురుషుల ప్రవృత్తులతో కబళింపబడకుండా గమ్యం చేరాలి.

మీకు నిర్దేశింపబడిన గమ్యమార్గాల్లో మీరు పయనించండి. క్రమబద్ధమైన వేగంతో పూర్తి తెలివిని, అణకువను ఉపయోగించండి. తెలివైన చదరంగ నిపుణుడు తనువేసే ఎత్తు కంటే, ప్రత్యర్థి వేసే ఎత్తు గురించే ఎక్కువగా శ్రద్ధచూపిస్తాడు; అలాగే మీరుకూడా జరుగుతున్న పరిస్థితుల్నే కాకుండా, జరగబోయే పరిస్థితుల్ని కూడా అంచనావేసుకుని ముందుకు సాగండి.

నైతికంగా దిగజారితే వేసే ప్రతి అడుగు భారమే అవుతుంది. ఆత్మశక్తి దృఢమైన విశ్వాసం అనే ఆయుధాలతో మీ గమనంలో ఎదురుపడే క్రూరమృగాల్లాంటి పరిస్థితులను ఎదురిస్తూ వెళ్ళండి"

వాసుదేవరావుగారు చెప్పే ప్రతివాక్యం వాళ్ళలో కల్లోలాన్ని రేపుతోంది.

"స్త్రీ రక్షణలేనిదిగాను, పురుషుడు రక్షణతోనూ సమాజ గమ్యమార్గాల్లో పయనిస్తున్నారని మీరు చెప్పిన విషయం సరిగ్గా అర్థం అవుతోంది. స్త్రీ పురుషుడు మచ్చిక చేసుకున్న జంతువులాంటిది. ఆమె ఎదురుతిరిగే పరిస్థితి రాకుండా రాక్షసబలంతో స్వేచ్ఛను హరిస్తూ లాక్కున్నాడనిపిస్తోంది" అంది జ్యోతి.

"కొన్నివేల సంవత్సరాలక్రితం మాతృస్వామ్య వ్యవస్థ వుండేది. పురుషుల్ని చెప్పుచేతల్లో వుంచుకుని ముందుకుసాగారు స్త్రీలు. ఇప్పుడు పితృస్వామ్యం వుంది. కొన్ని భౌతిక బలహీనతలవల్లనే స్త్రీ పురుషునికి లొంగి వున్నట్లుగా తోస్తుంది. ఆ బలహీనత ఏమిటో. అది ఏవిధంగా స్త్రీ పురోగమన మార్గాన్ని అడ్డుకుంటున్నాయో తెల్సుకోవాలి. వాటిని తొలగించవలసిన అవసరం గురించి ఆలోచించవలసిన పరిస్థితి ఏనాడో ఏర్పడింది. కనీసం మీతరం అయినా ముందుకు దూసుకువెళ్ళి మీస్థానం యొక్క విశిష్టతను నిరూపించవలసిన సమయం ఆసన్నమయింది..." ఆగారు ఆయన.

"నైతికంగా దిగజారితే వేసే ప్రతి అడుగు భారమౌతుందని మీరు అన్నారు. ఇప్పుడున్న నైతిక సిద్ధాంతాలన్నీ మనవాళ్ళు సాంప్రదాయమనే ముసుగుకప్పి మనముందు వుంచినవే. సాంప్రదాయాలన్నీ చెడ్డవనికాదు, కాని స్త్రీ

విషయంలో ఏర్పరచిన సాంప్రదాయాలన్నీ స్త్రీని బానిసగా వుపయోగించుకోవడానికి పనికి వచ్చేవే! నైతిక సూత్రాలన్నీ సాంప్రదాయ సిద్ధమైనవే. ఈ ఉచ్చులోంచి బయటపడే ప్రతి స్త్రీపైనా నైతికంగా దిగజారిందనే ముద్రపడుతుంది. మరీ స్త్రీకిదారి...?'' సరోజ ఆవేశంగా అడిగింది.

వాసుదేవరావుగారు అందుకున్నారు-

''నూరు సంవత్సరాల క్రితం సహగమనం అనేది నిత్యకృత్యం. ఈ కాలంలో ఏస్త్రీ అయినా సహగమనం చేయటం సంగతలా వుంచి, ఆ మాట ఎత్తితే అసహ్యంగానూ, ఎబ్బెట్టుగానూ వుంటుంది. సహగమనానికి కూడా మనవాళ్ళు ఏర్పరచిన సాంప్రదాయమే కారణం. ఆ తర్వాత కొత్తగా వచ్చిన తరం సహగమనాన్ని రూపుమాపింది. దీన్నిబట్టి మనకు తెలిసేది ఏమిటంటే- ఒక తరంలోని నైతికవిలువ మరో తరంలో కుసంస్కారమౌతోంది. ఈ విషయం ప్రతి ఒక్కరూ సీరియస్‌గా ఆలోచించుకోవలసిన విషయం. నేను వివరించి చెబితే ఇప్పుడున్న సాంప్రదాయానికి వ్యతిరేకమౌతుంది. ఆఖరిమాటగా మీరు మీ వంతుగా సాంప్రదాయంలోని చెడును తొలగిస్తూ వెళ్ళండి''

వాసుదేవరావుగారి వాక్కులు వింటూనే నలుగురిలోనూ కొంత కలవరం, అసహనం చోటుచేసుకున్నాయి.

చీకటిపడటంతో నలుగురూ లేచి నుంచున్నారు. కమల, జ్యోతి, సరోజ వాసుదేవరావుగారికి నమస్కరించి వెళ్ళిపోయారు. పావని తండ్రి వెంట ఇంట్లోకి నడిచింది.

నలుగురూ కొత్త పెళ్ళికూతుళ్ళు, అత్తవారిళ్లకి వెళ్ళి భర్తలతో కాపురం చేయడానికి సిద్ధమైవున్నారు.

★ ★ ★

నల్లటి వస్త్రంపై రత్నాలు చల్లినట్లుగా ఆకాశం నిండా నక్షత్రాలు. పున్నమికి దగ్గరపడుతున్న చంద్రుడు. ఆగిఆగి వీస్తున్న చల్లగాలి. దూరంగా తెలుగు పాటలు వినిపిస్తున్న మైక్ సెట్. పక్షులు తీరికగా కూర్చునే విధంగా మెల్లగా కొమ్మల్ని కదుపుతున్న చెట్లు.

ప్రకృతి విశ్రాంతి తీసుకుంటోందా ఏమిటి? అనుకున్నాడు శ్రీకాంత్ డాబాపై నిలబడి.

భార్యరాకకోసం రెండు గంటలుగా ఎదురు చూస్తున్నాడు. కొంతసేపు వీక్లీ తిరగేశాడు. చిరాకేసినా చదివిన కథలే మళ్ళీ చదివాడు. ఎంతకూ భార్య రాకపోవడంతో వీక్లీని విసిరికొట్టాడు. పావనిపై గొంతువరకు కోపం వచ్చింది.

దగ్గర చప్పుడు వినిపించడంతో పావని వస్తోందని తెలిసి రూంలోకి వెళ్ళి లైట్ ఆఫ్ చేసి నిండా బ్లాంకెట్ కప్పుకొని పడుకున్నాడు.

''ఛీ ఛీ... ఈ బతుకుకు ఎప్పుడు ఫుల్‌స్టాప్ పడుతుందో ఏమో! మధ్యతరగతి కుటుంబాల్లో ఆడదై పుట్టేకంటే అడవిలో మానై పుట్టడంమేలు'' అంటూ లైట్ ఆన్ చేసింది పావని.

మల్లెపూలదండ జడలో తురుముకుంది. చీర తడిగా ఉండటంతో విప్పి వేసి మరో చీర కట్టుకుంది. జాకెట్ నిండా మరకలున్నాయని హుక్స్ తీసింది. భుజాల దగ్గర టైట్ కావడంతో, లాగుతూనే జాకెట్ చిరిగిపోయింది.

''అసలే జాకెట్లు లేక చస్తూవుంటే ఈ ఏడ్పుకూడానా'' అన్న పావని మాటలకు శ్రీకాంత్ బ్లాంకెట్ కొంచెంగా తప్పించి పావని వైపు చూశాడు.

పావని నాలుక బయటపెట్టి, ''అమ్మో... సెన్సార్‌వాళ్ళున్నారు, కట్ చేస్తారు! మా చిన్నిబాబుకదూ... హాయిగా ముసుగేసుకుని పడుకో'' అంటూ ఆచ్ఛాదనలేని వక్షం చుట్టూ చీరకొంగును తిప్పుకుంది.

''అందాలరాణి దిగివచ్చిందా ఏం? నువ్వేం రంభ, ఊర్వశివా కళ్ళు తెరుచుకుని చూడటానికి! నిన్ను ముక్కలుగా నరికేయాలన్నంత కోపంగా ఉంది నాకు. రెండు గంటలనుంచి చూసిచూసి ఎంతగా విసిగిపోయానో నీకేమైనా అర్థమౌతోందా? అర్ధరాత్రి దాటినా ఏమిటి అంత తీరికలేని పనులు. ఎన్ని వంటకాలు చేశావేమిటి? పక్కింటి అనసూయమ్మతో బాతాఖానీ వేసుకుని కూర్చున్నావు కదూ! భర్త అనేవాడొకడు డాబాపై నీ కోసం ఎదురు చూస్తూంటాడన్న జ్ఞానం కూడా లేదే! ఎంత పొగరెక్కింది నీకు? నన్ను ఏడిపించాలని కదూ ఈ నాటకం అంతా! నా ఓపికకు

# సితార లో

## శీర్షికలు


మీ అభిమాన తారల ఇంటర్వ్యూలు!
అందాల తారల రంగుల ఫోటోలు!
మిమ్మల్ని మీ అభిమాన తారలతో కలిపే 'మీట్ మిస్టర్...' 'మీట్ మిస్...' వంటి శీర్షికలు!
వారం వారం రూ.200/- బహుమతులతో 'సితార పదరంగం'
అగ్రనటులు పాల్గొని విజయవంతం చేస్తున్న
సీరియల్!
ఒక వారం కొని చదివితే మీకే తెలుస్తుంది!

పరీక్ష పెడుతున్నావుకదూ? 'నీవు లేకుంటే నేను బతకలేను' లాంటి బుద్ధితక్కువ మాటలు చెప్పాలనేకదూ ఇదంతా? మీ ఆడవాళ్ళు ఇలాగే నెత్తికెక్కి కూర్చుంటారు! అసలు మీ ఆడవాళ్ళను..." కోపంతో ఉరుముతున్నాడు శ్రీకాంత్.

పావనికి అంతులేని కోపం ముంచుకు వచ్చింది "ఆడవాళ్ళను నరికి పోగులు వేసి ఉప్పులో నంజుకుని పిండారగించండి! అప్పుడుగాని మీ మగవాళ్ళు సంతుష్టిపడరు! అక్కడికేదో నేను తీరిగ్గా సినిమా చూసివచ్చినట్లు ఎన్ని ఆడిపోసుకుంటున్నారు? పొద్దుటినుంచి వచ్చేలా పనిచేస్తే మీరిచ్చే బిరుదులా ఇవి? ఎందుకండీ ఇంత భయంకరంగా మాట్లాడతారు? రెండు వందల సంవత్సరాల క్రితం అమెరికావాళ్ళు నీగ్రోలను కొని ఇలాగే బాధించేవారట! తిట్టండి... తిట్టండి... మీ నోటికి వచ్చినట్లుగా..." వెక్కిళ్ళతో కూడిన ఏడ్పువల్ల ఆమె ఎద ఎగిసెగిసి పడుతోంది.

శ్రీకాంత్ కరిగిపోయాడు. "ఏమైనా అంటే ఏడ్పు. ఇంతసేపైనా ఎందుకు రాలేదని అడిగినంతలోనే?

"ఎందుకండీ అబద్ధమాడతారు. అంత తిట్టీ ఏమీ అననట్లుగా మాట తిప్పడం..." కళ్ళు పెద్దవి చేసింది పావని.

శ్రీకాంత్ కరిగి నీరైపోయాడు. బ్లాంకెట్ విసిరి మెల్లగా పావని దగ్గరగా వచ్చాడు.

పావని దూరంగా జరిగి, "నన్ను ముట్టుకోకండి, జరిగిన సన్మానం చాలు" అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది.

శ్రీకాంత్ ముందుకు జరిగాడు.

పావని మరింత వెనక్కి జరిగి అలమారాను ఆనుకుని నిలబడింది.

"పావనీ... నామాట వినవూ? కోపం పట్టలేక అన్నాను" శ్రీకాంత్ ముందుకు వచ్చి ఆమె చుబుకాన్ని ఎత్తాడు. పావని కన్నీళ్ళు అతని చేతుల్ని తడిపాయి.

శ్రీకాంత్ చూపుడు వేలుతో ఆమె కన్నీళ్ళు తుడిచి "పిచ్చిదానా... ఈ మాత్రానికే ఏడుపా? నేను నీ భర్తనుకాదూ? ఏమైనా తప్పుగా మాట్లాడినా క్షమించలేవా?" అంటూ రెండు చేతులూ ఆమె నడుంచుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నాడు.

చటుక్కున శ్రీకాంత్ చేతుల్ని విసిరికొట్టి, "భలేగా మాట్లాడతారు మీరు! నేనేం కిందు లడ్డూలు తింటూ కూర్చున్నానా? మీ అమ్మగారు అంతులేని పని నా నెత్తిమీద రుద్దారు. పొద్దున్నే లేచుకునే అంట్లు ఈ రాత్రే తోమించారు. మీరు పొద్దున్నే డ్రాయర్లు, బనీనులు, లుంగీలు లేవని విసుక్కుంటారని ఉతికేశాను. ఈ అదను చూసి మీ అమ్మగారు మామగారి ప్యాంటు, షర్టు, ఆమె చీర, రవిక తెచ్చి బాత్‌రూమ్‌లో వేశారు ఉతకమని. అవి ఉతుకుతూనే మామగారు ఆయన ప్యాంటు, షర్టు ఐరన్ చేయమన్నారు. అవి చేసేసరికి మీ చెల్లెలు, తమ్ముడు తలో బట్టల కుప్పతెచ్చారు ఐరన్ చేయమని"

నీకేమయింది నరేష్ 'నీబట్టల్ని నీవే ఐరన్ చేసుకుంటావుగా!' అనే లోపునే మీ అమ్మగారు 'నీవు పైకి వెళ్ళి అర్జంటుగా చేసే పనులేమున్నాయి. వాడు క్లాస్ పుస్తకాలు చదువుకుంటాడట' అంది. నా గొంతు పిసికి చంపివేస్తే ఆమెకు హాయిగా ఉంటుంది. ఇంతా చేస్తే వాళ్ళు చదివేది క్లాస్ పుస్తకాలు కాదు క్లాస్ పుస్తకాల్లో ఇరికించుకుని డిటెక్టివ్ నవలలు చదువుతున్నారు. సరే అన్నీ ఐరన్ చేసి బీరువాలో పెట్టి పైకి వద్దామనుకునేంతలో 'నీళ్ళు రూములో పెట్టి వెళ్ళు అమ్మాయ్' అన్నారు మీ నాన్నగారు. టేబుల్‌పైన నీళ్ళు పెడుతూంటే 'పైళ్ళన్నీ చిందరవందర అయినాయి, సర్దిపో' అన్నారు. సర్ది బయటకు వస్తుంటే 'వంటింటి కిటికీ సరిగా మూశావా? పాడుపిల్లి. తోడుపెట్టిన పాలన్నీ తాగుతుంది' అని మీ అమ్మగారి హెచ్చరిక. సరిగానే వేశానత్తయ్యా అంటే, మళ్ళీ చూసి రమ్మని ఆజ్ఞ. తలుపులన్నీ తెరుస్తూ వంటింట్లోకి వెళ్ళి చూసి మళ్ళీ తలుపులన్నీ మూసుకుంటూ ముందు రూములోకి వచ్చేసరికి 'వదినా, పక్క వేసి వెళ్ళవూ" అని మీ తమ్ములుంగారు పురమాయించారు ఈ బానిసని. ఆయనగారి పక్క వేస్తూనే, మీ చెల్లెలు మూతి ముడుచుకుంటే ఆమె పక్క కూడా వేసి మెట్లెక్కేంతలో మీ అమ్మగారు 'అమ్మాయ్' అని ఆప్యాయంగా

పిలిచింది మేకగొంతు కోసే ముందు కసాయి వాడు దాని జూలు దువ్వినట్లుగా. ఆమె అమ్మాయ్ అన్నదంటే కాళ్ళు పట్టించుకునే పనే. దగ్గరకు వెళుతూనే 'కాళ్ళు లాగుతున్నాయి' అంది. ఆవిడగారి కాళ్ళను ఎంత సేపు మర్దన చేసినా తృప్తి తీరనేతీరదు. ఎంతకూ 'చాలు' అని అనదు. ఆమెకు కునుకు పట్టేవరకు కాళ్ళు పడుతూనే ఉన్నాను. గురకపెడుతూనే ఇలా వచ్చాను'' అంది పావని.

''టౌన్ రోడ్లు మొత్తం ఊడ్చిరావల్సింది! డ్రయినేజి మొత్తం క్లీన్ చేసి రావలసింది. నీవొక ఫూలిష్ ఉమెన్‌వి... ఎన్నిసార్లు చెప్పినా అర్థం చేసుకోవు. వెట్టి చాకిరి చేసుకుంటూ నన్ను ఆడిపోసుకుంటావు''

''మీరు బాగానే మాట్లాడతారు. ఒక్కరిమాట వినకపోతే ఎన్ని దీర్ఘాలు... ఎన్ని తిట్లు... ఎన్ని శాపనార్థాలు... మీకన్నీ తెలిసినా నన్నే అంటారు''

''చేసేదానివి నీవు ఉన్నప్పుడు నాకేం కష్టం...'' అంటూ ఆమె భుజంమీద చేయి వేశాడు.

పావని దుఃఖం పూర్తిగా తగ్గిపోయింది. మెల్లగా ''ఏమండీ... జాకెట్ పీసులు రెండు, ఒక చీర తీసుకురారూ! కట్టుడుకు చీరలే లేవు'' అంది.

''ఇక్కడేదో లక్షలు ఉన్నట్లు, నీకు తెలియంది ఏముంది?''

''సరేలెండి.... ఒక చెట్టుకొమ్మలేగా అన్నీ'' మూతి విరిచింది పావని.

శ్రీకాంత్‌కు కోపంవచ్చింది. ''ఆమాట అనవద్దని ఎన్నిసార్లు చెప్పాలి నీకు? నేనేం నిన్ను కొట్టానా? మావాళ్ళలా ఊపిరి సలపని పనులు చెప్పానా? పరిస్థితులన్నీ నీకు తెలిసికూడా అలానే మాట్లాడుతున్నావు. ఉద్యోగం కోసం నేనెంతగా ప్రయత్నం చేస్తున్నానో చెప్పడానికి ఆ భగవంతుడేసాక్షి. యం.ఎ. హిస్టరీ చేసి సంవత్సరం దాటింది. ఎన్ని ఇంటర్వ్యూలకు వెళ్ళానో లెక్కేలేదు. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజినుంచి ఒక్క ఉత్తరం కూడా రాలేదింతవరకు. నీవల్లనే బతుకుతున్నాను!

నెలనెలా నీవిచ్చే ఆ రెండువందలూ లేకుంటే పిచ్చివాడినైపోయేవాడిని. ఉద్యోగం వస్తూనే నీవిచ్చిన డబ్బుకు వడ్డీ కలిపి ఇచ్చేస్తాను''

''ఇచ్చారులేండి మాలావున. తమరికి ఉద్యోగం వచ్చేదెన్నడో, ఈ అమ్మాయిగారి కోరికలు తీరేదెన్నడో?''

''నీవే నాకోరికలు తీరుస్తున్న దేవతవు. ఈ దాసుడు తమకు ఏకార్యం చేయమన్నా సెకన్లలో చేస్తాడు.....''

''రెండు బ్రాలు, జాకెట్‌పీస్‌లు తెమ్మని వారం రోజుల క్రితం డబ్బుఇస్తే ఇంతవరకూ తీసుకరానేలేదు''

''నీకు తెలియంది ఏముంది? ఖర్చయిపోయాయి''

అలా అయితే జాకెట్లు లేకుండా వడ్డెరవాళ్ళలా తిరుగుతాను. బ్రాల సంగతికివస్తే ఒకటి దొరకడంలేదు, మరొకటి తెగిపోయింది. మూడు రోజులుగా బ్రాలు లేకుండా జాకెట్లు వేసుకుంటున్నాను''

బ్రాలు మాత్రమే లేకుండా ఉండటం ఎందుకు, ఏకంగా జాకెట్టే తీసేసెయ్! పురజనులను చరితార్థులను చేసేసెయ్! నేను కూడా వాళ్ల జతకు క్యూలో నిలబడతాను.''

''మీకేం... ఎన్నయినా మాట్లాడతారు! మీ మగాళ్ళకు ప్రేమలు ఉండనే ఉండవు; మా ఆడవాళ్ళే 'ప్రేమ' 'ప్రేమ' అని తపించిపోతారు. మేము ఎలావున్నా ఏమయినా ఫరవాలేదు మీకు! రెండుపూటలు తిండి వండిపెట్టి, బండచాకిరీ చేస్తూవుండాలి. ఇన్ని చేస్తూ అనుక్షణం మీకు బెదురుతూనే ఉండాలి. ఏమాత్రం మాపైన జాలి లేదుమీకు!''

''నీమీద నాకేం ప్రేమలేదంటావు?'' అమెకు పూర్తి దగ్గరగా జరిగి నడుంచుట్టూ చేతులువేశాడు.

పావని అతని చేతుల్ని విసిరికొట్టలేదు. మరింత దగ్గరిగా ఒదిగిపోతూ ''బ్రాలు తీసుకురమ్మని చెప్పడం ఇది వందోసారి!'' అంది.

''డబ్బులు లేవుగా....''

''నేనిస్తాగా''

''రేపు తీసుకువస్తాను నాకు కొంత లోన్

కూడా శాంక్షన్ చేయాలి''

''మీకు అప్పు ఇవ్వడమా! చిన్నప్పటినుంచి నేను కూడబెట్టుకున్న నాలుగువేలు రాజేశారు. దివాళా ఎత్తేశాను. మరో అయిదువందలు మిగిలి ఉన్నట్లున్నాయి అకౌంట్‌లో. చూసి ఖర్చుపెట్టుకోండి, తర్వాత మీకే ఇబ్బంది అవుతుంది''.

శ్రీకాంత్‌కు ఆమె ముఖంలోకి చూసే ధైర్యం లేకపోయింది. కడిగిన ముత్యంలా మెరిసిపోతోంది పావని. స్వచ్ఛమైన అంతరంగం, ఆమె బాహ్యసౌందర్యాన్ని కూడి అనూహ్యమైన అందంతో శ్రీకాంత్‌కు కనిపించింది.

పావని పనిలో ఉన్నప్పుడు, వంటింట్లో ఎవ్వరూ లేకుండా చూసి వెనగ్గా వెళ్ళి ఆమెను కౌగిలించుకోవడం శ్రీకాంత్‌కు అలవాటు.

''ఏమిటండీ! మీరు మరీనూ.... గిన్నెకింద పడిపోతే ఇంకేమైనా వుందా!'' అంటూ విడిపించుకుంటుంది పావని. ఒక్కొక్కసారి పావనిని రెండు చేతుల్తో చంటిపిల్లవాణ్ని పైకి ఎత్తినట్లు ఎత్తి తిప్పి వదిలేవాడు.

''హమ్మయ్య... మీకెంతబలమండీ.... నేనెంతభయపడ్డానో తెలుసా.....'' గుండెమీద చేతులు వేసుకోవడం అలవాటు పావనికి.

కొన్ని సమయాల్లో ఎంతపిలిచినా పావని పైగదికి రాకపోవడంతో ఆమెను భుజంపైన వేసుకుని డాబాపైకి తీసుకెళ్ళేవాడు. పావని గింజుకున్నా ప్రయోజనం లేకపోయేది.

''మీకొక్కరికే బలముందని అనుకుంటున్నారా? నేనూ పైకెత్తగలను!'' అనేది పావని

శ్రీకాంత్ నవ్వి- ''నన్ను పూర్తిగా ఎత్తవలసిన అవసరంలేదు.... అంగదుని కాలు జరపడానికి రాక్షసులు తంటాలుపడ్డట్లుగా, నీవు నాకాలు జరుపు చాలు'' అనేవాడు.

పావని ఎంతకష్టపడ్డా, శ్రీకాంత్ కాలుజరపడం కూడా చేతకాకపోయేది. స్వేదాన్ని తుడుచుకుంటూ- ''మీరు గత జన్మలో కోడిరామ్మూర్తి శిష్యరికం చేసి ఉండవచ్చు'' అనేది.

సంపెంగలోని మత్తు, గులాబీల కోమలత్వం, వెన్నెలలోని చల్లదనంతో, కలబోసిన కోమలి పావని.

అమాయకత్వం ఆమె ముఖంలో పవిత్రతలా గోచరిస్తుందికాని తెలివితక్కువతనాన్ని సూచించదు. ఆమె మనసు ఒక క్రమబద్ధమైన ఆలోచనాసరళిలోనే సాగుతోంది. మనుమల లోని వక్రగతుల్ని ఆమె ఎక్కువగా అంచనావేయలేదు. అనంతమైన ఆకాశంలో స్వేచ్ఛగా తిరిగే విహంగాల్లా, జీవితంలో స్వేచ్ఛను కోరుకుంది. గట్లు తెంచుకుని పారే సెలయేరులా సాగితేగాని జీవితంలోని మకరందాన్ని చవిచూడగలరన్న సత్యం తెలియదు ఆమెకు.

అవసరాలకు పావనిని వాడుకోవడమేకాని, ఆమె అవసరానికి క్షణమైనా తీరిక వుండదు అత్తవారింట్లో ఎవరికీ.

శ్రీకాంత్‌కు వీలయినంత తొందరగా పావనిని ఈ ఊబిలోంచి లాగాలని ఉంది. కానీ ఎంతప్రయత్నం చేసినా ఉద్యోగం దొరకడంలేదు. ఉద్యోగం తనకంటే పావని కోసం ముఖ్యం. తల్లిదండ్రుల సైకాలజీ తనకు తెలుసు. రెండు నిముషాల వాదనతో వాళ్ళనోళ్ళు మూయించడం కూడా తనకు చేతకాదు. అప్పుడు తన ఎదురుగా పావనికి పని చెప్పడానికి కూడా సాహసించరు ఎవ్వరూ! తను ఇంట్లోంచి బయటపడుతూనే కాకుల్లా ఆమెపై పడతారు.

పావనిని మార్చడం శ్రీకాంత్‌కు సాధ్యం కావడంలేదు. ఇరవయి నాలుగు గంటలూ ఏ పనిచేసినా తృప్తిపడనివారికోసం, తన శక్తినంతా ధారపోస్తోంది పావని. ఎదిరించే గుణం ఆమెలో పూర్తిగా లోపించిందని శ్రీకాంత్ తృప్తి పడలేకపోయాడు. వాదనలో తనకు దీటుగా మాట్లాడే పావని ఇంట్లో వాళ్ళను బెదిరించక ఇంత ఉదాసీనంగా ఎలా వుండగలుగుతుందో శ్రీకాంత్‌కు అర్థంకాలేదు.

పావని కష్టానికి బాధ్యత తనదే. యం.ఎ ఫస్ట్‌క్లాస్‌లో పాసయినా తనకు ఉద్యోగం దొరకడంలేదు. సంపాదన అనేది ఏమార్గంలో వెళితే లభ్యమౌతుందో అర్థంకావడంలేదు. ఈ లేమి పావనికి మోయలేని భారమౌతోంది. ఈ భారంతో ఆమె కృంగిపోకముందే తను ఏదైనా మార్గాన్ని వెతకాలి. ప్రకాశవంతమైన వజ్రాన్ని మసిగుడ్డలో కట్టినట్లుగా, తక్కువ జీతంతో తృప్తిపడితే పావనిని దుఃఖంవైపు లాక్కువెళ్ళడమే అవుతుంది. వజ్రాన్ని మేలిమి బంగా

రంలో పొదిగినట్లు పావనిని సుఖపుటుయ్యాల పై ఊపగలగాలి.

మనిషి క్రియలో లోపంలేనప్పుడు, ఎదురయిన పరిస్థితులను ఎదురీదడంలో ఎంతో దుఃఖం ఉంది. ఆలోచనా వేగంకంటే ఎక్కువగా జీవితంలో పరిస్థితులు క్షణక్షణానికి మారుతుంటాయి. పరిస్థితులకు అనుగుణంగా తను మారాలి. జీవితమనే పరుగు పందెంలో ఆఖరివాడిగా మిగిలిపోయే పరిస్థితి సంభవిస్తుంది. పరిస్థితులను ముందుగానే అంచనా వేసుకోవడం తెలియకపోవడంవలన అనుకున్నాడు శ్రీకాంత్.

"ఏమిటీ? తల అలావుంచి ఆలోచనల్లో పడిపోయారు?" అంది పావని.

"నీ గుండె చప్పుడు వింటూ మత్తులో నిద్రపోతున్నాను"

"ఏమంటోంది నాగుండె?"

"శ్రీకాంత్ శ్రీకాంత్ అంటోంది"

"అలానేం? అదో పెద్ద అబద్ధం! నీపైన కోపంతో నా గుండె త్ంకాశ్రీ అంటుంది"

"ఛీ... ఛీ నా పేరు అలా తిప్పి పలకవద్దని ఎన్నిసార్లు చెప్పాను!"

"నీవంటే నాఇష్టం లేనప్పుడు నేను అలానే మాట్లాడుతాను"

ఆమెను మరింత దగ్గరగా హత్తుకుని-- "ఎందుకమ్మా నామీద అంతకోపం" అడిగాడు శ్రీకాంత్ లాలనగా

బుంగమూతితో "తిట్టావుగా!" అంది పావని.

"నేను నిన్ను తిట్టడం అంటే, నన్ను నేను తిట్టుకోవడం"

"సమర్థించుకోవడం బాగాచే తనవును"

"నా మనసునిండా నీవే వున్నావు. అటువంటప్పుడు నా మనసాక్షి అబద్ధం చెప్పదు. ఇక సమర్థించుకునే ప్రసక్తేలేదు"

"మీలో మాటకారి తనముంది"

"ఇదే... నీలోని తప్పు... నేను కోప్పడితే మూతి ముడుచుకుంటావు. ప్రేమగా మాట్లాడితే మాటకారితనమంటావు అంటే దీని అర్థం? నాలో మాటకారి తనం తప్ప నిజమైన ప్రేమలేదని ఎత్తిపొడవడమా?"

"ప్రేమట ప్రేమ... ఎంతప్రేమ ఉందో చెప్పండి చూద్దాం?"

"ఊ... చెప్పనా... హమ్‌తుమ్ ఎక్ జంగల్ సే గుజరే ఔర్ షేర్ ఆజాయ్: షేర్‌సే మై కహూంగా తుమె ఛోడ్‌కే ముఝెఖాజాయ్ అని"

"ఏమో... మీ హిందీ పాట నాకు అర్థంకాలేదు".

"అలానేం. తెలుగులో చెప్పేదా? మనిద్దరం కీకారణ్యంలో పోతూవున్నాం... మన ఎదురుగా ఆకలితోవున్న పులి గాండ్రిస్తూ నిలబడివుంది. అప్పుడు నేను పులితో అన్నానుకదా 'పులి తల్లీ... అమాయకురాలు, మంచి అమ్మాయి అయిన పావనిని విడిచిపెట్టి నన్ను తినేసెయ్' అని అంటాను"

"అలాగా... నేనూరుకుంటానా? మంచివాడే కాని, కోపమొస్తే మాచెడ్డవారు మావారు! మంచి అందగాడు. నేను చనిపోయినా మరో అందమైన అమ్మాయి దొరుకుతుంది. నన్నే తినేసెయ్ అని నేను ముందుకుపోతాను"

"నేనుమాత్రం నిన్ను ముందుకు పోనివ్వను, నేనే ముందు నిలబడి దానికి ఆహారమౌతాను"

"నేనూరుకుంటానా? ఏకంగా దాని నోట్లోనే తలపెట్టేస్తాను, మా శ్రీవారిని రక్షించుకోవడానికి"

శ్రీకాంత్ ఆమెను మరింత గట్టిగా హత్తుకున్నాడు.

ఆమె అతని తలవెంట్రుకల్లోకి వేళ్ళనుదూర్చి, సున్నితంగా అతని కళ్ళను, పెదాలను ముద్దుపెట్టుకుంది.

★ ★ ★

నీళ్ళు తిరిగిన కళ్ళతో కిటికీలోంచి బయటకుచూస్తూండిపోయింది కమల.

చెట్టుకొమ్మలు పిల్లగాలికి కదులుతూనే దానిపైనవున్న పక్షి ఎగిరిపోయింది. ఇంతరాత్రి వరకు పక్షి ఎందుకోసం నిరీక్షిస్తోంది? తన జంటకోసం ఎదురుచూసి విసిగి ఎగిరిపోయినట్లుంది. పక్షులకు కూడా తోడుకావాలి జీవితగమనానికి! తనకే తోడులేదు. అత్తవారింటికి




అడుగుపెట్టిన పదిహేను రోజుల్లో తెలిసిపోయింది భర్త సంగతి.

ఎంత ఏడ్చి ప్రయోజనమేముంది? బతుకంతా అడవిగాచిన వెన్నెల్లా అయింది. మూర్ఖుడయిన భర్త, అజ్ఞాని అయిన అత్త, పరమ మూర్ఖుడయిన మామగార్లమధ్య జీవితాన్ని సాగించాలి.

కింద తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. రమేష్ వచ్చి వుంటాడని అనుకుంది. "కమలా" అని అత్తగారు కిందనుంచి కేక వేసింది. తలుపు తీయడం కూడా ఆమెకు బద్ధకంఅని తెలిసి కిందికి దిగివచ్చింది.

తలుపు తెరుస్తూనే రమేష్ వేగంగా లోపలికి వచ్చాడు. "పైన కూచుని నువ్వు వెలగబెట్టే పనులేమున్నాయి? కిందనే వుండకూడదా? సమయం దొరికితేచాలు పైకి వెళ్ళడం. అసలు తిన్నది అరగకే పైకీకిందకీ తిరుగుతున్నట్టున్నావు. పల్లెల సంగతి సరిగా తెలియనట్టుంది నీకు? ఆడవాళ్ళు మొత్తం వ్యవసాయం పని దగ్గరుండి చేయిస్తారు. నువ్వు వున్నావు...." అంటూనే కమలవైపు కోపంగా చూసి బాత్‌రూమ్‌వైపు దారితీసాడు.

కమల అలాగే నిలబడిపోయింది.

"నేను కాళ్ళు కడుక్కునేలోపున పీటవేసి, అన్నం వడ్డించ లేకపోయావా? అసలు మీ అమ్మానాన్నల్ని అనాలి నీకు బుద్ధి నేర్పనందుకు!" అన్నాడు బాత్‌రూంనుండి తిరిగచ్చి.

త్వరగా అన్నీ సర్దింది కమల. అన్నంముందు కూర్చుని పళ్ళెంలో చెయ్యి పెడుతూనే-- "ఛీ... ఇంత చల్లగా వుందేమిటి? నేను వచ్చేవరకు రాత్రవుతుందని తెలుసుగదా! నాకోసం మరో గిన్నెలో వేడిగా వండలేకపోయావా? ఈ కూరలేమిటి చప్పగా వున్నాయి. నీవే చేశావా? అమ్మ అయితే ఇలా చేయదు. అయినా నీకు పనిరాదు. పాటారాదు శుద్దమొద్దువు...."

కమలకు ఎదురు చెప్పాలని అనిపించలేదు. తను ఒకమాట అంటే పది మాటలంటాడు రమేష్.

భోజనం ముగించి తేన్చుతూ లేచాడు రమేష్. లేస్తూనే వంటసామాగ్రి సర్దడానికి ఉపక్రమించింది కమల.

"ఇవన్నీ తర్వాత తీయవచ్చు. వక్కపొడి ఎక్కడుందో ఇచ్చిచావు" అన్నాడు రమేష్ చేతులు తుడుచుకుంటూ.

కమల వక్కపొడి డబ్బాతెచ్చి రమేష్‌కు ఇచ్చి ఎంగిలి ఎత్తి ప్లేట్ కడిగింది.

తినబుద్ధేయకున్నా తనూ అన్నం పెట్టుకుని కూర్చుంది. ముద్ద గొంతులోకి దిగడమేలేదు. గొంతులో ఏదో అడ్డుకున్నట్టుగావుంది. కళ్ళలోంచి నీళ్ళు ఏకధారగా కారుతున్నాయి. ఏడ్పుతోపాటు వెక్కిళ్ళు కూడా వస్తున్నాయి. బలవంతాన ఏడ్పు శబ్దం బయటకు రాకుండా ఆపుకుంది. ఏడ్వడానికి కూడా స్వాతంత్ర్యంలేదు.

వంటిల్లు పూర్తిగాసర్ది బెడ్ రూమ్‌లోకి దారితీసింది. రమేష్ కమలను చూస్తూనే "ఇంత సేపా తినడం? భర్త ఎదురుచూస్తుంటాడు తొందరగా పని ముగించుకుని వెళ్ళాలి అన్న జ్ఞానం లేదా నీకు?" అంటూ మంచంపై పడుకున్నవాడు లేచి కూర్చున్నాడు.

కమల మంచానికి దూరంగా నిలబడిపోయింది.

"బోల్టువేసి మంచం దగ్గరకువచ్చి చావు" రమేష్ కసురుకున్నాడు.

అతను చెప్పినట్టుగానే బోల్టువేసి మంచందగ్గరకువచ్చి నిలబడింది.

"రోజూ పాఠం చెప్పినట్టు చెప్పాలా? మంచంపైకివచ్చి కూర్చోరాదా?"

మంచంపైన కూర్చుంది కమల. ఈరోజు వళ్ళు కొంచెం వేడయింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భారంగా వున్నాయి.

"ఏం... నేనంటే ఇష్టంలేదా?"

కమల మౌనంగా ఉండిపోయింది. తన ఇష్టానిష్టాలతో నిమిత్తంలేదు. తనొక ఆటబొమ్మ. చేతనయినంతవరకు అందరూ తలోరకంగా తనను వాడుకుంటున్నారు. తను నోరుతెరిచి ఒక్కమాటకూడా మాట్లాడలేదు. ఉదయంనుంచీ పొద్దున్నే మామగారి పోరు. ఆయన బయటకు వెళుతూనే అత్తగారి పోరు. మధ్యమధ్య భర్త పోరు. ఆరునెలల అత్తవా

రింటి కాపురంలో తను మనసును చంపుకుంది. బండరాయిని చేసుకుంది హృదయాన్ని. ఎవరేమన్నా కోపంగాని, అసహ్యంగాని అనిపించడంలేదు. మారుమాట్లాడాలని అనుకోలేదు. ఒక మిషన్‌లా పని చేసుకుంటూపోతోంది.

రమేష్ కమలకు దగ్గరగా వచ్చాడు. కమల కదలక మెదలక అలాగే ఉండిపోయింది.

''ఏం.... కదలవేం? అమ్మగారిని అడుక్కోవాలి కాబోలు''

సర్దుకుని పడుకుంది కమల. ''లైట్‌తీసివేయనా...'' అంటూ లైట్ ఆఫ్‌చేసి వచ్చాడు రమేష్.

★ ★ ★

పెళ్లి తర్వాత ఆరునెలల్లో సరోజలో చాలా మార్పువచ్చింది. ఆమె ముఖంలో ఏదో తెలియని ఆకర్షణ గూడుకట్టుకుంది.

యవ్వనంలో ఉండవలసిన నునుసిగ్గులు ఆమెలో లోపించాయి. జీవితం లోతు చూసిన అనుభవశాలిలా ఎటువంటి పరిస్థితివచ్చినా తొణకకుండా ఉండటం నేర్చుకుంది. పైమెరుగుల్లా ఇవి వున్నా వయసులోని లక్షణాలు అంతరంగంలో నిండుకుని ఉన్నాయి. రెండు రకాలైన విరుద్ధ భావాలమధ్య నలిగిపోతూ, ప్రపంచాన్ని అవగాహనచేసుకోవడంలో అస్పష్టత కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది ఆమెలో.

ఆలోచనలు స్థిరంగా ఉండటంలేదు. ఆలోచించడానికి ప్రత్యేకమైన విషయాలంటూ లేకపోయినా, మెదడు ఆలోచనలవైపు పరుగుపెడుతోంది. ఒక కథలా పెళ్లి జరిగిపోయింది. జీవితం తనదే అయినా, తనొక ఆటబొమ్మలా మిగిలిపోయింది. అందరూ తన మేలుకోరేవారైనా, ముఖ్యమైన విషయంలో తన అభిప్రాయాలను గురించి ఎవ్వరూ పట్టించుకోవడమే జరగలేదు. సురేష్‌చేత ఆ మూడుముళ్ళు వేయించేవరకూ. సురేష్ సిటీలో గ్రాడ్యుయేషన్ చేస్తున్నాడు. అన్న శ్రీనివాస్ కూడా సిటీలోనే చదువుతున్నా ఇద్దరిమధ్యా మిత్రత్వంలేదు. సురేష్ తాగుబోతని, తిరుగుబోతని ఆ నోట ఈ నోట తను వినడం జరిగింది. స్వచ్ఛమైన జీవితాన్ని గడుపుతున్న శ్రీనివాస్‌కు సురేష్ నడవడి ఇష్టం అనిపించలేదో ఏమో?

మామగారు వెంకటేశ్వర్లు, అత్తగారు ప్రసూనమ్మ కొడుకు చెడు అలవాట్లు ఏ మాత్రం తెలియకుండా గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి చేసేశారు! పెళ్లి నిశ్చయం అయిన తర్వాత ఆసంగతి శ్రీనివాస్‌కు తెలిసింది. సురేష్ గురించి అన్ని విషయాలు తెలిసివుండి కూడా నోరుమెదపకుండా ఉండిపోయాడు శ్రీనివాస్. ''మేనత్త అయివుండికూడా ఎంత స్వార్థంతో ప్రవర్తించింది ప్రసూనమ్మ'' అనుకుంటూ కుమిలిపోవడం సరోజవంతయింది.

సురేష్ ప్రవర్తనలో సహజత్వం లోపించినా, అతనంటే ఎందుకో ఇష్టం అనిపిస్తుంది తనకు. అతని బాహువుల్లో ఇమిడిపోవాలనిపిస్తుంది. అతని ముందు తన స్త్రీత్వం పురివిప్పిన నెమలిలా నాట్యంచేస్తుంది. సురేష్ ముందు కాళ్ళు వణుకుతాయి. అతనిని కళ్ళెత్తి చూడాలంటే భయంవేస్తుంది.

సురేష్‌కు, సరోజకు శోభనం జరిపిద్దామని వెంకటేశ్వర్లు మామ ఉత్తరంరాస్తే నాన్న ఎంతగా కోపం తెచ్చుకున్నాడు? అప్పుడే శోభనమా? శోభనం జరిపిస్తే సురేష్ చదువు ఎంతవరకు సాగుతుంది? మూడు నాలుగేళ్ళ వరకు ఆ ప్రసక్తి తీసుకురావడానికే వీలులేదని నాన్న ఉత్తరం రాశాడు.

అమ్మకు ఇంతవయసు వచ్చినా ధైర్యంగా నాన్నతో మాట్లాడలేదు ఎందుకో? భర్తముందు కళ్ళెత్తికూడా చూడదు. భర్తచెప్పిన మాట వేదవాక్కు. భర్త నిప్పుల్లో దూకమన్నా ఆక్షణంలో దూకేస్తుంది! ఇది బానిసత్వమా? భయమా? హిందూ సాంప్రదాయ సిద్ధమైన కట్టుబాటా? ప్రేమకూడా అయివుండవచ్చు!

సాంప్రదాయం, కట్టుబాట్లు అంటే నాన్నకు ప్రాణంతో సమానం. మొదటినుంచికూడా తనకు సాంప్రదాయాలు, కట్టుబాట్లు అంటే ఇష్టంలేదు. సురేష్ నచ్చకపోతే తను చేయగలిగింది ఏముంది? సురేష్‌ను కాదని మరొక మగవానితో వెళ్ళిపోగలదా? భార్యాభర్తలమధ్య బంధం ఎక్కడ ముడిపడివుంది? భార్య భర్తనుంచి కోరేది శారీరక సుఖమేనా? మానసిక సుఖం అవసరంలేదా? మానసిక, శారీరక సుఖాలు ఏ మాత్రం లోటులేకుండా తీర్చడమే భర్తనుంచి ప్రతి స్త్రీ కోరుకుంటుందా? సురేష్

తనకు శారీరకంగా స్వర్గసుఖాలు ఇవ్వగల అందగాడు. నిజమే! మరి తనకు కావలసిన మానసిక శాంతి? అది సురేష్ నుంచి లభిస్తోందా?

జీవితం గురించి ఇంతగా ఆలోచించవలసిన అవసరం లేదేమో? జీవితం పరిసర ప్రభావాలకు, సాంఘిక కట్టుబాట్లకు, రాజకీయ అలజడులకు అతీతంకాదు. ఒక్కసారి పై వారి పెత్తనాలకు మధ్యనలిగి గాయపడిన సోల్జర్ యుద్ధరంగం నుంచి నిష్క్రమించినట్లుగా, జీవితం నుంచే దూరంగా పారిపోవాలనిపిస్తుంది- అని వాసుదేవరావుగారు అన్నమాటల్లో ఎంతో నిజం కనిపిస్తుంది.

దీపావళి పండగకు సురేష్ వస్తున్నాడు. పెళ్లిరోజునే తనను దగ్గరకు లాక్కోవాలని చూశాడు. ఏ మాత్రం అవకాశం దొరికినా వదిలిపెడతాడా? నాన్న ఊహించినట్లుగా శోభనం మూడేళ్ళు వాయిదాపడుతుందా?

ఆలోచిస్తూనే నిద్రపోయింది సరోజ.

★ ★ ★

జ్యోతికి తలనొప్పిగా ఉంది. మాత్రవేసుకున్నా తగ్గడంలేదు. బెడ్‌పై పడుకుని ఫ్యాన్‌వైపు చూస్తూ ఉండిపోయింది. కొంతసేపు అలా చూస్తూనే కళ్ళు తిరిగాయి. మనసంతా బరువెక్కిపోయింది. అంతు తెలియని ఆలోచనలతో స్పాంజ్‌పిల్లోపై మోచేతిని ఆన్చి కూర్చుంది కొంతసేపు. ఎదురుగా ఉన్న డ్రెస్సింగ్ టేబుల్‌లో తన ముఖం కనిపించింది- మేకప్ చెదిరి, చెమటతో తడిసి అసహ్యంగా మారిపోయి.

రికార్డ్ ప్లేయర్‌లోంచి వస్తోన్నగానం చెవులకు తాకడంలేదు. ధ్వనితరంగాలు కిటికీలోంచి శూన్యంలోకి వెళ్ళిపోతున్నాయి.

బయటినుంచి సన్నగా వినబడుతున్న ట్రాఫిక్‌రొద. పక్కరూములోంచి వినిపించీ వినిపించనట్లుగా గలగల నవ్వులు, గాజుల రవ



లిక చప్పుడు.

శరీరమంతా మత్తు ఆవహించినట్లుగా ఉంది. పెదవులు కొరుక్కుంది. గోళ్ళను గిల్లుకుంది. మానసిక ప్రశాంతత కుదరడంలేదు. ఆలోచనా స్రవంతి అనంతంగా సాగిపోతోంది, తలాతోక లేకుండా.

రకరకాల పత్రికలు ఆ డబుల్ కాట్‌నిండా పడివున్నాయి. టేబుల్‌మీద చిందరవందరగా రికార్డులు, కేసెట్లు, డ్రెస్సింగ్ టేబుల్‌పైన కాస్మెటిక్స్ లెక్కలేనన్ని. తెరిచి ఉన్న బీరువాలో చీరలు, బ్రాలు, జాకెట్లు హేంగర్స్‌కు లేకుండా వికారంగా పడివున్నాయి. స్లిప్పర్స్, హైహీల్స్ విసిరివేసినట్లుగా పడివున్నాయి.

గోడగడియారం చప్పుడు నిరంతరంగా సాగిపోతూనే ఉంది. టీపాయ్‌పైన సగంతాగి వదిలిన కాఫీకప్పు. వాటర్‌మగ్ క్రిందపడి కార్పెట్‌తడిసి ఒకరకమైన వాసన.

వానిషింగ్ క్రీం చమటకు తడిసి ముఖం బరువనిపించింది జ్యోతికి. లిప్‌స్టిక్ టేస్ట్ జుగుప్సగా ఉంది. గంటక్రితం ఫర్ప్యూమ్ స్ప్రే చేసుకున్నా ఇంకా వాసన తగ్గక కొంచెంకొంచెంగా శరీరంలోంచి పైకొస్తోంది.

చమటకు తడిసిన బ్రా శరీరానికి చల్లగా తగులుతోంది. రవికకూడా తడిసిపోయింది స్వేదంతో. సన్నటి పెట్టీకోట్ బరువనిపించింది. కుచ్చిళ్ళు విడిపోయి చీర చిందరవందరగా ఉంది.

ఓపికగా నిలబడి చీర సరిచేసుకుంది. రూములోని వస్తువులను సర్ది, అటాచ్డ్‌బాత్‌కు వెళ్ళి ముఖం కడుక్కుంది వేగంగా వానిషింగ్ క్రీం, పౌడర్ ముఖానికి పులుముకుంది. పర్ప్యూమ్ స్ప్రే చేసుకుంది. తల ప్రత్యేకంగా దువ్వుకోవాల్సిన పనిలేదు. నిరంతర షాంపూ వాడకంవల్ల ఒక క్రమంగా ఉండిపోయాయి. రబ్బర్ బాండ్స్‌తో బిగించింది వెంట్రుకలకొనని. చంపలకు రోజ్‌కలర్ అద్దింది. పెదాలకు అంటీఅంటనట్లుగా లైట్‌పింక్‌కలర్ లిప్‌స్టిక్ అద్దింది. కనురెప్పలకు రెడ్, బ్లూమిక్స్‌డ్ కలర్‌ను పెయింట్ చేసింది. సన్నటిగీతలా కాటుక అద్దింది కళ్ళకు.

బ్యూటీ స్పెషలిస్ట్ సలహా ప్రకారం తన పర్సనాలిటీకి సరిపోయేలా ప్యాడెడ్ బ్రాను వేసుకుంది. లైట్‌రెడ్‌కలర్ పాలిస్టర్ చీరలో అనూహ్యామైన అందంతో మెరిసిపోతోంది జ్యోతి.

నగలపై ఎక్కువగా మక్కువలేదు జ్యోతికి. ముత్యాలహారాలంటే మాత్రం ఇష్టం. మంగళసూత్రం, ముత్యాలహారం తప్పమెడలో మరేదీ వేసుకోదు.

మెట్లుదిగుతూ విశాలమైన ముందుహాలులోకి దారితీసింది జ్యోతి. మామగారు శేషగిరిరావు, అత్తగారు రాజ్యలక్ష్మి బంధువులతో మాట్లాడుతూ సోఫాల్లో ఉన్నారు.

తోడికోడలు వనజ కోసం గదులన్నీ వెతికింది జ్యోతి. ఎక్కడా కనిపించలేదామె. నీరజ డైనింగ్ హాల్‌లో కనిపిస్తూనే- ''వనజ కనిపించిందా అక్కా'' అని అడిగింది.

''ఆమెగారా! బావగారితో ఉడాయించింది. సినిమాకో మరెక్కడికో!'' అన్న నీరజ మాటలకు ఉస్సూరుమంటూ కుర్చీలో కూలబడిపోయింది. చేసుకున్న మేకప్ అంతా వేస్ట్ అయిపోయింది. ఫస్ట్ షోకువెళదాం తయారుకమ్మని చెప్పి మోసంచేసింది వనజ.

కాటుక ముఖంనిండా నిండిపోయేలా రుద్దుకోవాలనీ, తలను చిందర వందరగా చేసుకోవాలనీ, చీర, రవిక చింపుకోవాలనీ అనిపించింది జ్యోతికి.

డైనింగ్‌హాల్‌లోని టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి ఫ్యాక్టరీకి ఫోన్‌చేసింది మోహన్‌కోసం. లేడని సమాధానం. మరో రెండు ఫ్యాక్టరీలకు ఫోన్‌చేస్తే అక్కడాలేడు.

మోహన్‌కు త్వరగా ఇంటికివచ్చే అలవాటు ఏనాడూలేదు. అతను వచ్చేది ఏ అర్ధరాత్రికో!

కాంతమ్మ అడిగింది- ''టీ తాగుతారా అమ్మగారూ?'' అని.

టీ తాగి ముందుహాల్‌లోకి వచ్చింది. ముందుహాలు ప్రశాంతంగావుంది. మామ, అత్తగార్లు సాయంత్రపు వాకింగ్‌కు వెళ్ళినట్లుంది. టి.వి. రూములోకి వెళ్ళి కూర్చుంది. ప్రోగ్రాం బోర్ అనిపించి, టి.వి. ఆఫ్‌చేసి. టెన్నిస్ కోర్ట్ దగ్గరకు వెళ్ళింది. ఫ్లడ్‌లైట్స్ వెలుతురులో పట్టపగలుగా వుంది టెన్నిస్‌కోర్టు.

రాజు జ్యోతినిచూసి నవ్వి "టెన్నిస్ ఆడతావా వదినా?" అనడిగాడు.

"గ్రౌండ్ టెన్నిస్‌కాదు. టేబుల్‌టెన్నిస్‌లో నన్ను గెలువు చూద్దాం?" అంది జ్యోతి.

"పందెం ఎంత?" రాజు హుషారుగా అడిగాడు.

"హండ్రెడ్ రుపీస్"

ఇద్దరూ పక్కనే ఉన్న హాల్‌వైపు దారితీశారు. రాజు నెట్‌సర్ది బ్యాట్స్. బాల్ తీసుకుని వచ్చాడు.

కాన్సంట్రేషన్ చేయనందువల్ల మొదటి నాలుగు పాయింట్లు వరసగా రాజుకు పోయాయి. తేరుకుని విజృంభించి విజేత అయింది జ్యోతి.

"ఏమోయ్... హండ్రెడ్ ఇస్తావా?"

"ఇవ్వాళ....లేవు వదినా. రేపు ఇస్తాను..." మెల్లగా అన్నాడు రాజు.

"నీవే గెలిస్తే నిలబెట్టి మరీ వసూలు చేస్తావు. నేను గెలిస్తేనో..." నవ్వుతూ అంది జ్యోతి.

రాజు తలవంచుకున్నాడు.

"నాకు హండ్రెడ్స్‌వద్దుకాని, కారులో మన టాకీస్ వరకు తీసుకువెళ్ళు, కాసేపు కూర్చుని వద్దాం"

రాజు ముఖం వికసించింది. "ఏ కారులో. అంబాసిడరా? టయోటానా? డ్రైవర్‌లేడని టయోటా తీసుకువెళ్ళలేదు నాన్న. దాన్ని డ్రయివ్ చేసేదా?"

"ఏమైనా రిపేర్‌వస్తే వదిన డ్రయివ్ చేయమంటేనే చేశానని తప్పు మొత్తం నామీదికి నెట్టడానికికదూ రాజుగారూ? నీ ఉపాయాలు నాదగ్గర చెల్లవు. జనతాకారే మనకుహాయి" అంది జ్యోతి.

"నీవు మహాతెలివైనదానవు వదినా" అంటూ ఆమె ముఖంలోకి ఆశ్చర్యంగా చూసి-"డ్రస్ ఛేంజ్ చేసుకుని వస్తాను" అంటూ అతని రూమువైపు పరుగుతీశాడు.

జ్యోతి పూలమొక్కలవైపు చూస్తూ ఉండిపోయింది ఆలోచనా రహితంగా. ఉదయంనుంచి ఆలోచించి మెదడంతా పుండులా అయింది. ఆలోచించే ఓపిక నశించింది. ఏవస్తువుపైనా ప్రీతి అనిపించలేదు. రోటీన్ లైఫ్‌లో మానసిక ఉత్సాహం చచ్చిపోయింది. కాలాన్ని నెట్టుకుంటూ రావడమే ఒక పనిలా తయారయింది. చేసే ఏపనీ మనసులోంచి రావడంలేదు. ప్రతి పనిలో కృత్రిమత్వం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది. ఆ పరిసరాల్లోనే, మనుషుల్లోనే కృత్రిమత్వంవుంది. పెళ్ళినాటివరకు కృత్రిమత్వం అంటే అర్థం కూడా తెలియదు తనకు. ఏ విషయంపైనా ఆలోచన చేయడం అనేదే జరగలేదు. కాలేజీకి వెళ్ళి రావడంతోనూ, స్నేహితురాళ్ళ మధ్యా గంటలు నిముషాల్లా గడిచిపోయేవి. ఇంటికి వస్తూనే అమ్మకు వంట ఇంట్లో సహాయంగా ఉండేది. కాలగమనం విచిత్రంగా సాగిపోయింది. పెళ్లి తర్వాత ఒక్కొక్క నిముషాన్నీ ఫీల్‌కావడం! తను ఒక ప్రాణంవున్న మనిషిలా కాకుండా అవసరంలేక పడివున్న ఒక వస్తువుగా మిగిలిపోయింది ఈ మహాభవనంలో!

అత్తగారింటికి వచ్చిన నెలరోజుల్లోనే జ్యోతి కోరికలన్నీ పేకమేడల్లా కూలిపోయాయి. బతుకుపైన ఎంతో ఆశపెంచుకుంది పెళ్ళికి ముందు. పెళ్ళి తర్వాత నిరాశను పెంచుకోక తప్పలేదు. తను కోరుకున్నది డబ్బును, మేడలను, కార్లనుకాదు! అర్థంచేసుకునే మనుషులను. ఒకరికోసం మరొకరు బతికే ప్రేమ సామ్రాజ్యం కోసం.

ప్రేమసామ్రాజ్యం!! ఈ ఇంట్లో ప్రేమ తప్ప మిగతా అన్నీ ఉన్నాయి. ప్రేమంటే అర్థమే తెలియదు వీళ్ళకు! ప్రతి విషయం డబ్బుతో ముడివేస్తారు. డబ్బు ఉందనే డాబు, దర్పం. ప్రపంచంలో వీళ్ళే ధనవంతులా ఇంతగా గర్వపడటానికి! 'డబ్బు ఎక్కడ తన విశ్వరూపంతో ఉంటుందో అక్కడ ప్రేమకు, దయకు స్థానంలేదు. తాను ఒక్కతే స్థిరంగావుండి, మిగతా అన్నిటినీ వెడలగొడుతుంది' వాసుదేవరావుగారు అన్నమాటలలో ఎంతో నిజం కనిపిస్తోంది.

తమకంటే ఎక్కువ డబ్బు ఉన్నవాళ్ళ కాళ్ళు కడుగుతారు. తమకంటే తక్కువ డబ్బు

ఉన్నవాళ్ళను కన్నెత్తిచూడరు. బంధుత్వాల గురించి పట్టింపులేదు. ఎంత దగ్గరి బంధువైనా, డబ్బు తక్కువగా ఉంటే దూరపు చుట్టంగా మిగిలిపోతాడు. దూరపుచుట్టమైనా ఎక్కువ డబ్బుఉంటే దగ్గరి బంధువైపోతాడు.

డబ్బు అనే మహాసముద్రంలో ఈదులాడే షార్క్స్ వీళ్ళు. అమాయకపు చేపపిల్లలా తనెలా బతకగలదు వీళ్ళమధ్యన?

రాజు ట్రిమ్‌గా తయారయి షూస్ టకటకలాడించుకుంటూ రావడంతో జ్యోతి ఆలోచనలు అంతరించిపోయాయి.

రాజు డ్రయివింగ్ సీట్లో కూర్చుని కారు స్టార్ట్ చేశాడు. జ్యోతి వెనుకసీట్లో కూర్చుంది.

కారు ముందుకు దూసుకుపోతోంది. టేప్‌రికార్డర్‌లో నుంచి వచ్చే మ్యూజిక్, జ్యోతి చెవిదగ్గర ఉన్న స్టీరియోలోంచి చెవి పగిలిపోయేలా ధ్వనిని వెదజల్లుతోంది.

సౌండ్ తక్కువ చేయమని చెప్పినా రాజు వినిపించుకోవడమేలేదు. మ్యూజిక్‌కు అనుగుణంగా విజిల్ వేస్తున్నాడు రాజు . అనవసరమైనవేగంతో రకరకాల కట్స్‌తో కారు థియేటర్ కాంప్లెక్స్ ముందర ఆగింది.

గేట్‌నుంచి హాల్ లోపలి వరకు ఎన్నో నమస్కారాలకు తలఊపుతూ ముందుకు నడిచారిద్దరూ.

సెవెంటీ ఎమెమ్‌లో ఆడుతున్న సినిమా శతదినోత్సవానికి దగ్గరపడుతోంది. హైక్లాస్‌లో చాలా కొద్దిమంది దూరందూరంగా కూర్చునివున్నారు.

ఒక మూలకు వెళ్ళి కూర్చున్నారిద్దరూ. ఎయిర్‌కూల్డ్ ఎఫెక్ట్ వలన సేదతీరినట్టుగా వుంది జ్యోతికి. తల సీటుకు ఆన్చి, ముందుసీటుకు కాళ్ళు తాటించడంతో రెస్ట్ దొరికినట్టుగా ఫీలయింది. హిట్‌సాంగ్స్ కళ్ళుమూసుకుని వింది. చూస్తూ వినేదానికంటే, కళ్ళు మూసుకుని వినడంలోనే జ్యోతికి ఎంతో తృప్తి.

క్యాంటీన్ బాయ్ రెండు స్పెషల్ టీలు తీసుకువచ్చాడు ఇద్దరికీ. టీ తాగి మళ్ళీ ముందు పొజిషన్‌లోనే కూర్చుంది. క్లయిమాక్స్ సీన్స్ నడుస్తున్నాయి. చల్లదనం క్రమంగా తక్కువయిపోతోంది థియేటర్‌లో. క్లయిమాక్స్ సీన్స్ అయిపోతూనే ఎండింగ్‌లో మళ్ళీ కూలింగ్ స్టార్ట్ అవుతోంది.

డబ్బు మిగుల్చుకోవడంలో మామగారికి తెలిసిన ట్రిక్స్ మరెవ్వరికీ తెలియవు అనుకుని నవ్వుకుంది.

ఎండింగ్‌వరకు ఆగకుండా "వెళ్దామా రాజూ" అంది జ్యోతి.

సమ్మతిగా లేచి నిలబడ్డాడు రాజు.

రాజుది ఫాస్ట్ డ్రయివింగ్. అతని డ్రయివింగ్‌లో ఏ క్షణంలో ఏమౌతుందో అన్న భయం వుంటుంది. కూర్చున్నవారికి. ఇంట్లో అందరూ చెప్పిచూసినా ఫాస్ట్ డ్రయివింగ్ మాత్రం మానడంలేదు రాజు.

రాజు ఇంటర్ చదువుతున్నాడు. మోహన్, రాజు ముఖకవళికలు దాదాపు ఒకేవిధంగా వుంటాయి.

కారు ఫాస్ట్‌గా డ్రయివ్‌చేయడం, లాన్‌టెన్నిస్ ఆడటం, విపరీతంగా సినిమాలు చూడటం రాజుకు ఇష్టం. కాలేజీకి రెగ్యులర్‌గా అటెండ్ అవుతాడు. ఇంట్లో అందరిమాట వింటాడు. అందుకే ఇంట్లోవాళ్లందరూ రాజు అంటే ఇష్టపడతారు.

మోహన్, రాజు పోలికలు ఒకటేఅయినా మనస్తత్వాలు వ్యతిరేకం. అయినా రాజు కూడా పెరిగి పెద్దవాడయితే మోహన్‌లా కాడని నమ్మకం ఏమిటి?

మోహన్ రాజుకంటే కొంచెం లావు ఎక్కువ. సైడ్‌బర్న్స్, పత్తయిన మీసాలు. చేతికి లావాటి గోల్డ్‌చైన్, మెడలో సన్నటి ప్లాటినమ్ చైన్. వెడల్పాయిన బెల్ట్‌తో టక్‌చేస్తాడు. మెరుస్తున్న షర్ట్స్ ఎక్కువగా వేస్తాడు.

గేట్‌దాటి ఇంటి ఆవరణలోకి ప్రవేశించింది కారు. కారు దిగుతూనే డైనింగ్‌హాల్లోకి ప్రవేశించారు ఇద్దరూ. చల్లారిన వంటకాలు తిని భోజనం అయిందనిపించారు.

భోజనం అవుతూనే జ్యోతి తన రూములోకి దారితీసింది. మేకప్ కడుక్కుని ఫ్రెష్‌గా తయారయింది. ముఖంమీద మేకప్ [illegible] పిప్పుమీద బరువు మోస్తున్నట్టుగా వుం[illegible] జ్యోతికి. మేకప్ లేకుండా వుంటేనే [illegible] ఫీలవుతుంది. అత్తగారింటికి [illegible]

తర్వాత మేకప్ తప్పనిసరి అయింది. మగవాళ్లనుంచి ఆడవాళ్ల వరకు అందరికీ మేకప్ పరమావధి అయింది. అందరూ దాన్నిగురించి ప్రత్యేక శ్రద్ధ చూపుతారు.

స్తనాలపై బ్రా బరువుగా అనిపించి విడిచేసి సింపుల్‌బ్రా వేసుకుంది. పెటీకోట్ విడిచేసి, నైట్‌గౌన్ వేసుకుంది.

అల్మారాలోంచి రెండు పిల్లోకవర్స్ తీసింది. ప్రతిరోజు పిల్లో కవర్స్ ఛేంజ్‌చేయడం అలవాటు జ్యోతికి. బెడ్‌షీట్స్ కూడా ప్రతిరోజూ ఛేంజ్ చేస్తుంది. మైసూర్‌నుంచి ప్రత్యేకంగా తెచ్చిన అగరువత్తులు ముట్టించడంతో రూమంతా గుప్పున పొగ వ్యాపించింది. అగరువత్తులు కాలుతూ, పొగ సుడులు తిరుగుతూ రూమంతా వ్యాపించడాన్ని చూడటం జ్యోతికి చిన్నప్పటి నుంచి అలవాటు. అగరవత్తుల వాసన వస్తూనే మానసికంగా అలసట తీరినట్లుగా వుంటుంది.

ఫ్లవర్‌వాజ్ నుంచి పూలగుత్తి తొంగిచూస్తోంది. పనిపిల్లవాడు కొన్నిగంటలముందే మార్చడంవలన వాటిలో ఫ్రెష్‌నెస్ కనిపిస్తోంది. డైనింగ్‌హాల్‌లోంచి వచ్చేప్పుడు ఫ్రిజ్‌లోంచి మల్లెపూలదండ తెచ్చుకుని జడలో తురుముకుంది.

బెడ్‌పైన పడిపోయింది. ఫ్యాన్ గాలి వేడి అనిపించి, ఎర్‌కూలర్ ఆన్‌చేసింది. ఫ్యాన్ ఆఫ్‌చేసి. ఎర్‌కూలర్ చప్పుడు, సుడులు తిరుగుతున్న అగరువత్తుల పొగ, కొంచెంగా సువాసనలు వెదజల్లుతున్న జడలోని పూలు కాలాన్ని స్తంభింపజేశాయి.

ఎంతగా మరచిపోవాలనుకున్నా విషయాలన్నీ తీగలుగా సాగుతూ మెదడంతా చుట్టుకుంటున్నాయి. తల భారమై, కళ్ళు బరువెక్కి కన్నీళ్లను వెళ్లగక్కాయి.

వంటచేయడానికి వంటవాళ్ళు, ఇల్లు శుభ్రంగా వుంచడానికి పనివాళ్ళు వున్నారు. మగవాళ్ళు ఫ్యాక్టరీలకు వెళ్ళివస్తారు. తోడికోడళ్ళు క్లబ్‌లకు వెళతారు. తనకే ఏమీలేవు.

జ్యోతికి లేడీస్‌క్లబ్ నచ్చలేదు. అక్కడ కేరమ్స్ ఆడటం, షాపింగ్ గురించి, వంటల గురించి అమ్మలక్కల్లా మాట్లాడుకోవడం తప్ప మరేమీలేదు.

శారీరకమైన పని ఏదన్నా వుంటే అలసట అనిపించి రాత్రి గాఢంగా నిద్రపడుతుంది. అదిలేకుంటే రాత్రంతా కలతనిద్రే. జ్యోతి పెరటితోటలో రోజూ రెండు కిలోమీటర్లవరకైనా నడుస్తుంది. ఆమె గార్డెన్‌ను పదిసార్లు చుట్టిరావడం ఇంట్లోవాళ్లకు విచిత్రంగా అనిపించేది. జ్యోతి వివరించి చెబితే ఇంట్లోవాళ్ళు తేలికగా తీసుకున్నారు.

బ్యూటీ క్లినిక్‌లో రోజూ ఓ గంటసేపు కాలక్షేపం అవుతుంది. కొన్ని రోజుల తర్వాత అందులో ఇంట్రెస్ట్ తగ్గి వారానికి రెండుసార్లు వెళ్లడం సాగించింది జ్యోతి.

కళ్లకింద నల్లని గుర్తులు; చీక్స్ ఎడ్జెస్ నోస్ దగ్గర ఓవర్‌గా వున్నాయి. పై పెదవి, కిందిపెదవికి నప్పినట్లుగా లేదు. కొంచెం ఎత్తుగా వుంది. బ్రెస్ట్స్ పెరగడానికి సాయంత్రం లైట్‌గా ఎక్సర్‌సైజ్ చేస్తుంది.

బ్యూటీషియన్ సలహాల ప్రకారం చీక్స్ ఎడ్జెస్‌ను, పై పెదవిని ఆయిల్‌తో రాపిడిచేయడం అలవాటుచేసుకుంది రాత్రి పడుకునేప్పుడు.

బెడ్‌లైట్ వేసుకుని ఆయిల్‌తో చెంపలు, పెదవి నెప్పి పుట్టేవరకు రాస్తూనే కళ్లు మూతలు పడినట్లయి, దిండులోకి తల దూర్చి నిద్రలోకి జారుకుంది.

మగత నిద్రలో డోర్ బెల్‌చప్పుడు వినిపించింది. బోల్ట్ తీసి, మళ్లీ బెడ్‌పైన ఒరిగిపోయింది.

మోహన్ ప్యాంట్ విడిచి లుంగీ కట్టుకున్నాడు. అతని కళ్ళు మత్తుగా ఉన్నాయి. ఆ మత్తులో శరీరం సుఖం కావాలని కోరుతోంది. బాత్‌రూంకి వెళ్లి ముఖం కడుక్కుని, పౌడర్ ముఖానికి అద్దుకుని, స్ప్రే వేసుకుని ఆమె పక్కగా పడుకున్నాడు.

నైట్‌గౌన్‌లోంచి జ్యోతి అందం దోబూచులాడుతోంది. మత్తులో ఆ అందం మరింత మత్తు గొలిపింది. జ్యోతిని తట్టి లేపాడు.

"నిద్దరొస్తోందండీ" అంటూ అలాగే ముడుచుకుని పడుకుని ఉండిపోయింది జ్యోతి.

నడుము చుట్టూ రెండు చేతులువేసి




బలంగా జ్యోతిని తనవైపు తిప్పుకున్నాడు మోహన్. బలవంతంగా మోహన్‌వైపు తిరిగినా అలాగే కళ్ళు మూసుకుని ఉండిపోయింది.

నైట్‌గౌన్ బటన్స్ విప్పుతున్నాడతను. మరింత దగ్గరగా ముడుచుకుపోయింది. వేతుల్ని బలవంతంగా దూరం జరపడానికి మోహన్ ప్రయత్నం చేయసాగాడు. కాళ్ళు, చేతులు, విరగ్గొట్టి అయినా సరే తనకు కావలసింది పొందగలడతను అనుకుని మామూలుగా పడుకుంది జ్యోతి.

అతని కౌగిలింతతో, ముద్దుల్తో వాంతి వచ్చినట్లయింది జ్యోతికి. విస్కీ, సిగరెట్ వాసనలతో అసహ్యంగా వుంది అతని నోరు. మళ్ళీ ముద్దు పెట్టుకోకుండా పళ్ళు బిగపట్టింది.

కలతనిద్రలోనే అతనికి శరీరాన్ని అర్పించి మౌనంగా ఉండిపోయింది.




దూరంగా కోడికూసిన చప్పుడు. పావని కళ్ళు నులుముకుని లేచింది. శ్రీకాంత్ తన పైన వేసిన చేతిని సున్నితంగా తప్పించింది.

లైట్‌వేసి, గోడకు తగిల్చి ఉన్న చిన్న అద్దంలో కురులను సర్దుకుని, చీర మళ్ళీ విప్పికట్టుకుని, లైట్ ఆఫ్ చేసి మెట్లు దిగి వంటింట్లోకి వెళ్ళి స్టీల్‌మగ్ తీసుకుని ముందు గదిలోకి వెళ్ళింది.

నరేష్‌ను తట్టి లేపింది. అతను కళ్ళు నులుముకుని లేచి కూర్చుని ''నిన్న కాలు బెణికింది. నడవడం చేతకాదు వదినా'' అంటూ ముసుగు కప్పుకున్నాడు.

ఆడపడుచు సుధను లేపితే ''రాత్రి పడుకునేసరికి రెండయింది'' అంటూ ముడుచుకు పడుకుంది.

''అవేవో నీవే వెళ్ళి తీసుకురాకూడదూ? పక్కఇంట్లోవాళ్ళు పోవడంలేదా'' అని అత్తగారు అనడంతో ముందుగది తలుపు తీసి, తలుపులు మళ్ళీ దగ్గరకు వేసి చీకట్లోకి నడిచింది.

కొంగు తలచుట్టూ తిప్పుకుని మిల్క్‌బూత్ వైపుదారి తీసింది. చల్లగాలికి శరీరంలోని ఎముకలు జివ్వుమంటున్నాయి. రోడ్డుమీద ఒక్క మనిషి కూడా కనిపించటంలేదు. కొంచెం భయం కూడా కలిగింది. భయంతో పాటే శరీరం జలదరించింది. అక్కడక్కడ ఉన్న వీధిలైట్లు భయాన్ని కొంచెం తగ్గిస్తున్నాయి. కొంతదూరంలో నలుగురు ఆడవాళ్ళు రావడం కనిపించి, తృప్తిగా నిట్టూర్చింది.

డబ్బుఇచ్చి లీటర్ పాలు పోయించుకుంది.

పాలు తీసుకుని ఇంట్లోకి వస్తూనే అత్తగారు అందుకుంది. ఇంత లేటా? దగ్గరే ఉన్న మిల్క్‌బూత్‌కు వెళ్ళి పాలుతేవడానికి? ఎక్కడికి వెళితే అక్కడే ..... అంటూ సాధింపు స్వాగతాలు ప్రారంభించింది. పావని నవ్వుకుంది. ఎదుటివారి చెడును జీర్ణించుకుని నవ్వుకోవడం అందరికీ చేతనవదు. పావనికి ఇది వెన్నతో పెట్టిన విద్య.

'మనిషి చెడును ఎదుర్కొని బలహీనపరచకుండా వుంటే, మరింత విస్తీర్ణం చెంది ఎందరినో బాధపెడుతుంది. చెడును ఎదుర్కొనేవాడు మానసికంగా అవతలివాడికంటే బలంగా వుండాలి. పరిస్థితుల ప్రభావం వలన ఎదుర్కోవడానికి అవకాశం లేకుంటే, దుర్మార్గాన్ని నవ్వు అనే ఖడ్గంతో ఖండించి వెళ్ళాలి'. తండ్రి మాటలలో నిజం కనిపించింది.

పావని నవ్వు అత్తగారిని చిత్రవధ చేస్తోంది.

ముఖం కడుక్కోవడానికి బాత్‌రూమ్ దగ్గరకు వెళ్ళింది పావని. తలుపువేసి వుండటంతో వంటింట్లోకి అడుగుపెట్టింది.

''నీ ముఖం కడుక్కోవడానికి తొందరేమొచ్చింది. ముందు మా ముఖాన టీ నీళ్ళు కొట్టు....'' అత్తగారు అనడంతో స్టవ్ దగ్గరకు వెళ్ళింది. స్టవ్‌లో గ్యాస్ నిండుకుంది. దాని సంగతి తర్వాత చూసుకోవచ్చు అనుకుని పొయ్యి అంటించే ప్రయత్నం మొదలుపె

ట్టింది. కట్టెలు పచ్చివి ఊది ఊది బుగ్గలు తీస్తున్నాయి. డబ్బాలో ఉన్న కిరసనాయిల్ కొంచెం కట్టెలపై వంపింది పావని. ఒక్కసారిగా మంటరావడంతో- ''నీకు ఎన్నిసార్లు చెప్పాలి, పొయ్యిలోకి గ్యాస్‌నూనె వాడవద్దని. గ్యాస్ నూనె ధర ఆకాశాన్ని అంటుతోంది....'' గొణుక్కుంటూ వెళ్ళిపోయింది అత్తగారు.

టీ ఫిల్టర్ చేసి గ్లాస్‌లోకి పోసింది. ఇంటిల్లిపాదీ ముందుగదిలో కూర్చున్నారు. రెండు గ్లాసుల్లో టీ తీసుకువెళ్ళి అత్తకు, మామగార్కి ఇచ్చివచ్చింది.

అత్తగారు ఒక్కగుక్క టీ పీలుస్తూనే ''టీ చేయడం ఎన్ని రోజులకు వస్తుందో ఏమో? టీపొడి ఎంతవేయాలో తెలియదు. నా ప్రారబ్ధం...'' అన్న మాటలకు పావనికి నవ్వు వచ్చింది.

శ్రీకాంత్ ఎప్పుడూ పావనిని మెచ్చుకుంటాడు టీ చేయడం బాగా వచ్చని.

ఆడబడుచు,మరిది కుర్చీల్లో కూర్చున్నారు బంధువుల్లా. మళ్ళీ వంటింట్లోకి వెళ్ళి రెండు గ్లాసుల్లో టీ తీసుకు వచ్చింది. నరేష్, పావని **చేతుల్లోంచి** టీ తీసుకోవడంలో టీ గ్లాస్ జారి కిందపడింది.

అందరూ పావనివైపు వింతగా చూశారు. అక్కడేదో హత్య జరిగినట్లు.

''నీకు బుద్ధుందా? గ్లాసు పట్టుకోవడం కూడా చేతకాకపోతే ఎలాగా? ఈ పూట నీవు టీ తాగకు. అప్పుడుగాని చేసిన తప్పు తెలిసిరాదు....'' అంది నాగరత్నమ్మ కోపంగా

మేడమెట్లు మెల్లగా దిగి వస్తున్న శ్రీకాంత్ తల్లి మాటలు వింటూనే ముందు గదిలోకి వచ్చాడు. నిద్రమత్తుతో అతని కళ్ళు ఎరుపెక్కాయి. తల్లి మాటలు వింటూనే కోపంతో కళ్ళు చింతనిప్పులయినాయి. భయంకరమైన తల్లి మనస్తత్వం అతనిని విచలితున్ని చేసింది. ''నీకేమైనా జ్ఞానంవుందా అమ్మా? ఆమె ఏమైనా బానిస అనుకున్నావా? అంగట్లో కొనుక్కువచ్చావా? చిన్నచిన్న తప్పులు జరిగిపోతుంటాయి. అది మానవసహజం. ఈ మాత్రానికే ఈ పూట టీ తాగవద్దని పావనిని శాసిస్తావా? మనుషులు మనుషుల్లా ప్రవర్తించాలి... పశువుల్లా ప్రవర్తించకూడదు....'' అన్నాడు

ఉక్రోషంతో దిగ్గున లేచింది నాగరత్నమ్మ. కొడుకు మాటలు వింటూనే ''అవునురా... ముందొచ్చిన చెవులకంటే, వెనుకొచ్చిన కొమ్ములు వాడి! అనెయ్యరా... ఇంకా ఏం అనదల్చుకున్నావో? నీకసి అంతా తీర్చుకో! కన్నపాపానికి తప్పుతుందా? మంచీ చెడూ చెబుతున్నానని మెచ్చుకోవాలిగాని నిందించడం మొదలుపెట్టావా? కోడలు పిల్లముందర కొడుకుతో మాటలుపడవలసిన ఖర్మ పట్టింది. ఏమండీ... ఇంటి పెద్దమనిషి అయివుండికూడా బెల్లం కొట్టిన రాయల్లే చూస్తూ కూర్చున్నారు....'' అంటూ భర్త వైపు చూసింది.

''ఏమోయ్... కన్నతల్లి అన్న విషయం కూడా మరచిపోయి నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావ్! పైసా సంపాదనలేదు కాని, మాటలు కోటలు దాటుతున్నాయ్...'' రామారావుగారు కోపంగా అన్నారు.

శ్రీకాంత్‌కు ఉక్రోషం పొంగుకువచ్చింది. ''మీకు ఎన్నిసార్లు చెప్పాను, ఈమాట మళ్ళీ మాట్లాడితే బాగుండదని! నిరుద్యోగిగా ఉండటం నాతప్పా? ఉద్యోగం కోసం ప్రయత్నం చేయడం లేదా నేను? స్కాలర్‌షిప్‌తోనే చదివాను; మీరెప్పుడు డబ్బు సక్రమంగా పంపించారని ఈ మాటలు అనడానికి? పెళ్లి కావాలని నేను అడిగానా? మీరే తొందరపాటుతో నా పెళ్లిచేసి ఈ అమాయకురాలిని నరకంలోకి తీసుకువచ్చారు... బానిస బతుకు చేశారు''

శ్రీకాంత్ మాటలు పూర్తికాకముందే తల్లిదండ్రులు ఇద్దరూ కోపంగా అరవసాగారు. ఎవరి మాటలూ సరిగా వినబడటం లేదు. రామారావుగారు ముందు గదిలో వేగంగా పచార్లుచేస్తూ ఏవేవో మాట్లాడుతున్నారు. అతని మాటలు పూర్తికాకముందే, చేతులు తిప్పుతూ తల్లి ఏదో మాట్లాడుతోంది.

శ్రీకాంత్ పావని చేతిని పట్టుకుని బాత్‌రూమ్‌లోకి లాక్కెళ్లాడు.

''పళ్ళు తోముకుని, టీ చేసుకుని తాగు..'' అంటూ బ్రష్‌పైన పేస్ట్‌వేసి పావని చేతికిచ్చాడు.






మీ దేషంలో మా కన్నియూ
నష్షినవి... ముఖ్యముగా ఆలయములలో
షిల్ప షౌందర్యం... హిమాలయముల
షల్లదనం... బృందావనం అందాలు
నాగార్జున సిమ్మెంట్స్ గట్టిదనం...
MAM 84



అవమానభారానికి పావని కళ్లు వర్షిస్తు న్నాయి. కొంగుతో కళ్లు తుడుచుకుని పేస్ట్ గూట్లోపెట్టి, పళ్లపొడి చేతిలో పోసుకుంది పళ్లు తోముకోవడానికి. పావనికి చిన్న వయసునుంచే పేస్ట్‌తో పళ్లు తోముకునే అలవాటు. అత్తవారింటికి వచ్చిన కొత్తలో బ్రష్‌పైన పేస్ట్ వేసుకుంటూనే మరిది, మరదలు కళ్లు మిటకరించి చూసి ఈ విషయాన్ని తల్లికి చెప్పారు. అత్తగారు దూరంనుంచే, "నిక్షేపంగా పళ్ల పొడి పెట్టుకుని పేస్ట్‌లు, బ్రష్‌లట; ఇంట్లో అందరూ పేస్ట్‌లతో తోముకుంటే అంతంత ధరల పేస్టులు పదిరోజులకే అయిపోతాయి..." అన్న మాటలు విన్నప్పటినుంచి పౌడర్‌తో పళ్లు తోమడం మొదలుపెట్టింది.

పావనికి జీవితంపైనే విరక్తి అనిపించింది. బతుకు భారంగా ఉంది. కళ్ల నుంచి నీళ్లు ధారగా కారుతూనే ఉన్నాయి. తనకు జరిగిన అవమానంకంటే శ్రీకాంత్ తల్లిదండ్రులతో ఘర్షణపడటం భయమనిపించింది. ఆ క్షణంలో శ్రీకాంత్ మేడపైనుంచి కిందికి రాకుండా ఉన్నా ఈ పరిస్థితి రాకపోవును అనుకుంది. ఎన్నడూ చేతిలోంచి గ్లాస్ జారి కిందపడలేదు. అలా ఎందుకు జరిగింది? గ్లాస్ కింద పడటంలో తప్పు తనదా? నరేష్‌దా?- ఆలోచనల్లతోనే శ్రీకాంత్ కోసం టీ చేసింది.

శ్రీకాంత్ ముఖం కోపంతో కందగడ్డలా ఉంది. పావనికి శ్రీకాంత్ ముఖం చూడాలంటేనే భయం వేసింది.

వాతావరణం భారంగా ఉంది. శ్రీకాంత్ ఎటో చూస్తూ, ఏదో ఆలోచిస్తూ టీ తాగుతున్నాడు. కొన్ని వేల ఆలోచనలు అతనిని ముప్పిరిగొన్నాయి. ఏమీ చేయలేని అశక్తతతో బతుకు భారమైపోయింది. స్వర్గ సుఖాలిచ్చే భార్య ఉన్నా ఆమె పొట్ట నింపడానికి సరిపోయే ఉద్యోగం మాత్రం దొరకడం లేదు. పావని వేయిసార్లయినా అనివుంటుంది- రెండు వందల రూపాయలు వచ్చే ఉద్యోగం సంపాదించినా చాలని. పూరి గుడిసె అయినా సరే స్వర్గం అనుకుని నీతో వస్తాను అంటుంది. కాని ఆ తర్వాతి బాధలను ఎదుర్కొని నిలబడగలదా? ముప్ఫయి వేల కట్నం తీసుకుని రెండు పూటలా తిండి కూడా పెట్టకుండా ఎలా ఉంచేది? అమ్మా నాన్న ఎందుకింత భయంకరంగా ప్రవర్తిస్తున్నారు? సంపాదించడం లేదని లోకువా? ఉద్యోగం దొరికిన తర్వాత పెళ్లిచేసుకుంటానని చెప్పినా బలవంతంగా పెళ్లెందుకు చేయాలి? పట్టుదలతో తనే పెళ్లిచేసుకుని ఉంటే తప్పంతా తనవైపే ఉండేది. ఇదంతా కట్నం డబ్బుకు కక్కుర్తిపడి ఆడిన నాటకం. ఉదయంనుంచి రాత్రివరకు ఊపిరి సలపని పనిచేస్తున్న పావనికి వీళ్లిచ్చే భుజకీర్తులా ఇవి? బానిస కూడా ఇంతకంటే ఎక్కువగా చేస్తుందా? ఏమిటి వీళ్ల అంతరార్థం? ఒక మనిషిని హింసించడంలో కూడా ఏదో ఒక కారణం ఉంటుంది. పావనిలో ఏ తప్పు చూసి వీళ్లు హింసిస్తున్నారు? 'ఈ కాలంలో హింసించటానికి కారణం అవసరం లేదు; హింసించడం అనేది ఒక అలవాటు' అన్న మిత్రుని మాటల్లోని నిజం ఇప్పుడు అర్థమౌతోంది!

పావని, ఏమైనా అంటే తనకెందుకు కోపం? ప్రేమంటే ఇదేనేమో?

శ్రీకాంత్ అటూ ఇటూ తిరుగుతూ ఇంట్లోవాళ్ల ముఖాల్లోకి చూస్తూ వారి భావాలను గమనిస్తున్నాడు. అందరిలోనూ క్రమంగా కోపచ్ఛాయలు తగ్గిపోతున్నాయి. తల్లితో మాట్లాడాలంటేనే అసహ్యంగా ఉంది శ్రీకాంత్‌కు. మాట్లాడకుండా ఉంటే పరిస్థితి విషమించేలా ఉంది. ఇది వారి ఇల్లు! కనిపెంచినందుకు కట్నంరూపేణా డబ్బు వసూలు చేసుకున్నారు. ఇప్పుడు ఈ ఇంట్లో తను బంధువులా మిగిలిపోవడం జరిగింది. బంధువు ఎక్కువగా తిష్ఠవేస్తే ఇంట్లోవాళ్లకు విసుగనిపిస్తుంది. తన విషయంలో కూడా అదే జరుగుతోందా?

★ ★ ★

తెల్లవారు ఝామున నాలుగుగంటల సమయం. "కమలా..." అంటూ తట్టిలేపుతున్న రమేష్ పిలుపుకి దిగ్గునలేచి కూర్చుంది కమల. చలిగావున్నా లేచి వంటింట్లోకి వెళ్లి టీచేసి రమేష్‌కు ఇచ్చింది. ఫ్లాస్క్‌లో టీనింపి రమేష్‌కు ఇస్తూనే, నూర్పిళ్లదగ్గరకు వెళ్లిపోయాడు.

పావు ఎకరం మేరవున్న ఇంటి వసారాను

ఊడ్చి, కళ్లాపి చల్లేసరికి తెల్లవారింది.

ముఖం కడుక్కొని వంటింట్లోకి వస్తూనే ''టీనీళ్లు నాముఖాన కొట్టు'' అంటూ అత్తగారు వంటింట్లోకి వచ్చి కూర్చుంది.

టీగ్లాసు అత్తచేతికి ఇచ్చి, తనూ టీ తాగుతూ ఉండిపోయింది. అత్తగారు తనవైపు ఎందుకో ప్రత్యేకంగా చూడటం గమనించింది. క్షణంలో ఆమె చూపులోని భావం అర్థంచేసుకుంది. 'కోడళ్లు అత్తముందర నిలబడి టీ తాగకూడదు' అనే భావం వచ్చేలా లోగడ రెండుమూడు సార్లు సూటిపోటిమాటలంది. ముసలివాళ్ల మాటలు పట్టించుకోవలసిన అవసరంలేదని అప్పట్లో సర్దుకుపోయింది కమల.

ఎదుటిమనిషిపైన కోపంవస్తే వారితో వివాదాన్ని పెంచుకోవచ్చు. అసహ్యంవేస్తే నోటమాటకూడా రాదు. వాళ్ల ఎదురుగా నిలబడటమే నిప్పులపైన నిలబడినట్టుంది; వివాదాన్ని పెంచుకునే అగత్యమే ఉండదు- అనుకుని ముందు గదిలోకివెళ్లి టీతాగడం ముగించింది.

రాత్రి పడిన అంట్లన్నీ తోమి, బావిలోంచి ఇరవై కడవలదాకా నీళ్లుచేది, బాత్‌రూం ట్యాంక్‌లోకి పోసింది. పదిహేనుగురు పాలిగాళ్లకు అన్నం, కూరవండాలి. ఇంటివాళ్లకు అన్నం, రెండుకూరలు చేయాలి. అత్తగారు చిన్న స్పూనుకూడా తీసి పక్కకుపెట్టరు. పక్షవాతంవల్ల కాళ్లు ముడుచుకుని కూర్చోవడంరాదు. కాళ్లు చాపుకొనిమంచంపైన కూర్చుంటుంది. ఆమె అవసరాలవరకు బాగానే తిరుగుతుంది. అత్తగారికి నిజంగా పక్షవాతం వచ్చిందా లేక నాటకం ఆడుతోందా- అనేది అర్థంకాలేదు కమలకు.

పరంధామయ్య మాటలు ఫర్లాంగ్ దూరంలో ఉండేవారికి కూడా వినిపిస్తాయి. వసారాలోకి వస్తూనే ''తెల్లవారుఝామున మొదలుపెట్టినా పావుసగమైనా కాలేదు'' అనుకుంటూ పాలిగాళ్లను బూతులు తిట్టడం సాగించాడు.

ఇంట్లోకి వస్తూనే రెండు అంగల్లో వంటగదిలోకి వచ్చి ''టీలో చక్కెర ఎక్కువ వేశావేమమ్మా! మీ నాయనకు సుగర్‌ఫ్యాక్టరీ ఉందా ఏం? నిన్న పదిమందికి సరిపోయే అన్నంచేయమని చెబితే పదిహేనుగురికి సరిపోయేలా చేశావు. మనిషి కొంచెం ఆలోచించి పనిచేయాలి! మీ అత్తకు ఏమీ పట్టదు. ఎప్పుడూ మంచంపైన కూర్చుని ఉండకపోతే, నీకు సలహాలు ఇవ్వవచ్చుగదా! నీ భర్తకు వ్యవహారం తెలియదు. ఒక పని చెబితే మరొకటి చేస్తాడు... అన్నీ నేనే చేయాలి. నీపని చూస్తే ఇలావుంది! మీరంతా నాపెళ్లికోసం పని చేస్తున్నారా ఏం?''

వరండా దగ్గర నిలబడి పరంధామయ్యను ఎవరో పిలవడంతో కమల ఊపిరి పీల్చుకోగలిగింది. లేకపోతే పరంధామయ్య తిట్లు అలా సాగిపోతూనే ఉంటాయి- ఏమాత్రం అడ్డులేకుండా.

టీగ్లాసుతో వరండాలో నిలబడింది కమల. ఎవరినో బూతులు తిడుతూ కోడలి చేతిలోని గ్లాసు తీసుకున్నాడు. ''పూర్తిగా చల్లబడిపోయింది. మళ్లీ వేడిచేసి తీసుకురా'' అనేసరికి కమల ఉసూరుమంటూ వంటింట్లోకి పరుగుతీసింది.

వేడిచేసి గబగబా అడుగులు వేసుకుంటూ వరండాలోకి వస్తే అక్కడ మామగారు కనిపించలేదు. గేటుదగ్గర నిలబడివున్నాడు. పరిగెత్తుకుంటూ వెళ్లి ఇవ్వకపోతే టీ చల్లారిపోతుంది- అనుకుని వేగంగా అడుగులు వేస్తూ గేట్ దగ్గరకు వెళ్లింది.

టీ తాగుతూ ''ఇవ్వాళ పదిహేనుమంది పాలిగాళ్లకు సరిపోయేలా అన్నం చేయాలి. ఇంతవరకే చేసి వుండాలి. తెల్లవారుఝామున లేస్తే పనులు తెములుతాయి. మారాణుల్లా పడుకుంటే ఎలా అవుతుంది?'' అంటూ ఖాళీగ్లాస్ చేతికిచ్చాడు.

రెండు అడుగులు నడిచిన తర్వాత ఏదో గుర్తుకు వచ్చినట్లు వెక్కి తిరిగి, ''నేను ఊరిలోకి వెళ్తొస్తాను. నర్సింహులు వడ్లు కొలుస్తానన్నాడు, కొలత చూసుకొని గాదెలో పోయించు. మశన్నవస్తే ఒక కుండ జొన్నలు ఇవ్వు'' అంటూ గబగబ అడుగులువేసుకుంటూ గేట్ దాటివెళ్లిపోయాడు పరంధామయ్య.

''కమలా... నీకేమైనా మతి తప్పిందా? పొయ్యిమీద ఏదోవుంచి వసారాలోకి వెళతావా? పొంగిపోయి కట్టెలన్నీ చల్లారిపోయాయి'' అరుస్తూ వచ్చింది అత్తగారు.

కమల వంటగదిలోకి పరుగుతీసింది. పొయ్యిపైన ఉన్న పాత్ర తొందరగా చేత్తో దించడంతో వేళ్ళుకాలి బొబ్బలెక్కాయి.

"అమ్మగారూ..." అంటూ నర్సింహులు వచ్చాడు. రెండు కుండల వడ్లు కొలిచాడు గొంగళ్లోంచి. వరండాలో ఒకమూల పోయమంది కమల. నర్సింహులు వెళ్లిపోతూనే మశన్న వచ్చాడు. ముందుగదిలోనేవున్న గంపలోని జొన్నలు కొలుచుకుని తీసుకుపోయాడు మశన్న.

వంటింట్లోకి వచ్చింది. అన్నం బిరుసెక్కింది. మూడురోజులక్రితం తెచ్చిన బెండకాయలు, వాడిన వంకాయలతో కూరలెలా చేయాలో అర్థంకాలేదు కమలకు.

ఉప్పు నిండుకుంది, పచ్చిమిరపకాయలు లేవు. గేట్‌బయటకు వెళ్లి పక్కింటి పిల్లవాడు కనిపిస్తే రూపాయి ఇచ్చి పచ్చిమిరపకాయలు, ఉప్పు కొనుక్కురమ్మంది.

మరోపొయ్యి ముట్టించక తప్పదనుకుని, కట్టెలు పొయ్యిలో ఉంచి, ఎంత ఊదినా రాజుకునేలా లేదు. గ్యాస్ నూనెవేస్తే అంటుకుంటుందేమో అని డబ్బా వంపిచూస్తే ఒక్క చుక్క కూడా రాలలేదు. పదినిముషాలు సమస్త శక్తులను కూడదీసుకుని ఊదితే కట్టెలు అంటుకున్నాయి.

వంటగదిలోకి ఉరుకుతూ వచ్చాడు వరంధామయ్య. "ఏవమ్మా... నీకేమైనా మతి వుందా? వడ్లువరండాలో పోయించుకుంటారా ఎవరైనా? సగం ధాన్యాన్ని పశువులు తినిపోయాయి. జొన్నలు గాదెలో ఉన్నవి ఇవ్వమన్నానుకాని గంపలోవి కాదు గంపలోనివి విత్తనం జొన్నలు, రెండురోజులక్రితం పట్నంనుంచి తెప్పించాను. మీతో వేగడం నావలన అయ్యేట్లు లేదు..."

పిల్లవాడు మిరపకాయల్ని, ఉప్పును వంట

గదిలో ఉంచి వెళ్లిపోయాడు.

"వచ్చిమిరపకాయలు ఎందుకు తెప్పించావమ్మా... మన తోటలో వున్నాయికదా! మీకు డబ్బు ఎక్కువయినట్లుంది. మీరు సంపాదిస్తే తెలిసేది ఏవిధంగా ఖర్చుచేయాలో" గునుస్తూ వెళ్లిపోయాడు.

కమల అచేతనంగా నిలబడిపోయింది.

'ప్రతి జీవికి బతుకుపైన ఆశవుంటుంది. జీవించడంలో ఏదో తృప్తిపొందడం వలనే మనుగడను కొనసాగిస్తున్నాడు. తృప్తి పూర్తిగా లోపించినపుడు, మనుగడకు ఆటంకం కలిగినపుడు మనిషిలో నిస్సత్తువ ఆవహిస్తుంది. ఆ నిస్సత్తువలో జీవితాన్ని మరింత చిక్కు విడనిదిగా చేసుకుని ఆత్మహత్యకు పూనుకుంటాడు. ఒకవైపు ద్వారం మూసుకుపోయినంతమాత్రాన మనుగడకు దారి లేదనుకోవడం పొరపాటు. మరోవైపుగా పయనిస్తే అనుకూల పరిస్థితులు ఏర్పడవచ్చు' వాసుదేవరావుగారి మాటలను మననం చేసుకుంది.

తన జీవితంలో తృప్తిపూర్తిగా లోపించింది గానీ మనుగడ సాగించడానికి వీలులేనంతగా పరిస్థితులు ఏర్పడలేదు. పరిస్థితులు ఇలాగే సాగితే మనుగడ సాగించడానికే ఆటంకం ఏర్పడుతుంది. ముందుచూపుతో మరోమార్గం గురించి ఆలోచించుకునే పరిస్థితి ఏర్పడింది. ఇంకా ఎటువంటి మలుపులు జీవితంలో ఎదురుచూడవలసి వస్తుందో?... గోడకు అలాగే చేరగిలబడిపోయింది కమల.

★ ★ ★

సురేష్ ముఖం అమాయకంగానే కనిపిస్తుంది. లేతగా ఉన్న ఆ ముఖాన్ని చూసి ఇంత గ్రంథసాంగుడని ఎవ్వరూ ఊహించలేరు. శ్రీనివాస్‌కు మాత్రం సురేష్ నడవడి గురించి పూర్తిగా తెలిసిపోయింది. సురేష్‌తో మాట్లాడాలన్నా అసహ్యంగా ఉంది శ్రీనివాస్‌కు. తప్పదు కాబట్టి ముఖానికి నవ్వు పులుముకునిసురేష్‌తో మాట్లాడుతున్నాడు. సురేష్‌కుకూడా తెలుసు తన గురించిన సంగతులన్నీ శ్రీనివాస్‌కు తెలుసని. అతని భయమంతా శ్రీనివాస్ ఈ విషయం అత్తమామలకు, సరోజకు చెబుతాడేమో అని.

మొదటి నుంచికూడా సురేష్‌కు శ్రీనివాస్‌ను చూస్తేనే భయం. సిటీలో వాళ్ళు కలుసుకునేది చాలా తక్కువ. కలుసుకున్నా మాటవరసకు కుశలప్రశ్నలు వేసుకుని విడిపోయేవారు.

సురేష్ విషయం తల్లిదండ్రులకు చెప్పాలా వద్దా- అన్న సందిగ్ధతలో పడ్డాడు శ్రీనివాస్. హఠాత్తుగా అల్లుడు ఇంత చెడ్డవాడని తెలిస్తే కన్నవాళ్ళు ఎంతగా తల్లడిల్లిపోతారో అన్న భయంతో చెప్పలేకపోయాడు. నోటివరకు వచ్చినా గొంతులో ఏదో అడ్డుకున్నట్లుగా ఆగిపోయేవాడు. చెల్లెని చూస్తే అతని కళ్ళలో నీళ్ళు తిరిగేవి.

సురేష్ మనసులో సరోజ ముగ్ధత్వం గూడుకట్టుకుపోయింది. ఆమె శరీరపు లావణ్యం, నునుపు చెక్కిళ్ళు, తీర్చిదిద్దినట్లున్న అవయవపు వొంపులు అతనిని పిచ్చివాణ్ణి చేశాయి. కనిపిస్తే కళ్లు మరల్చుకోకుండా చూసేవాడు.

సరోజతో మాట్లాడాలని ఎంతగానో ప్రయత్నించాడు. ముందుకు వస్తూనే చెంగున లేడిలా పారిపోయేది. చనువు తీసుకుందామంటే అత్తమామలు...

సమయం కోసం నిరీక్షిస్తున్నాడు సురేష్. పండగ గడిచిరెండు రోజులైనా అత్తవారింటి నుంచి కదలలేదు. శ్రీనివాస్ పండగ అవుతూనే సిటీ వెళ్ళిపోయాడు. సరోజ తమ్ముడు వాసు ఉన్నా ఎప్పుడూ పక్కఇళ్ళలో ఆడుతూ ఉంటాడు.

సీతారామయ్య సురేష్ కాలేజీ విషయం అడిగితే వారంరోజులు సెలవులు ఉన్నాయని అబద్ధం చెప్పాడు. అల్లుడు చెప్పిన మాటలోని నిజం ఎంతో సీతారామయ్యకు అర్థమైనా చిన్నగా నవ్వుకుని ఊరకుండిపోయాడు.

సీతారామయ్య పొద్దున్న పొలంవెళ్ళి, సాయంత్రం ఇంటికి వచ్చేవాడు. రుక్మిణమ్మ ఇల్లు కదలడమేలేదు నాలుగయిదు రోజులుగా. ఏమాత్రం అవకాశం ఉన్నా సరోజను దగ్గరకు తీసుకోవాలని తపించిపోతున్నాడు సురేష్.

సురేష్ ఉపాయాలకు కొదవలేదు. "ఇంట్లో ఊరికే కూర్చోవాలంటే ఎలాగో ఉంది, అలా పొలాలవైపు వెళ్ళొస్తాను" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

అల్లుడు ఇంట్లో ఉన్నంతవరకు ఇల్లు కదలడానికి వీలు కాలేదు రుక్మిణమ్మకు ఇన్ని రోజులుగా రోజుకు ఒక్కసారైనా పక్కఇళ్ళలోకి వెళ్ళి బాతాఖానీ వేసుకునే అలవాటు ఆమెకు. అల్లుడు ఇల్లుదాటి వెళ్ళగానే పక్కఇంటికి వెళ్ళింది.

అయిదు నిముషాలు అటూఇటూ తిరిగి ఇంట్లోకి వచ్చాడు సురేష్. మెల్లగా వంటింటి వైపు చూశాడు- రుక్మిణమ్మ లేదు.

ఎంబ్రాయిడరీ క్లాత్‌పైన పూలుకుడుతున్న సరోజ భర్తను చూసి ఉలికిపడింది. ద్వారానికి రెండు చేతులు ఉంచి తదేకంగా తనవైపే చూస్తున్నాడు. ఎంబ్రాయిడరీ క్లాత్ పక్కకు వేసి తలవంచుకుని ఉండిపోయింది. ఏమాత్రం అవకాశం ఉన్నా పారిపోయేదే! అతని చూపులు ఆమె గుండెని తొలుస్తున్నట్లుగా ఉన్నాయి.

తదేకంగా సరోజవైపు చూస్తూ మెల్లమెల్లగా అడుగులో అడుగువేస్తూ వస్తున్న సురేష్‌ను చూసి బెదురుతున్న లేడిపిల్లలా కూర్చునే వెనుక్కు జరుగుతూ ఉండిపోయింది. అతను పూర్తిగా దగ్గరవుతూనే గుండె వేగంగా కొట్టుకోవడం క్షణక్షణానికి పెరిగిపోయింది. గుండె వగిలిపోతుందేమో అనిపించింది సరోజకు.

సురేష్ ఆమెకు దగ్గరగా వచ్చి "సరూ" అన్నాడు.

రెండు చేతుల్తో ముఖాన్ని బిగ్గరగా మూసుకుంది. ఆమె భుజాల్ని రెండు చేతుల్తో పట్టుకుని లేపనెత్తాడు. అలాగే తలవంచుకుని నిలబడిపోయింది.

ఎడమచేతితో ఆమె చుబుకాన్ని ఎత్తాడు. భయంగా అతనివైపు చూసింది.

"సరోజా... నీవంటే నాకెంత ఇష్టమో తెలుసా? ఎందుకు తప్పించుకుని తిరుగుతున్నావ్?"

ఆమె పెదవులు అదిరిపడుతున్నాయ్. శరీరం వణికిపోతోంది. ఒక్క గెంతుతో ద్వారం దగ్గరకు వెళ్ళింది- కాని లాభం లేకపోయింది. ఒక చేత్తో ఆమె భుజాన్ని గట్టిగా పట్టుకున్నాడు సురేష్.

చేయి అక్కడికక్కడే విరిగిపోతే బాగుండుననిపించింది సరోజకు. రెండు చేతులు నడుముపై వేసి దగ్గరగా లాక్కున్నాడు. ఆమె శరీరం అదిరిపడింది.

ఒక్కసారిగా ఎడమచేతిని మెడవెనుక వేసి, కుడిచేత్తో చుబుకాన్ని పట్టుకుని ఆమె అధరాల్ని చుంబించాడు.

ఆమె పెనుగులాడింది విడిపించుకోవడానికి. నడుముచుట్టూ బాహువులను చుట్టేశాడు సురేష్- విడిపించుకోవడానికి ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా.

పెనుగులాడటానికి అశక్తురాలవడం చూసి, రెండు చేతుల్తో ఆమెను ఎత్తి మంచంపైన వేశాడు.

ఒక్కొక్క వస్త్రాన్ని తొలగిస్తుంటే ఇల్లుదద్దరిల్లిపోయేలా అరవాలనుకుంది- కాని గొంతులోనే ధ్వని ఆగిపోయింది.

మానసికంగా నిస్త్రాణ అయి, అతనివైపు ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది- అడ్డుపెట్టడానికి ప్రయత్నించలేదు.

సురేష్ వెళ్ళిపోయిన తర్వాత మెల్లగా తేరుకుని బట్టల్ని సరిచేసుకుంది. బాత్‌రూమ్ కెళ్ళి ముఖాన్ని చల్లటి నీళ్ళతో కడుక్కుంటూనే తేలికపడిపోయింది.

సురేష్ పిచ్చిపట్టినవాడిలా ఊరు మొత్తం తిరిగాడు. 'సరోజ తల్లిదండ్రులకు చెబుతోందేమో? వాళ్ళు ఎంతగా తనను అసహ్యించుకుంటారో? ఛీ... తన భార్యను తను రేప్ చేయడం! జీవితంలో ఎన్నడయినా ఆమె ముందు తలెత్తుకోగలడా తను? ఎంత తొందరపాటు!' అనుకున్నాడు.

భయంతో ఇంట్లో కాలుపెట్టాడు. పిడుగుపడినట్లుగా అత్తా, మామల మాట వినవలసివస్తుందని అనుకున్నాడు. అతడు అనుకున్నట్లుగా వాతావరణం లేదు.

సీతారామయ్య సురేష్‌ను చూసి "ఇంతసేపు ఎక్కడికి వెళ్లావు నాయినా?" ప్రశ్నించి, సమాధానం ఆశించకుండానే ముందుకు కదిలాడు.

'సరోజను మళ్ళీ తలెత్తి చూడగలడా? సరోజ చూపులు తనను కాల్చేసినట్లుంటాయేమో?

ఉదయమే వెళ్లిపోవాలి' అనుకున్నాడు సురేష్.

ఆ రాత్రి సరోజ కళ్లలో పడకుండా తప్పుకుని తిరిగాడు.

భర్త కళ్లలోకి ఒక్కసారి చూడాలని ఎంతగానో ప్రయత్నించింది సరోజ. సురేష్ తలఎత్తడమే జరగలేదు. ఇంత పిరికివాడా తన భర్త అనుకుంది. పిరికివాళ్లే చెడు అలవాట్లకు బానిసలవుతారని వాసుదేవరావుగారు చెప్పిన విషయం సరోజకు ఇప్పుడు అవగాహన అవుతోంది.

మరునాడు పొద్దున్నే సురేష్ సిటీకి వెళ్లడానికి ప్రయాణమయ్యాడు. సరోజను కలిసి క్షమాపణలు చెప్పుకోవాలని అనిపించినా బిడియమనిపించింది, ఆమెతో మాట్లాడటానికి.

అనుకోకుండా సరోజతో చూపులు కలిశాయి. దీపం రేఖలో పడ్డ శలభంలా అక్కడిక్కడే కాలిపోతానేమో అనుకున్నాడు సురేష్. అతడు వూహించినట్లుగా జరగలేదు. ఆమె కళ్లలోని వెలుగు; ముఖంలోంచి విరజిమ్ముతున్న ఆప్యాయత; ప్రాణప్రదమైన వస్తువును చూస్తున్నట్లుగా ఆమె తనవైపు చూడటం చూసి ఆశ్చర్యపోయాడు సురేష్.

ఆమె చూపులలోని భావాలు పసికట్టగలిగి వుంటే, అతనిని స్వర్గలోకపు అంచులవరకు లాక్కుపోయి వుండేది. తుచ్ఛమైన వేశ్యల పొందుకంటే వెయ్యిరెట్లు సుఖాన్ని చవిచూపించి వుండేది.

నోటితో చెప్పినదానికంటే కూడా స్పష్టంగా చెప్పింది కళ్లతో. అతనిపై వున్న అపారమైన ప్రేమను, అర్థం చేసుకోలేని మూఢత్వంలో వుండి, కళ్లతోనే వీడ్కోలు చెప్పి సిటీ వెళ్లిపోయాడు.

అతడు వెళ్లిపోవడంతో సరోజకు వూపిరి ఆగిపోయినట్లుగా అనిపించింది. బంగారుపాత్రనిండా అమృతం వుంది ఎవరికి పంచడం?

అసహనంతో, అనూహ్యమైన ఆలోచనలతో మెదడు భారమైపోతుంది. ఎవరిపైనో ఆక్రోశం! ఎక్కడికో పరుగుతీయాలని ఆరాటం ఇంతవరకు ఇష్టమైనవన్నీ ఇప్పుడు అయిష్టంగా మారాయి.

కాటుక ముఖంనిండా పులుముకోవాలనిపించింది. పౌడర్‌టిన్నులోని పౌడర్ అయిపోయేంతవరకు ప్రెస్ చేసింది. అద్దాన్ని వీధిలోకి విసిరివేసింది. తనకు ఇష్టమైన పరికిణీని పిలికలు అయ్యేలా చింపివేసింది. చిన్న చిన్న విషయాలకే తల్లిని కసురుకుంది. ఇంట్లోంచి వీధిలోకి, వీధిలోంచి ఇంట్లోకి పిచ్చిగా తిరిగింది.

సముద్రపు హోరులా హృదయంలో వుప్పొంగే హోరును ఆపడం కష్టతరమైంది. ఏదో కావాలని తపన! శరీరంలోని అణువణువు రుద్రావతారం ఎత్తుతుంది. ఎవరైనా తన శరీరాన్ని నలిపి పిప్పిచేస్తే బాగుండునని పించింది. ఎడారిలో ఎనలేని దాహంతో తిరుగుతున్న మనిషికి ఒక్క గుక్క నీరు ఇస్తే ఎలా వుంటుందో అలా వుంది సరోజకు.

ప్రశాంతంగా ఎగిరే పక్షిరెక్కలు విరిచివేసినట్లుగా సరోజ జీవితం మారిపోయింది. పిచ్చిగా సురేష్‌ను తలుచుకోసాగింది. అనుక్షణం అతని పొందుకు ఆకాంక్షించింది. అతడు ఆ క్షణంలో రాకుంటే బతకడమే దుర్లభమనిపించింది.

అతను వెళ్లేప్పుడేదైనా అర్థంచేసుకునేవాడేమో? అతని కాళ్లు పట్టుకుని ఆపివుండినా ఎంత బాగుండేది? నోరు విప్పి వుండిపొమ్మని చెప్పలేకపోయినందుకు తనను తానే నిందించుకొంది.

ఆమెలో అమాయకత్వం తుడిచిపెట్టుకుపోయింది. బెలూన్‌లో గాలి నింపినట్లుగా ఆమెలో కాంక్షను నింపి జారుకున్నాడతను!

ప్రపంచంపైనే నిరసన ఏర్పడింది సరోజకు. అన్నం తినబుద్ధేయడంలేదు. తల్లిదండ్రులపై మునపటిలా ప్రేమ జనించడంలేదు. తనకు సురేష్ కావాలి... ప్రపంచంలో మరేదీ అవసరంలేదు!

వారంరోజుల తర్వాత పిడుగులాంటి వార్త వచ్చింది. ఆ వార్త వింటూనే సీతారామయ్యకు గుండె ఆగిపోయినంత పనిఅయింది. దుఃఖంతో కొన్ని గంటలవరకు గొంతు పూడుకుపోయింది. ఒక్కగానొక్క కూతురి జీవితం తెరచాపలేని నావలా సముద్రంలోకి తోయబడింది.

జరిగిన విషయాన్ని కూతురికి చెప్పాడు.

మొదలు నరికిన చెట్టులా అలాగే వెనక్కు పడిపోయింది. ఆమె హృదయం పగిలి పోయింది. నిండా గాలినింపిన బెలూన్ పగిలి పోయినట్లుగా. నిశీధిలో వున్నంత శూన్యం ఆమెలో నిండిపోయింది.

వెనక్కి పడిపోవడంవలన తల గోడకు కొట్టుకోవడంతో అలాగే స్పృహతప్పి పడిపోయింది.




వేగి చకచకా చేసుకుంటూ వెళుతున్నా అంతరంగంలోని కల్లోలంతో పావని గొంతు పూడుకుపోయినట్లయింది. ఏదో తెలియని అసంతృప్తి క్షణక్షణానికి అధికమౌతోంది. 'ప్రతి స్త్రీ నాలాగే ఇలాంటి పరిస్థితినే ఎదుర్కొంటుందా?' అనే ఆలోచన క్షణం విరామం ఏరికోరి మెదడును తినేస్తోంది. ఆలోచనల నుంచి దూరంగా ఉండటానికి ఏదో ఓ పనిచేసుకుంటూ వెళుతోంది.

కూరలు, అన్నం వంటి డైనింగ్ టేబుల్ మైన ఉంచింది. అత్తగారు, మామగారు చడీచప్పుడు లేకుండా భోజనాలు ముగించారు

మామగారు మంచివారన్న అభిప్రాయం గతంలో ఉండేది పావనికి. జరిగిన సంఘటనతో సదభిప్రాయం తుడిచిపెట్టుకుపోయింది. శ్రీకాంత్ ఈ చెట్టు కొమ్మే అయినా అంత ప్రేమగా ఎలా ప్రవర్తిస్తున్నాడు? బురదలో పురుగులూ పుడతాయి. కమలాలూ పెరుగుతాయి- అనుకుని వినోదంగా నవ్వుకుంది.

శ్రీకాంత్‌కు ఓ వెయ్యి రూపాయల ఉద్యోగం ఉంటే ఈ ప్రపంచంలో తనలా సుఖపడేవాళ్ళు ఉండరు అనుకుంది.

మనిషికి పరిపూర్ణమైన సుఖం ఉండటం అనేది అసంభవమా? సుఖం లభించింది అనుకునేంతలో మరోవైపు నుంచి విషపు కోరలు చొచ్చుకువస్తాయి. సుఖంచూసి మురవాలా? దుఃఖపు బాధలో ఏడ్వాలా? "సుఖపు దుఃఖపు మధ్యాంతరంలో మనిషి బతకటం నేర్చుకోవాలి. జీవితంలోంచి సుఖాన్ని తప్పుకుంటే, అంతమేరకు దుఃఖంతో మళ్ళీ నింపవలసి ఉంటుంది" అని నాన్న ఎల్లప్పుడూ అనడంలోని అంతరార్థం కొంతకొంతగా బోధపడుతోందిప్పుడు.

ఇంతగా తాను దుఃఖపడటానికి కారణం? వ్యతిరేకంగా అంతగా సుఖాన్ని తను పొందగలుగుతోందా?

శ్రీకాంత్‌లాంటి భర్త పంచజన్మల పుణ్యఫలం వలన లభిస్తాడేమో? అతని ప్రతిమాట మధురం. అతను చేసే ప్రతిపని తనను సంతృప్తిపరుస్తుంది. అతని అందం, యవ్వనం, బలం, విజ్ఞానం- అన్నీ పరిపుష్టి నొందే ఉన్నాయి.

శ్రీకాంత్ దగ్గరకు వస్తూనే, ఏవో తెలియని తరంగాలు తనను చుట్టేస్తాయి. అతనికి దగ్గరగా నిలబడితేనే మధుర భావనల్లో తేలిపోతున్నట్టుగా ఉంటుంది.

అతను తన శరీరాన్ని తాకితే అఖండమైన శక్తి ఏదో తనలోకి ప్రవహిస్తున్నట్టుగా ఉంటుంది. అతనిని హత్తుకుంటే శరీరంలోని అణువణువు ప్రకంపిస్తుంది.

అతని తాకిడికి మనస్సు మాత్రమే కాదు, శరీరంలోని అణువణువు సుఖాన్ని జుర్రుకుంటున్నట్టుగా ఉంటుంది.

దుఃఖపు బాణాలు శ్రీకాంత్ ఇచ్చిన సుఖపు కవచాన్ని తాకి వెనక్కి వెళ్ళిపోతున్నాయి.

ఒక చిన్న ఉద్యోగం తమను దుఃఖంనుంచి బయటకు లాగగలుగుతుంది. పెద్ద ఉద్యోగం దొరకటం కష్టమే! క్లర్కు ఉద్యోగం అయినా దొరకదా?

ఉద్యోగం అన్నమాట వింటూనే చిరాకుపడతాడు శ్రీకాంత్. లెక్చరర్ ఉద్యోగం వస్తుందని కలలుకంటూ కూర్చుంటాడు.

జోరిగలా సొదపెట్టినా పట్టించుకోడు. కో




పంతో ముఖం మాడ్చుకుంటాడు.

తనదాకా వస్తేకాని విషయాలేవీ తెలిసిరావు కొందరికి. కొద్దిరోజుల్లో తల్లిదండ్రులు 'చెక్' పెట్టకమానరు. అప్పుడు కుడితిలోపడ్డ ఎలకలా...

ఏం చేయాలి? ఏమైపోవాలి? ఎంతకాలమిలా సాగాలి? అన్నీ ప్రశ్నలే! ఒక్కదానికీ జవాబులేదు. అన్ని ప్రశ్నలకు సమాధానం భర్తకు ఉద్యోగం దొరకడమే!

'ఆడదానిగా పుట్టడంకంటే అడవిలో చెట్టయి పుట్టడంమేలు' అన్న మాటలు విని చిన్నప్పుడు నవ్వుకునేది తను. ఇప్పుడు అవి తన బతుకుకే అన్వయించుకోవలసి వస్తోంది!

పావని స్నానం చేసేవరకు పన్నెండు దాటింది. అత్తగారు ఒక్కపనికూడా ముట్టుకోవడంలేదు.

అందరి భోజనాలు అవుతూనే ప్లేట్లు కడిగి, సామగ్రి సర్దడంతో గోడగడియారం ఒకగంట కొట్టిన శబ్దం వినిపించింది.

దీనికి విరుగుడుగా తాను ఏమీ చేయలేదా? గేదెలా జీవితాన్ని ఇలాగే సాగించాలా? ఆ గేదె జీవితమే కొంచెం మెరుగేమో! అది ఇచ్చే పాలకోసమైనా దానికి కావలసినవన్నీ సర్దుతారు మానవులు.

తనకు తినడానికి అన్నం, కూరలు కూడా మిగలడంలేదు. పిడికెడు మెతుకులు మిగిలాయి. కూరలన్నీ ఖాళీ అయినాయి.

కూరలు ఎక్కువగా చేస్తే ఇంత ఎక్కువ ఎందుకు చేశావని గద్దిస్తుంది. తక్కువగా చేస్తే ఎవరి ముక్కులో పెట్టాలని ఇంత తక్కువగా చేశావని అంటుంది. పెత్తనం చేతిలో ఉన్నవారి కత్తికి రెండువైపులా పదును ఉంటుంది.

కూరలు ఎంత రుచిగా చేసినా, బాగాలేవని ఈసడింపులు!

శ్రీకాంత్ మాత్రం, "నీ చేతుల్లోంచి అమృతధారలు నీవు చేసే కూరల్లో వర్షిస్తున్నట్లున్నాయి. ఇంత మధురమైన వంటకాలు నేనెప్పుడూ తినలేదు" అంటాడు.

ఎలాగైనాసరే తనకు స్వాతంత్ర్యంరావాలి! పూరి గుడిసె అయినాసరే... రోజుకు ఒక్కపూట అన్నంతిన్నా బాధలేదు. శ్రీకాంత్‌కు రెండు వందల రూపాయల ఉద్యోగం దొరికినా తాను సర్దుకుపోగలదు. శ్రీకాంత్ కాళ్ళదగ్గర తలబద్దలు కొట్టుకొని అయినా చెప్పాలి, గట్టి ప్రయత్నం చేయమని.

నాన్నకు ఉత్తరం రాస్తే తనను తీసుకువెళ్ళమని? ఇదేదో ప్రత్యేకమైన విషయంగా ఊహించుకుని బాధపడతాడేమో నాన్న? అయినా ఎన్నిరోజులు పుట్టింట్లో ఉన్నా మళ్ళీ ఈ గూట్లోకి వచ్చి చేరవలసిందేగదా?

పరిస్థితుల విషపు కోరలు మనసునిండా నింపిన ఈ విషాన్ని ఎవరిముందైనా వెళ్ళబోసుకోవాలి. ఎవరున్నారు చెప్పుకోవడానికి? శ్రీకాంత్‌కు అన్నీ తెలుసు, ప్రత్యేకంగా చెప్పవలసింది ఏముంది?

భోజనం చేయడానికి ఉపక్రమించింది. కూరలు, మజ్జిగ శాంపిల్‌కి కూడాలేవు. ఎలాగో భోజనం అయిందనిపించి, సామగ్రి సర్ది, ముందు గదిలోకి దారితీసేంతలో అత్తగారి మాట వినబడి మధ్యగదిలోకి వచ్చి గోడకు నక్కి నిలబడిపోయింది.

"ఏంచెప్పనమ్మా! ఈ కాలపు పిల్లలు మన చేతిలో వున్నారా? అడ్డాలనాడు బిడ్డలుకాని, గడ్డాలనాడు బిడ్డలవుతారా? నా కొడుకు తండ్రికే ఎదురుతిరిగాడమ్మా ఇవ్వాళ. పుట్టి బుద్ధెరిగినప్పటినుంచి ఎన్నడూ ఇలా మాట్లాడలేదమ్మా! తండ్రివైపు తల ఎత్తి చూడటానికే భయపడేవాడు; ఇవ్వాళ కొట్టేట్లుగా మాట్లాడాడు. నేను వాడి భార్యని కొట్టానా? తిట్టానా? పని నేర్చుకొమ్మని మందలించానంతే? దానికే ఇంత రాద్ధాంతం. ఏదైనా పనీపాట వుంటే కదా? తిని తిరిగేవాళ్ళు ఇలాగే చేస్తారు. ఇవ్వాళ తిడతారు, రేపు కొడతారేమో? కనాలి, పెంచాలి, చదువు చెప్పించాలి, ఇంతచేసి వీళ్లతో తిట్లు తినాలి" అంటోందామె ఎవరితోనో.

పావని శరీరంలోని కండరాలన్నీ బిగుసుకుపోయాయి. గుండెవేగం హెచ్చింది.

"అయినా ఇదంతా వాడి భార్యగారి మహత్యం. రోజూ ఏం నూరిపోస్తోందో? పెళ్ళాం మాటలు వింటే చెడిపోతారన్న సంగతి వాడికి తెలియదు. ఇంతగా వలలో వేసుకోవడమా?

మనకాలంలో భర్త ముఖం కూడా ఎలా వుంటుందో తెలియకపోయేది కొన్ని నెలలవరకు. అత్తమామల్ని కన్నెత్తిఅయినా చూసేవాళ్ళమా? ఈకాలపు కోడళ్ళు భర్తల్ని అత్తమామల్ని పురుగులని చూసినట్లుగా ఈసడించుకుంటున్నారు. వాడికి ఏ ఉద్యోగం లేకుండానే, ఈవిడగారు ఇంతగా మిడిసిపడుతోందే, ఉద్యోగం దొరికితే మమ్మల్ని బతకనిస్తుందా?''

మానిపోతున్న గాయం మళ్ళీ చిట్లింది. పావని మనసు మళ్ళీ శ్మశానంగా మారింది. కళ్ళు ఎరుపెక్కి నీళ్ళు స్రవిస్తున్నాయి.

''మీ అబ్బాయి మంచివాడేనమ్మా! మీ కోడలేదో మందుపెట్టినట్లుంది. లేకుంటే ఇలా మారిపోతాడా? బసవయ్య అని నాకు తెలిసిన అతను వున్నాడు. ఏదైనా మందుపెడితే కక్కిస్తాడు...'' అంటోంది పక్కింటి ఆండాళమ్మ.

పావని కళ్లలోంచి నీళ్ళు ధారాపాతంగా స్రవిస్తున్నాయి. అతికష్టంమీద వెక్కిళ్లను ఆపుకుంది. అక్కడ నిలబడలేక వంటింట్లోకి వెళ్ళి ఓ మూల పడుకుంది. ఉధృతంగా వస్తున్న దుఃఖాన్ని బహిర్గతపరచకుండా కొంగుని నోట్లో కుక్కుకుంది.

శ్రీకాంత్ ఒక నిశ్చయానికి వచ్చాడు. ఎంత తక్కువజీతం అయినా ఫరవాలేదు ఉద్యోగం చేయాలని. నెలరోజుల క్రితం వైజాగ్‌లోని ఓ ట్యుటోరియల్ కాలేజీ నుంచి కాల్ వచ్చింది. జీతం నాలుగువందలు మాత్రమే. అంత తక్కువ జీతానికి ఉద్యోగం చేయడం ఏమిటని అప్పట్లో ఊరకుండిపోయాడు. ఇప్పుడు తప్పనిసరి అయింది. ఆ ఉద్యోగానికి తోడుగా మరో రెండు ట్యూషన్లు చెప్పుకున్నా వందరూపాయలు వస్తాయి. అయిదువందల్లో గుట్టుగా కాపురాన్ని వెళ్ళదీసుకోవచ్చు. పావని కూడా అతి జాగ్రత్తగా ఖర్చుచేస్తుంది.

కాఫీ తాగడానికి హొటల్‌కు వెళ్ళే దారిలో కాంతారావు, ప్రహ్లాద్ కనిపించారు. ముగ్గురూ కలిసి హొటల్లోకి దారితీశారు.

కాఫీకి ఆర్డర్ఇచ్చి నవ్వుముఖాల్తో ఒకరొకరు చూసుకున్నారు మాటామంతీ లేకుండా. ఒకరిగురించి మరొకరు తెలుసుకోవాలన్న ఆత్రుత ముగ్గురి ముఖాల్లోనూ వుంది. ప్రహ్లాద్‌లోని చొచ్చుకుపోయే గుణం శ్రీకాంత్‌కు చాలా ఇష్టం. శ్రీకాంత్ సెన్సిటివ్‌నెస్ ప్రహ్లాద్‌కు ఇష్టం. కాంతారావు ఏవిషయానికైనా ప్రతివాదం చేయడంలో సమర్థుడుగా ఇద్దరికీ ఇష్టుడు.

''పెళ్ళి చేసుకున్నావు, జీవితం ఎలా సాగుతోంది?'' ప్రహ్లాద్ అడిగాడు నవ్వుతూ.

శ్రీకాంత్ నవ్వుముఖం ముడుచుకుపోయింది. ప్రహ్లాద్ ప్రశ్న చేదుమందు తాగినట్లుగా వుంది. తన పరిస్థితి తలుచుకుంటే, తనకే సిగ్గుగా వుంది. ఎందరు నిరుద్యోగులు లేరు? అందరూ ఇలాగే బాధపడుతున్నారా? దీనికంతా సెన్సిటివ్‌నెస్ కారణమా? ఇది ఎక్కువగా వుండటం మానసిక బలహీనతా? మండుతున్న అగ్నిగోళంలాంటిది సెన్సిటివ్‌నెస్. ఏ పదార్థం వేసినా భగ్గుమంటుంది. ఎటువంటి పరిణామం సంభవించినా మనసు వికలమౌతుంది. సెన్సిటివ్‌నెస్ ఎక్కువగా వున్నవాళ్ళు మామూలుగా తప్పులుచేయరు. మానవత్వం, నిజాయితీ పెట్టనికోటలా వుంటాయి వారికి. ఒక మిత్రుడు అన్నమాటలు గుర్తువచ్చాయి. ''సుఖంలేదని అనలేను! కష్టాలు ఆ సుఖాన్ని ఓవర్‌టేక్ చేస్తున్నాయి''.

''పెళ్ళిచేసుకున్న మొదటి మూడేళ్ళూ స్వర్ణయుగంలాంటివంటారే! మరి ఈ టైమ్‌లోనే నీవు బెంబేలుపడిపోతున్నావేమిటి?'' చిన్నగా నవ్వుతూ అన్నాడు ప్రహ్లాద్.

''కష్టం అనేది కొంచెం అయినా కష్టమే! అమృతభాండంలో ఒకచుక్క విషం పడినా అమృతం కలుషితమౌతుంది'' శ్రీకాంత్ ఎటో చూస్తూ అన్నాడు.

''విషయాల్ని ఎక్సాగరేట్ చేసుకుని బాధపడుతున్నట్లుగా వున్నావు?''

''కాదు... పెనుభూతాన్ని సీసాలో బంధించినట్లుగా; అంతులేని వ్యథల్ని చిన్నవిగా ఊహించుకుని సాగిపోతున్నాను''

''బురదలోంచి కమలం పుట్టినట్లుగా, కష్టాల్లోంచే సుఖం పుడుతుంది. సుఖం మొగ్గతొడగకముందే తొందరపాటు ఎందుకు?''

చివాలున తలఎత్తిచూశాడు శ్రీకాంత్ ప్రహ్లాద్‌వైపు. మన భారతదేశంలో పుట్టుకతోనే

కొంత తాత్వికతతో పుడతారు మనుషులు. అయినా ఆ తెలిసిన తత్వాన్ని కూడా జీవితాని కి అన్వయించుకోరు. ఉదాహరణకు అబద్ధం ఆడకూడదని ఎవరికి తెలియదు? అయినా మనం అబద్ధం ఆడటం మానుతున్నామా? మనిషికి దుఃఖం తామరాకుమీద నీటిబొట్టు అని తెలుసు. అయినా దుఃఖాన్ని దిగమింగుకో గలుగుతున్నాడా? సూత్రాల ప్రకారం జీవి తంలోకి చొచ్చుకుపోతే మనిషికి మనుగడ సాధ్యమేనా?

''మనిషిని స్వార్థంవైపు పరుగుతీయ కుండా ఆపడంకోసం మనపూర్వులు కొన్ని నైతికసూత్రాల్ని విధిగా ఆచరించమని చెప్పా రు'' అన్నాడు కాంతారావు.

''పరులకు హానికలిగించనంతవరకు, మన స్వార్థపరత్వాన్ని కొంత అదుపులో పెట్టుకో వడం మంచిదని నా సిద్ధాంతం. దుఃఖంతో ఉన్నమనిషి సుఖంకోసం పరుగుతీస్తాడు దప్పిక ఉన్నవారు గుక్కెడు నీళ్లకోసం పరుగు తీసినట్లుగా ఈ సుఖదుఃఖాల చదరంగంలో నిజంపై నిలబడటం అనేది నర్కస్‌ఫీట్ చే యడంవంటిది'' అన్నాడు శ్రీకాంత్.

''సిద్ధాంతాలు జీవితానికి అన్వయించుకో వడం మానివేసి పరిస్థితుల్ని, పరిసరాల్ని అర్థంచేసుకోవాలి. వాటిని అర్థంచేసుకోవడాని కే ప్రయత్నించం! 'ఎలా ఉన్నవాటిని అలాగే చూడు' అన్న తత్వం నాది. పరిస్థితులతో మనకు సంపూర్ణ అవగాహన ఏర్పడినప్పుడు దుఃఖం అనేది దూరంగా ఉంటుంది'' అన్నా డు ప్రహ్లాద్.

''మన అలవాట్లు, సంప్రదాయాలు ఇవే మన ప్రవర్తనా సరళిని ఏర్పరిచాయి. వాటిని కాదని ఎవ్వరి సిద్ధాంతాలు వారు ఏర్పరుచు కుంటే మనుగడ అనేది అసాధ్యం అవు తుంది''

కాంతారావు మాటలకు ప్రహ్లాద్ ముఖంలో రంగులు మారాయి. ''మన సమాజానికి సంప్ర దాయం అనే లక్ష్మణరేఖను గీశారు మనపూర్వు లు. ఆకాల పరిస్థితులకు అనుగుణంగా ఆ గీత గీయబడింది. ఇప్పటికీ అవి వర్తిస్తాయి అనుకోవడం పదేళ్ల వయసులో వేసుకునే డ్రెస్ ను, ఇరవయి అయిదు సంవత్సరాల వయ సులో వేసుకోవడంవంటిది. అలాగే వేసుకుంటే పిచ్చివాడి వాలకం ఏర్పడుతుంది. చూడటాని కే అసహ్యంగా ఉంటుంది. మనసమాజం పరిస్థితి పిచ్చివాడి వాలకంలా వుంది. వంద సంవత్సరాల క్రితం ఏర్పరచిన సామాజిక సూత్రాలు ఇప్పటి పరిస్థితులకు అన్వయిస్తు న్నారు. ఈ సామాజిక సూత్రాలకు 'ట్రెడిషన్స్' 'కస్టమ్స్' అని వినడానికి సొంపుగా ఉండే పేర్లు తగిలించారు. వీటివలన ఎంతగానో మార్పు కోరుతున్న మనిషి కూడా గత్యంత రంలేక తల ఒగ్గవలసి వస్తుంది. మనదేశంలో ఉన్నంత సాంప్రదాయపు కుళ్ళు మరేదేశంలో నూ లేదు. మన వాళ్ళ ఈ అనవసర కట్టుదిట్టా లు, మత మౌఢ్యాలు మన జీవితగమనాన్ని పాతిక సంవత్సరాలు వెనక్కి నెట్టుతున్నాయి. కాలిలో గుచ్చుకున్న ఈ ముల్లును తీసుకో కుండా గమనాన్ని పెంచుకోవడం ఎలా సాధ్యం?''

''నాకు వ్యవస్థ చేసే ద్రోహం కంటే, కుటుంబం చేసే వేధింపు ఎక్కువ'' శ్రీకాంత్ విచారంగా అన్నాడు.

''కొందరు మనుషులు కలిసి ఒక కుటుంబంగా, కొన్ని కుటుంబాలు కలిసి ఒక వ్యవస్థగా ఏర్పడతాయి. వ్యవస్థకు ఏర్పరచిన సామాజిక సూత్రాలకు కుటుంబం తల ఒగ్గి ఉంటుంది. ఏర్పరచబడిన రూల్స్‌లోని మంచిని విడిచిపెట్టి, చెడు సూత్రాలను తమ స్వార్థం కోసం ఉపయోగించుకునే వారు ఎక్కువ. మంచి రూల్స్‌ను పాటించావా లేదా? అని అడిగేవారు ఎవరూలేరు. స్వార్థపరత్వాని కి ఉపయోగపడే రూల్స్‌ను పాటించినప్పుడు వ్యవస్థే స్వార్థపరుడికి రక్షణగా నిలబడు తుంది. ఈ వ్యవస్థలో వేళ్ళూనుకు పోయిన సిద్ధాంతాలు మూర్ఖులకే ఎక్కువగా మేలు చేస్తున్నాయి. వీటిని ఛేదించే వాళ్ళు రెండు రకాలైన శక్తుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. సాంప్రదాయ సిద్ధమైన మంచినే గ్రహించి పాటించే వాళ్ళు కూడా ఈ మార్పుకోరే వారిని ఎదుర్కొంటారు. ఇక స్వార్థపరులు ప్రాణాలకు తెగించి అయినా మార్పు జరగకుండా ఆపుతా రు''

"శారీరక సంబంధమైన బాధలు భరించగలం కాని వీళ్ళు పెట్టే మానసిక చిత్రహింసను ఎన్నాళ్ళు భరించగలం?" శ్రీకాంత్ బాధగా అన్నాడు.

"జనరేషన్ గాప్ ఎక్కువగా ఉండటంవలన అవగాహనాలోపం జరుగుతుంది. పరిస్థితులకు అనుగుణంగా మారడం ఈ జనరేషన్ వాళ్ళ గుణం. ఓల్డ్ జనరేషన్‌లో పాత అలవాట్లనేవి వాళ్ళ శరీరాల్లో ఒక భాగంగా నిలిచిపోయింది. ఆ కుళ్ళు మనం పెరకడానికి ప్రయత్నిస్తే శరీరంలో ఒక అవయవమే లోపించినట్లుగా బాధపడతారు. వాళ్ళను మార్చడం అన్న ప్రయత్నం వ్యర్థమే! మార్పు ఏ మాత్రం కోరని వీళ్ళను దూరంగా ఉంచి యువత ముందుకు చొచ్చుకుపోవడం మంచిది"

"తాను కూర్చున్న కొమ్మనే నరుక్కోవడం అంటే ఇదేనేమో? వారు విద్యాబుద్ధులు గరిపిస్తేనే ఎదిగి వాళ్ళనే ఎదిరించడం సంస్కారం అనిపించుకుంటుందా? చదివిన చదువుకు సార్థకత ఇదేనా?" కాంతారావు ఆవేశంగా అన్నాడు.

"కాంతారావూ... నీప్రశ్నకు సమాధానం చెప్పడానికి తత్వశాస్త్రాలు, పురాణాలు తవ్వి కొన్ని కథలు చెప్పి నీచేతే ఒప్పించగలను, నేనన్న మాట తప్పుకాదని. చదువు, సంస్కారం అని అన్నావే... ఇవి వేర్వేరు పంథాలు. ఒకటి అలవాడినంత మాత్రాన, మరొకటి అలవడాలని రూలులేదు! మనిషి మూర్ఖత్వం అతని జీవితాన్ని ఎప్పుడో ఒకప్పుడు దెబ్బ తీయక మానదు, అలాగే వ్యవస్థ యొక్క మూర్ఖత్వం మొత్తం వ్యవస్థనే దెబ్బతీస్తుంది. అంటువ్యాధిలా వ్యాపించి పూర్తిగా ఆక్రమించకముందే తొందరపడటం ఉత్తమం. బాధాతప్త హృదయంతో ఉన్న మాకు వ్యవస్థ మార్పు గురించిన ఆలోచనేరాదు. తన బాధల నుంచి, తాను విముక్తి కాలేని వాడికి, వ్యవస్థను మార్చగలిగే శక్తి ఎలా వస్తుంది? బాధలనుంచి ఒడ్డుకు చేరినవాళ్ళు విప్లవాలను తేగలరా? బాధా సర్పద్రష్టులే విప్లవాల్ని తెస్తారా? విప్లవమనేది ఏ విధంగా మొదలవుతుంది? సమాజంలోకి ఎలా చొచ్చుకుపోతుంది? బ్రహ్మాండమైన వ్యవస్థముందు కొందరు మనుషులు నిలబడి ఎంతవరకు కదల్చగలరు? ఇది అసాధ్యమనిపిస్తున్నా మరొకవైపు సాధ్యమే అని కూడా అనిపిస్తుంది. చరిత్రలో ఎన్నో ఉదాహరణలున్నాయి. ఎన్నో మార్పులు, జరిగిన దాఖలాలు ఉన్నాయి. దేని దారి దానిదే! ఒకదారి అంటూ ఏర్పడలేదు. ప్రతివిప్లవవాదీతనంతటగాతాను మొదటినుంచి నరుక్కుంటూ రావాలి. కొందరు విప్లవకారులు తాము ఏర్పరుచుకున్న సిద్ధాంతాలకు తాము లొంగిపోతారు. మార్పు గురించి అనుక్షణం తపన పడతారు.

తమ జీవితాలనే సిద్ధాంతాలకు అంకితం చేస్తారు. ఇప్పుడున్న విద్యావంతులు మానవాళి మనుగడకు సిద్ధాంతాలు ఏర్పరిచారు. కాని అవి వారికోసంకాదు, మానవాళికోసమే!" శ్రీకాంత్ భావావేశంతో అన్నాడు.

"పుడుతూనే తల్లిపాలు తాగడం పసిబిడ్డకి ఎవరు నేర్పారు?ప్రతివిప్లవకారుడుతనంతటతానుగా వ్యూహాన్ని ఏర్పరచుకుని ముందుకు సాగుతాడు. విప్లవం దాని గతకాల, వర్తమాన పరిస్థితుల ప్రభావాలపై ఆధారపడి వుంటుంది. పాలకుల నైతికవిలువ, పాలితుల సహకారంపై ముందుకుసాగుతుంది. ఏవిప్లవమూ ఒక మూసలో పోసినట్లుగా ఉండదు. విప్లవగమనానికి కావలసిన ప్రత్యేక విధానం అంటూ ఎవ్వరూ ఏర్పరచలేదు..... ఏర్పరచలేరుకూడా" అన్నాడు ప్రహ్లాద్.

"చరిత్రలో కొందరు మహాపురుషులు విప్లవానికి కావలసిన సైద్ధాంతిక తుపాకిని తయారుచేసి ఉంచారు. దానిని పేల్చడమే మనపని అని ఎక్కడో చదివాను"

"మానవ మనుగడకు ప్రతిపాదింపబడిన ప్రతి సిద్ధాంతాన్ని మరో సిద్ధాంతం త్రోసిరాజని ఆక్రమించుకుంటుంది. దీన్నిబట్టి తెలిసేదేమిటంటే ఏ సిద్ధాంతము స్థిరమయినది కాదని. ఒక తరంలో మహోన్నతంగా ఉపయోగపడిన సిద్ధాంతం, మరో తరంలో గడ్డిపోచలా ఎగిరిపోవడం జరుగుతుంది. ఏసిద్ధాంతమైనా పయనించవలసింది ఒకే కేంద్రానికి"

"నీవు చెప్పేవిషయంనాకు అంతుపట్టడంలేదు" కాంతారావు ఆశ్చర్యంగా అన్నాడు.

కొన్నివేల ఏళ్ళచరిత్ర చూస్తే పాలకులు

ఎప్పుడూ స్వార్థపరులుగా, పాలితులు అమాయకులుగా కనిపిస్తారు. పాలితుల జీవితగమనం సుగమంగా సాగడానికి కావలసిన విధానాన్ని పాలకుడు ఎప్పుడైనా ప్రవేశపెట్టడం జరిగిందా చరిత్రలో? పాలితుల మానసిక స్థాయి పెరుగుతూ వచ్చి, పాలకులు ఏర్పరిచిన లిమిట్స్‌దాటి వెళ్ళింది. పెరిగిన ఆ స్థాయిని యత్నపూర్వకంగా కుదించివేస్తూ పాలితులను మళ్ళీ అదేస్థాయిలో ఉంచేస్తున్నారు పాలకులు. గ్యాస్‌తో నిండిన ట్యాంక్ పగలకుండా ఉంటుందా? దానికి కావలాగా ఉన్న పాలకులు ఆ పేలుడుకు ముక్కలయిపోవడం చరిత్రలో జరుగుతూనేవుంది. ప్రతి దేశమూ ఈ పరిస్థితిని ఎదుర్కొంటుంది. మానవజాతి పాలకులు, పాలితులులేని నవసమాజస్థాపన వైపుగా పరుగుతీస్తోంది. మానవజాతి ఎప్పుడైనా ఈ స్థితికి చేరుకుంటుంది. దీనిని ఎవ్వరూ ఆపలేరు"

"మార్పు అనేది సహజసిద్ధమైనది. ప్రకృతి అదేపని చేస్తున్నప్పుడు ఇంతగా ఆరాటం ఎందుకు?" శ్రీకాంత్ అడిగాడు.

"నీవన్నది కొంతవరకు సమంజసమే. ఈ మార్పు త్వరితగతిలేకుంటే కొన్నితరాలు ఇనుపచట్రాలకింద నలిగిపోతాయి. అలా నలిగిపోకుండా మేల్కొనడం మంచిది. ఇది పెండింగ్‌ఫైల్‌లాంటిది. ఫైల్ పెండింగ్‌లో ఉంచితే ముందుతరంపై ఎక్కువ భారాన్ని వేసినవాళ్ళమౌతాము. పెండింగ్ లేకుండా ఎప్పటి ఫైల్ అప్పుడు ముందుకు వెళితే పని సులభతరం అవుతుంది"

"ఇప్పుడున్న ప్రజాస్వామ్య విధానాలు నవసమాజ స్థాపనవైపు పయనించడం లేదా?" అడిగాడు కాంతారావు.

"ఈ డెమొక్రటిక్ సిస్టంలో ఏవర్గం ఆధిక్యతలో ఉంటుందో, ఆవర్గం మాత్రమే తమకు కావలసింది సమకూర్చుకోగలుగుతుంది. ఇదొక పరుగుపందెం లాంటిది. బలమైన వర్గం వేగంగా ముందుకు ఉరుకుతుంది. బలహీనమైన వర్గం ఉరకలేక చతికిలబడుతుంది. వెనుక బడిన వర్గాన్ని పాలకులు మాయమాటలతో, మత్తుజల్లి తమ అవసరాలను తీర్చుకుని వదిలేస్తారు. ప్రతివర్గమూ చైతన్యంతో ముందుకు దూసుకువెళ్ళి తమకు కావలసింది పొందగలగాలి. వర్గాలన్నీ వర్గపోరాటంలో ఆరితేరనంతవరకు నవసమాజస్థాపనకు మెట్లు కట్టడం కష్టమౌతుంది"

"ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వం, ప్రజలపై ఎలా స్వారీ చేస్తుంది. ఏవిధంగా వారిని తమ అవసరాలకు వినియోగించుకుంటుంది?"

"ప్రశ్నని మెచ్చుకోలుగా కాంతారావు వైపు చూశాడు ప్రహ్లాద్.

"పార్లమెంటరీ విధానంలో కూడా కేంద్రీకృతమైన అధికారం ఉంది. ఇది సాలెగూడు లాంటిది. సాలెపురుగులా పాలకులు బహుగడుసుగా తమకు కావలసింది రాబట్టుకోగలుగుతున్నారు. సాలెపురుగు తన వలపై వాలిన పురుగును కబళించినట్టుగానే జరుగుతుంది"

ప్రహ్లాద్ చెప్పే విషయాలు ఖండించడం కాంతారావుకు అలవాటు. శ్రీకాంత్‌కుమాత్రం తెలియని విషయాలు ప్రహ్లాద్‌ద్వారా తెలుసుకోవాలని ఉంటుంది. "ఇప్పుడున్న స్త్రీవర్గం పరిస్థితి..." శ్రీకాంత్ చెప్పబోయేంతలో ప్రహ్లాద్ సైగతో ఆపి అన్నాడు- "ఏవిధంగా ఆలోచించినా ఇప్పుడున్న స్త్రీవర్గం అణచివేయబడుతోంది. అడ్డంకులన్నీ కనిపించని విద్యుత్ తరంగాలవంటివి. మార్గంలో ఏ అడ్డంకూలేనట్టుగానే ఉంటుందిగానీ అడుగుముందుకువేస్తే షాక్ తగిలి చనిపోవలసిందే. కుంటుపడిన ఈ వర్గంయొక్క గమనాన్ని ఏక్సిలరేట్ చేయక తప్పదు. ఇలా ఏక్సిలరేట్ చేయకపోతే పూర్తిగా మనమే ఆగిపోయి తుప్పుపట్టి మూలకు వేసిన ఇంజన్‌లా ముందుకు కదలనని మొరాయించేకాలం వస్తుంది. ఈ వర్గాన్ని కదిలించడానికి విప్లవసమిధలు అవసరం. మామూలు యజ్ఞంలో కలప సమిధలు అవసరం. ఈ విప్లవయజ్ఞంలో ప్రాణమున్న సమిధలు అవసరపడతాయి. ఈ సమిధలు ఈతరం ముందుకు దూసుకుపోవడానికి వెలుగును విరజిమ్ముతాయి"

"ఈ సమిధలుగా ముందుకు వచ్చేవారెవరు?"




''సమిధలుగా ముందుకు వచ్చేవారు లేనంతవరకూ ఆ వర్గం కుంటినడకనడుస్తూనే ఉంటుంది!''

శ్రీకాంత్ అర్థంకానట్లుగా తల పంకిస్తూ- ''నీవుచెప్పేది కొంతవరకు అర్థం అవుతుంది. కొంత అర్థం కావడంలేదు. ఉదాహరణకు విముక్తికోసం నేనొక సమిధగా వెలగాలనుకుంటున్నాను. ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటీ?'' అన్నాడు.

''నీవు ఏ విధమైన పీడనకు గురి అవుతున్నావో చెప్పు. సమిధగా నిన్ను వెలిగించే బాధ్యత నాది''

''ఒరేయ్... ప్రహ్లాద్‌ను కదపకు. తేనెతుట్టెను కదిపితే, తేనెటీగలు లేచినట్లుగా ఇతని సిద్ధాంతాలు లేస్తాయి. ఇవి బహు క్రూరమైనవి. స్త్రీ పురుష వర్గాల మధ్య పాలక పాలిత వర్గాల మధ్య, విద్యార్థి అధ్యాపక వర్గం మధ్యా, వైట్‌కాలర్- ఆఫీసర్‌లమధ్యా, కార్మికవర్గం- కేపిటలిస్ట్ వర్గం మధ్యా చిచ్చుపెట్టడానికే జన్మించినట్లుంది మన వాడు'' అన్నాడు కాంతారావు.

''అతని భావాలు చెప్పనీయ్. తుపాకీ తీసుకుని ఇక్కడ ఎవ్వరినీ కాల్చడంలేదుగా'' శ్రీకాంత్ అడ్డుకున్నాడు.

''పిచ్చివాడా... తుపాకీతో ఒకరో ఇద్దరో చనిపోతారుగానీ. ఈ వర్గ పోరాటాల్లో చచ్చినంత మంది చావడమో. పనులన్నీ స్తంభించిపోవడమో జరుగుతుంది. దేశమాతవైపే పిస్టల్ ఎక్కుపెట్టి కాల్చడం వంటిదిది'' ఉద్రేకంగా అన్నాడు కాంతారావు.

''వీడొక పచ్చి బూర్జువా. నిక్కచ్చి అయిన మితవాది. సామ్రాజ్య వాదతొత్తు'' ఆవేశంగా అన్నాడు ప్రహ్లాద్.

కాంతారావు కోపం పట్టలేక లేచి నిలుచున్నాడు. ''నేను వెళ్తాను. ప్రహ్లాద్ చెప్పే విషయాలు వినడం నాకు ఇష్టంలేదు''

''వినడంవల్ల నీకొచ్చే నష్టమేమిటో నాకర్థం కావడంలేదు'' సర్దిచెబుతున్నట్లుగా అన్నాడు శ్రీకాంత్.

''వినడంవలన నష్టంలేదా? అమెరికాలో ఎవడో కవి ఓ ట్రాజడీ సాంగ్ రాశాడు. అది రికార్డ్ ప్లేయర్‌లో వింటూ ఆత్మహత్య చేసుకుని చనిపోయారు కొందరు. ప్రభుత్వం ఆ సాంగ్‌ను బ్యాన్ చేయవలసి వచ్చింది''

''ఈ ఉదాహరణ చెప్పడం ఎందుకు? నేను చెప్పే మాటలు వింటే నీ చెవులు తూట్లు పడతాయా? నీవు కూర్చున్న కుర్చీ పేలిపోతుందా? పోనీ. కాస్త దూది నీ చెవుల్లో కూరుకో''

''ఎందుకు మీ ఇద్దరి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది? మీరు జనరల్‌గా క్లోజ్ ఫ్రెండ్స్. సిద్ధాంతపరంగా మాత్రం బద్ధవిరోదులు'' శ్రీకాంత్ ఆశ్చర్యపోయి ఇద్దరివైపు చూస్తూ ఉండిపోయాడు.

''శ్రీకాంత్.... నీవు చెప్పడంలోనే సమాధానం ఇమిడి ఉంది. ఏ వర్గానికీ మరో వర్గంపైన విరోధంలేదు. మానసికంగా ఒకరికొకరు కలిసివున్నవారే- సిద్ధాంతపరంగానే విరోధులు''

కాంతారావు మరేదీ మాట్లాడకుండా కూర్చుండిపోయాడు.

శ్రీకాంత్ సిద్ధమయ్యాడు అసంపూర్తిగా విడిచిన విషయాన్ని ముందుకు కదల్చడానికి. ''భారతదేశంలో స్త్రీ వర్గానికి నేను ప్రతినిధిని- అనుకుందాం ఉదాహరణకి. నేను ఏ విధంగా ఆ వర్గాన్ని ముందుకు తీసుకురావడంలో సమిధను కాగలను?''

''మన జనాభాలో స్త్రీల శాతం ఎంత?''

''యాభైశాతం ఉండవచ్చు?''

''పాలక వర్గంలో స్త్రీల శాతం ఎంతవరకు ఉండవచ్చు''

''టెన్‌పర్సెంట్ ఉండవచ్చు''

''వైట్‌కాలర్ జాబ్స్‌లో?''

''ట్వంటీపర్సెంట్ ఉండవచ్చు''

''ఒక కుటుంబంలో వీళ్ల అధికారాలు ఏ నిష్పత్తుల్లో ఉన్నాయి?''

''మూడువంతులు మగ, ఒకవంతు ఆడ ఉన్నట్లున్నారు టూకీగా. మన కుటుంబాల్లో పురుషాధిక్యతే ఎక్కువ అన్నది ఎవరైనా ఒప్పుకుంటారు'' అంటూ కాంతారావు వైపు చూశాడు శ్రీకాంత్. కాంతారావు ముభావంగా వింటున్నాడు.

''కుటుంబపెద్దగా తండ్రి సంతానంలో

పురుషులకు, స్త్రీలకు ఏ నిష్పత్తుల్లో తన రాబడిని వినియోగిస్తున్నాడు?''

''సమాన నిష్పత్తుల్లో మాత్రం వినియోగించడంలేదని చెప్పగలను''

రెండు నిముషాలు ముగ్గురి మధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది.

''ఆగిపోయావేం ప్రహ్లాద్?'' కదిపాడు శ్రీకాంత్.

''ఇక చెప్పవలసింది ఏముంది? మొదటి ఫారం చదువుతున్న పిల్లవాడికి చెప్పినా అర్థమౌతుంది. పై రేషియోలు చూస్తే స్త్రీ వర్గం ఎంతగా అణగదొక్కబడివుందో!''

''బాధ్యతలు నిర్వహించడంలో స్త్రీకి ఎన్నో ప్రతిబంధకాలు ఉన్నాయి. పిల్లలను పెంచడంలో, శరీరతత్వం రీత్యా అబలగా ఉండటంవలన స్త్రీ పురుషుణ్ణి డామినేట్ చేయలేకపోయింది'' కాంతారావు నోరు మెదిపాడు.

''నీవు చెప్పేది ఒకసాకు మాత్రమే! దీనిని ఎవరూ అంగీకరించరు. పిల్లలను కనడం తర్వాత పెంచడంలో తల్లి దండ్రుల బాధ్యత సమంగా ఉంటుంది. ఈ చిల్లర విషయాలనే గడ్డిపోచలతో వాళ్ళ చేతులను కట్టివేయలేవు కాంతారావ్!''

''మనుధర్మశాస్త్రం ప్రకారం కుటుంబ వ్యవస్థ నడుస్తుంది'' కాంతారావు ఉద్వేగంగా అన్నాడు.

''అవి తాతలనాటి ఛాందస. శాస్త్రాలు ఒక తరంలో వీటికి విలువ ఉండవచ్చు. ఇప్పుడున్న వ్యవస్థ నిలబడాలంటే వీటిని తిరిగి రాసుకోక తప్పదు''

''ప్రహ్లాద్.... స్త్రీ వర్గం బలహీనపడిందనే నీ భావనతో నూటికి నూరు శాతం ఏకీభవిస్తున్నారు. ఏ విధంగా ఈ వర్గం తన స్థానాన్ని సుస్థిరపరుచుకోగలదో చెప్పు''

''పాలక వర్గంలో స్త్రీల నిష్పత్తిని పెంచడంతో దీనికి మొదటిమెట్టు ఏర్పడుతుంది.''

''ఏవిధంగా?'' ఆశ్చర్యంగా అడిగాడు శ్రీకాంత్.

''అణచివేయబడిన ఏ వర్గమైనా ముందు సంఘటితవడాలి, సంఘటిత పడని ఏశక్తీ ముందుకు దూసుకుపోలేదు. ఉత్సాహం, ఉద్రేకం ఈ శక్తికి మూలం''

''తర్వాత?''

''స్త్రీలు ఉద్యోగాల్లో కూడా తమ నిష్పత్తిని పెంచుకోవడం''

స్త్రీలలో విద్యాధికుల శాతం చాలా తక్కువగా ఉంది. ఈ విషయంలో సాధించడం కష్టమే!'' అన్నాడు కాంతారావు పెదవిరుస్తూ.

''నేను చెప్పేది ఈ క్షణాన్నే అన్నీ చేయమనికాదు:, రానున్న కాలంలో చాలావరకు స్త్రీ పురుష నిష్పత్తి విద్యావిషయాల్లో మారిపోతుందేమోఅని నా అనుమానం''

ప్రహ్లాద్ చెప్పిన విషయాలు శ్రీకాంత్‌కు స్పష్టపడినాయి. ''స్త్రీవర్గాన్ని వరకట్నాలు బాధిస్తున్నంతగా మరేదీ...'' ప్రహ్లాద్ ముఖంలోకి చూసి, ఆగిపోయాడు శ్రీకాంత్.

''ప్రతి ప్రశ్నకు సమాధానం ఉంటుంది. శేష ప్రశ్నగా మిగిలిపోవడం అంటూ ఏదీలేదు. ఒకసారి ఓ సాహితీసభకు నన్ను ఉపన్యాసకునిగా పిలిచారు. సభ కళాశాలలో జరగడంవలన విద్యార్థినీవిద్యార్థులు కూడా నా ఉపన్యాసం విన్నారు. విని అందరూ మెచ్చుకున్నారు. నేను ఉపన్యాసం ముగిస్తూ ప్రతి స్త్రీ జ్వలిస్తున్న ఓ కాగడా కావాలనీ, ముందుతరం వాళ్లకి మార్గం చూపించాలని చెప్పాను. నా ఉపన్యాసం మధ్యలోనే కొందరు లేచి స్టేజ్ దగ్గరకు వచ్చారు. 'తాము వరకట్నాలకు పూర్తిగా వ్యతిరేకం అనీ, ఈ ఆచారాన్ని మార్చడానికి తమ ప్రాణాలయినా బలి ఇవ్వడానికి సిద్ధంగా వున్నామనీ అన్నారు. ఆ సమయంలో వాళ్లు మనస్ఫూర్తిగా ప్రమాణం చేశారు. జీవితంలో అవివాహితులుగా మిగిలిపోవడానికైనా వెనుకంజ వేయమనీ, వరకట్న వివాహాలు మాత్రం చేసుకోవడం జరగబోదనీ, ఒకరి తర్వాత ఒకరు అక్కడవున్న ప్రతి స్త్రీ ప్రమాణం చేయడానికి సిద్ధపడి వచ్చింది.''

''ప్రమాణం చేయడం అనేది కోర్కు తీర్చేంకాదు. ఏ నిముషం లోనైనా ప్రమాణితులు మనసు మార్చుకోవచ్చు. ఒక సిద్ధాంతపరంగా ముందుకు ఉరకడంలోని తృప్తి మనసు మార్చుకుని పాతగాడిలో పడటంలో లేదని

వాళ్లకు నచ్చచెప్పాను. ఒక సంవత్సరం తర్వాత ఆ కళాశాల విద్యార్థినుల గురించి వాకబుచేశాను. కనీసం పాతికశాతం వాళ్లు మాటమీద నిలబడ్డారని తెలిసి నేను తృప్తిగా నిట్టూర్చాను. పోరాటంలో పురుషునికంటే స్త్రీ నైతికంగా పైమెట్టులో ఉందేమో అనిపించింది. ఈ మాట అనడానికి కారణం, ఆ సమయంలో కొందరు విద్యార్థులు కూడా ప్రమాణం చేశారు. కట్నం లేకుండా వివాహం చేసుకుంటామని. తర్వాత వారిలో చాలావరకు ఆమాటమీద నిలబడలేదని తేలింది''

''నేనొక అన్ ఎంప్లాయిడ్ పోస్ట్‌గ్రాడ్యుయేట్‌ని. ప్రభుత్వం ఏర్పరచిన చదువు చదవగలిగినంతవరకు చదివాను. అయినా నిరుద్యోగిగా మిగిలిపోవడానికి కారణం ఏమిటో తెలియడంలేదు'' శ్రీకాంత్ అన్నాడు ప్రహ్లాద్ ముఖంలోకి సూటిగా చూస్తూ.

'పాలకవర్గానికి, విద్యార్థివర్గానికి ప్రత్యక్ష సంబంధం ఎక్కడుంది?'

''విద్యావిధానంలోనూ, ఉద్యోగ ప్రదానంలోనూ''

''పాలక వర్గం తోడ్పాటుకు ఉద్యోగంలో చేరినవారందరూ వైట్‌కాలర్ వర్గంగా మారిపోతారిందువల్లనే. విద్యావిధానం గురించి మన ముందెన్నో ఉన్నత భావాలున్నాయి. అయినా యూరప్‌లో కూడా ఉత్తమ విద్యావ్యవస్థ డెవలప్ కాలేదు. ఇండియాలో రావడానికి శతాబ్దమైనా పడుతుంది. విద్యావిధానంలోకి లోతుగా వెళ్లడం అటుంచి తక్షణ కర్తవ్యం ఏమిటని ఆలోచిద్దాం. మన విద్యావిధానాన్ని పూర్తిగా మార్చవలసిందే. ఇంగ్లీష్ వాళ్లు ప్రవేశపెట్టిన పద్ధతినే ఇంకా మనం కొనసాగిస్తున్నాం. ఈ సిస్టమ్‌ను ఎవరు మార్చాలి? పాలకవర్గం తన అధికారం స్థిరంగా ఉండటానికి మాత్రమే మార్పులతో ఏదో సహాయం చేసినట్లుగా నటిస్తుందిగదా!''

''మన అవసరాలకు, దేశకాల పరిస్థితులకు అనుకూలంగా ఎడ్యుకేషన్ సిస్టమ్‌ను మార్పుచేయాలి. యూనివర్సిటీనుండి బయట పడుతూనే జాబ్ దొరికేలా విద్యావిధానంలో మార్పురావాలి. కొన్ని లక్షల విద్యార్థులు డిగ్రీలు చేతపట్టుకుని యూనివర్సిటీనుంచి బయటకువచ్చి గోళ్లు గిల్లుకునే పరిస్థితి ఉందీనాడు. ఏమాత్రం అవసరంలేని కొన్ని సంస్థల్ని ఇంకా నడపటం ఎందుకు? అత్యవసరమైన నూతన సంస్థలని పెంపొందించడానికి ప్రయత్నమే చేయడంలేదు.

''డిగ్రీ పూర్తి అయినా దానివలన సాఫల్యత లభించనప్పుడు ఆ చదువువలన ప్రయోజనం ఏమిటి? విద్యావిధానగతిని మార్చడం ఎవరి చేతుల్లో ఉంది. ఇది ఇలాగే సాగితే మళ్లీ వర్గపోరాటం మొదలవుతుంది. అనవసరమైన విద్యావిధానానికి విద్యార్థివర్గం పూర్తిగా ఎదురు తిరగాలి. విద్యావిధానంలో మార్పు వచ్చేవరకు పోరాటాన్ని సాగించాలి. ఈ పోరాటాన్ని విస్మరించితే ప్రపంచయువతరం మధ్య భారతయువత ఆఖరిదిగా మిగిలిపోతుంది''

''తేనెటీగల్ని వదిలాడు. అది కుట్టడం కూడా మొదలుపెట్టాయి. శ్రీకాంత్‌లాంటివాళ్లు నీభాష్యాలను వింటారేమో కాని నేనుమాత్రం నీవుచెప్పే ఏ విషయాన్నీ ఒప్పుకోను. పోరాటం వైషమ్యాలకు దోవతీస్తుంది. వైషమ్యాలు రక్తపాతానికి దారితీస్తాయి. రక్తపాతంతో వచ్చిన ఏదైనా భయానకంగానే ఉంటుంది. మానవజాతి వయొలెన్స్‌యొక్క మెట్టుఎక్కి నాన్-వయొలెన్స్ శకంలోకి చేరుకుంది. మళ్లీ పాత సిద్ధాంతాలనే ఆచరించడం అనేది నీవు చెప్పినదానికి విరుద్ధమవుతుంది''

''నేను ఏ విధానాన్నీ సూచించడం లేదు. నాకు కావలసింది మార్పు. నీ మార్గంలో నీవువెళ్లు. కాని నేనువెళుతున్న మార్గమే ఉత్కృష్టమైనది అని ఎలుగెత్తి చాటడం ఎందుకు? మార్పు జరగడానికి చేసే ప్రయత్నంకంటే, నీసిద్ధాంతం యొక్క ఉన్నతిని చాటుకోడానికే ఎక్కువ కష్టపడుతున్నట్టుగా ఉంది'' అన్నాడు ప్రహ్లాద్.

శ్రీకాంత్‌కు ఆశ్చర్యం వేసింది. ప్రహ్లాద్, కాంతారావు విరుద్ధభావాలతో ఉండికూడా ప్రగాఢమైత్రితో ఎలా ఉండగలుగుతున్నారో అర్థంకాలేదు.

కాంతారావు ఆవేశంగా అన్నాడు-- ''స్వేచ్ఛ, మార్పు అనేవి ఒక ఒరలో ఇమడని రెండు కత్తులవంటివి. కొన్ని దశాబ్దాలక్రితం ఒక

సిద్ధాంతం ఆధారంగా కొన్ని దేశాలు సమాజాన్ని మరోమార్గానికి తిప్పాయి. ఉన్నతమైన స్థాయికి ఎదిగాయి. కాని ఆ దేశాల్లో స్వేచ్ఛ మృగ్యం. మానవజాతికి గాలి, నీరు ఎంత అవసరమో స్వేచ్ఛ, మార్పుకూడా అంతగానే అవసరమవుతాయి. కాని స్వేచ్ఛ, మార్పు అనేవి పరస్పరవిరుద్ధమయినవిగా నిరూపించబడినాయి ''.

''సమాంతరంగా ఉండే రెండు పట్టాలపై పయనించి రైలు గమ్యం చేరుకోవడంలేదా? ముందు తరంచేసిన తప్పుల్ని సరిదిద్దుకుని ఈ తరంలో మరింత స్వచ్ఛంగా స్వేచ్ఛతో ముందుకు సాగుదాం''.

కాంతారావు, ప్రహ్లాద్‌ల భావాలు కొంతవరకు ఏకమవడంతో శ్రీకాంత్ సంతృప్తిపడ్డాడు.

''సిమిలీలు కావ్యాలంకారాలు మాత్రమే. సిద్ధాంతాలకు వాటికి సామ్యం కుదరదు'' అన్నాడు కాంతారావు, ప్రహ్లాద్ ముఖంలోకి తీవ్రంగా చూస్తూ.

''సిద్ధాంతాలు ఆచరణలోపెట్టాలంటే ఎంతగానో ఎదురీదవలసివస్తుంది. ఎన్నో అడ్డంకుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. ప్రత్యర్థి బలం ఎక్కువగా ఉన్నప్పుడు మరో గత్యంతరంలేని పరిస్థితిలో స్వేచ్ఛకు కొంతమాత్రం ఆటంకం కలగవచ్చు. ప్రత్యర్థి పూర్తిగా అణగారిపోతూనే ప్రతిపాదింపబడిన సిద్ధాంతాల్ని పూర్తి ఆచరణలోకి తీసుకురావాలి''

''ఆహా... స్వేచ్ఛాపతాకం దుమ్ము, ధూళిపట్టి చిరిగిపోయే దశకు చేరుకుంది ఆ దేశాల్లో! దశాబ్దాలు గడుస్తున్నా ప్రత్యర్థివర్గం అణగారిపోలేదు'' కాంతారావు పదాలను వత్తిపలుకుతూ అన్నాడు.

''ముందుతరం చేసిన తప్పుల్ని దిద్దుకుని ముందుకు సాగడమే ఈ తరంయొక్క ముఖ్య లక్షణం. ఆచరణీయమైన ఏ సిద్ధాంత ప్రాతిప



దిక మీదనైనా సమాజాన్ని ముందుకు సాగనీ! సిద్ధాంతాలనే పిల్లబాటలగుండా సమాజం పయనిస్తూ రాజమార్గమైన నవసమాజంవైపు సాగుతుంది. స్వేచ్ఛలేని ఎటువంటి సమాజాన్నయినా ఈ తరం అంగీకరించదు. స్వర్గంలో కూడా స్వేచ్ఛ లేకుండా గడపడానికి ఇచ్ఛగింపరు. స్వేచ్ఛ, మార్పు ఇంటర్‌లింక్‌గా ఉంటూ సమాజాన్ని ముందుకు నడిపించాలి. స్వేచ్ఛ, మార్పు కొన్ని కారణాలవలన విడిపోయినా పళ్ళీ కలవగలిగివుండాలి. అలా కలుసుకోనప్పుడు ఆ సిద్ధాంతంలో ఎక్కడో లోపంవుండి వుంటుంది. ఆ సిద్ధాంతం ఆచరణీయమైనది కానిది వదిలివేయడం ఉత్తమం'' కుర్చీలోంచి లేస్తూ అన్నాడు ప్రహ్లాద్.

శాంతారావు ముఖంలో ఏ భావమూ కనిపించలేదు. ప్రహ్లాద్‌ను ఎదిరించడానికి మాటలకోసం ఎంతగా వెతుక్కున్నా లాభం లేకపోయింది. ఏవిధమైన ప్రశ్నా ఉద్భవించని, సంపూర్ణమైన భావం ఇమిడివుంది ప్రహ్లాద్ వాక్యాల్లో.

కాఫీ బిల్లు చెల్లించి, ఎవరిదారిన వారు వెళ్లారు ముగ్గురూ.




రఘురామయ్యకు ఇద్దరు కొడుకులు, ఒక కుమార్తె. భార్యపార్వతమ్మతో అనుకూల దాంపత్యం. కొడుకుల ఎదగడంవలన ఒకరికి వ్యవసాయం; మరొకరికి చిన్న చిన్న బిజినెస్‌లు అప్పగించాడు. బతుకు సాఫీగా సాగిపోతోంది. కోడళ్ళు చదువుకున్నవాళ్ళయినా ఒదిగిపోయి పనులుచేసుకోవడం సంతృప్తిగా ఉంది. పార్వతమ్మకు పూర్తిగాతీరికే- మనమలను, మనమరాళ్ళను ఆడిస్తూ కాలం గడిపేస్తోంది. కూతురు కమల అంటే ఆమెకు అంతులేని ప్రేమ. 'కమల కాపురాన్ని ఎలా నెగ్గుకొస్తోందో' అని ప్రతిరోజు అనుకోవడం ఆమెకు పరిపాటి.

★ ★ ★

వాసుదేవరావుగారు రిటైర్డ్ హెడ్‌మాస్టర్. ఉద్యోగ విరమణ తర్వాత చేతికి వచ్చిన డబ్బుతో ఉన్న ఒక్కగానొక్క కూతురు పావని పెళ్లి చేయగలిగాడు. భార్య అనసూయమ్మ అతనికి కుడిచేయి. నెలనెలా వచ్చే పెన్షన్‌డబ్బు; ట్యూషన్‌ల డబ్బుతో కాలం వెళ్ళమారుస్తున్నాడు. స్వంత ఇల్లు ఉండటంవలన సంపాదన తక్కువయినా జీవితం సాఫీగా సాగిపోతోంది. కూతురిపైన కొండంత ప్రేమవుంది వాసుదేవరావుగారికి. జీవితానికి సంబంధించిన విజ్ఞానాన్ని ఆమెకు బోధచేశాడు, బుద్ధుడు - ఆనందునికి చెప్పినట్లుగా. అందం, అణుకువ, వివేకం, విజ్ఞానం, దయ, ఓర్పుతో పావని నిండుకుండలా ఉంటుంది. పావని తండ్రి గుండెలో గూడుకట్టుకున్న దేవత. అనసూయమ్మకు భర్తవల్ల ఎటువంటి ఇబ్బందిలేదుగానీ కూతురి కాపురం గురించే భయం. నాగరత్నమ్మతో నెగ్గుకురావడం కత్తిమీది సాములాంటిది. పావనిపైన నమ్మకం కూడా ఉంది ఆమెకు- కష్టాల్లో నిలదొక్కుకుని నిలబడగలదని.

★ ★ ★

ఎమ్మెల్యే రాజేశ్వరరావుగారికి ఆ పదవి వలన ప్రత్యేకమైన ఉపయోగంలేదు. ఆయనది అధికారపార్టీకాదు. ఇద్దరు కొడుకులు అమెరికాలో స్థిరపడ్డారు. ఇద్దరు కూతుళ్లలో జ్యోతి మొదటిది, రెండవకూతురు సునందకు పదేళ్ళే.

ముప్పయిగదులదాకా ఉన్న పెద్ద బంగళాలో భార్య కృష్ణవేణమ్మ ఒంటరితనంతో బాధపడుతుంది. సునంద హాస్టల్లోఉండి చదువుకుంటుంది. ఆరేళ్ళ వయసులోనే ఇద్దరు కొడుకులూ పబ్లిక్ స్కూల్‌కు వెళ్ళడం వలన వారితో ఎక్కువ అనుబంధంలేదు. పెళ్లివయసు వచ్చేవరకు జ్యోతి తన దగ్గరే ఉండిపోవడంవలన, జ్యోతి అంటే ప్రత్యేకమైన ప్రేమ ఏర్పడింది కృష్ణవేణమ్మకు. జ్యోతిలో ఆవేశం ఎక్కువ. ముక్కుకు సూటిగా వెళ్ళే మనస్తత్వం జ్యోతి

మనసు గాజుపాత్రలాంటిదన్న సంగతి కృష్ణవే ణమ్మకు తెలుసు. వారానికి మూడుసార్లయినా ఫోన్‌చేసి కూతురి క్షేమసమాచారాలు తెలుసుకో వడం ఆమెకు పరిపాటి.

* * *

పరంధామయ్య వ్యవసాయంలో అనుభ వంతో పండిపోయాడు. తండ్రి ద్వారా సంక్ర మించిన అయిదు ఎకరాల మాగాణిని, పాతిక సంవత్సరాలలో యాభై ఎకరాలుగా మార్చగలి గాడు. రాబడి అధికం, ఖర్చులు తక్కువ. భార్య మీనాక్షమ్మకు పక్షవాతం వచ్చి కాలు, చేయి పడిపోయింది. సిటీకి వెళ్లి వైద్యం చేయిస్తే ఖర్చు వేలలో ఉంటుందని, పక్కటౌ న్‌లో ఉన్న ఆర్.యం.పి.తో వైద్యం చేయిస్తు న్నాడు. కొంచెం ఫలితం కనిపించింది. తన అవసరాలవరకు మెల్లగా నడవగలుగుతోంది మీనాక్షమ్మ.

రమేష్ తర్వాత మీనాక్షమ్మకు ఇద్దరు పిల్ల లు పుట్టి చనిపోయారు. సరియైన వైద్యం లభించి ఉంటే బతికేవారే. పరంధామయ్యకు భార్యా, పిల్లలను మించి డబ్బుపైన ప్రేమ ఎక్కువ. రెండుపూటలా భోజనం, రెండు మూ డు టీలు తాగడం తప్ప మరేవిధమైన ఖర్చు లేదతనికి.

పక్కటౌన్‌లో గ్రాడ్యుయేషన్ వరకు చదివా డు రమేష్. శ్రద్ధగా చదువుతున్నా పైచదువు లు చదవడానికి అవకాశం ఇవ్వలేదు పరంధా మయ్య. సిటీకి పంపి కాలేజీలో చదివిస్తే నెలకు నాలుగు వందలదాకా ఖర్చు అవు తుంది. అంత ఖర్చుచేసి ప్రయోజనంలేదు. ఉద్యోగాలు దొరికే అవకాశమేలేదు. కట్నరూపే ణా డబ్బు వస్తుందని ఆశపడి సిటీకి పంపితే తన చేతికి అందకుండా రమేష్ ఎదిగిపోవ చ్చు అనుకుని చదువు మాన్పించి ఇంటిదగ్గరే ఉంచి వ్యవసాయపు పనులు చూడటానికి తనకు తోడుగా ఉంచుకున్నాడు.

మీనాక్షమ్మకు పక్షవాతం రావడంతో రమేష్ పెళ్ళిచేయక తప్పలేదు పరంధామయ్యకు. ఒక కన్ను గుడ్డి, కొంచెం కుంటినడక ఉన్న అమ్మాయిని రెండు లక్షల కట్నం ఇవ్వజూప డంతో రమేష్‌కు చెప్పకుండానే నిశ్చయం చేసుకుని వచ్చాడు. అమ్మాయి అందంగానే ఉందని రమేష్‌కు అబద్ధం చెప్పి లగ్నానికి ముహూర్తం నిశ్చయించే ప్రయత్నం చేయ డంచూసి, తను ఒక్కడే వెళ్ళి అమ్మాయిని చూసి వచ్చాడు రమేష్. చూశాక గొంతువరకు కోపంవచ్చింది తండ్రిపైన. ఇంటికి వస్తూనే పరంధామయ్యను నిలదీశాడు. ఈమధ్య చూపు తక్కువయినందున అమ్మాయి లోపాలు కనిపించలేదని తప్పించుకున్నాడు తండ్రి.

ఆ తర్వాత పరంధామయ్య ఉచ్చులో చిక్కు కున్నవాడు రఘురామయ్య. లక్షరూపాయిల కట్నంతో తన కూతురు కమలను రమేష్‌కు ఇచ్చి ఘనంగా పెళ్లి చేశాడు రఘురామయ్య.

సౌష్ఠవమైన శరీరం, మెరుస్తున్నట్లుగా ఉన్న కళ్లు, నలుపు, ఎరుపు కలబోసుకున్న ఛాయతో ముఖంలో అంతుతెలియని ఆకర్షణ. చిన్నవ యసునుంచే పరిసరాలను అర్థంచేసుకుని అడుగుముందుకు వేయడం నేర్చుకున్న మనిషి. పరిస్థితులకు అనుకూలంగా మనసు ను దృఢపరచుకోవడం కమలలోని ప్రత్యేకత.

జంగిరెడ్డికి అయిదు వందలు అవసరం ఉండి పరంధామయ్య దగ్గరకు వచ్చాడు.

జంగిరెడ్డిని చూస్తూనే పరంధామయ్య- "రా, జంగిరెడ్డీ... చూశావా మా కమలమ్మ చేసినపని! చెన్నయ్యకు విత్తనం జొన్నలిచ్చి పంపింది. వడ్లు గాదెలో పోయించమంటే వరండాలో పోయించింది" అన్నాడు విచా రంగా.

"కమలమ్మకు ఏం తెలుసు? ఇంకా రెండు సంవత్సరాలన్నా ట్రైనింగ్ కావాలి. నీ చేతి కింద పని అంటే మామూలు విషయమా? నీ కొడుకుకే ఇంకా ట్రైనింగ్ పూర్తికాలేదు..."

జంగిరెడ్డి మాటలువిని పరంధామయ్య ము ఖంలో మరింత విచారం అలుముకుంది- "నిజమేనయ్యా! వానికేమీ తెలియదు తినడం, తిరగడం తప్పితే. ఒక్కపని చే యడం చేతకాదు! చేయించుకోవడం చేతకా దు! ఆలుమగలిద్దరికీ తిండి దండగ!"

"అట్లా అంటే ఎలాగయ్యా! ఒక్క కొడుకే కదా, ఎలాగైనా గడిచిపోతుంది"

"నాపేరు నిలబెట్టాలిగదా" గంభీరంగా అన్నాడు పరంధామయ్య.

''పేరంటే గుర్తుకు వస్తుంది! ఈసారి మీరు అసెంబ్లీకి నిలబడాలి''

''నేనువెళ్ళి పట్నంలో కూర్చుంటే ఇదంతా ఎవరు చూసుకుంటారు?''

జంగిరెడ్డి కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు. పరంధామయ్యకు చుట్టుపక్కల పల్లెటూళ్ళలో పలుకుబడి ఉంది. జంగిరెడ్డికి పరంధామయ్యపై అందుకే కొంత అసూయ. ఎలాగైనా పరంధామయ్య పలుకుబడి తగ్గించాలని ప్రయత్నాలు చేస్తునే ఉన్నాడు.

కొంచెం దగ్గరగా జరిగి తగ్గుస్వరంతో ''ఒక మాట చెప్తాను ఏమీ అనుకోవుకదా?'' అన్నాడు జంగిరెడ్డి.

''ఏమిటది?'' ఆత్రుతగా జంగిరెడ్డికి మరింత దగ్గరగా జరిగాడు పరంధామయ్య.

''మీకు తెలియడంలేదుగానీ రోజూ పత్తాలాట ఆడతాడట నీకొడుకు. కృష్ణారెడ్డి, నారాయణరెడ్డి, రాములు వీళ్ళందరితో పత్తాలాడుకుంటూ, మాంసంతింటూ, బీర్లు తాగుతారంట''

జంగిరెడ్డి పరంధామయ్య ముఖంలో పొంగుకు వస్తున్న కోపాన్ని చూసి మీసాలచాటున నవ్వుకున్నాడు.

''ఇన్ని రోజులుగా నాకెందుకు చెప్పలేదు రెడ్డీ? డబ్బంతా నాశనం చేస్తున్నాడా వీడు! అయినా నేను డబ్బు ఇవ్వనే! ఇదంతా చెయ్యడానికి రమేష్ దగ్గర డబ్బు ఉండాలిగా?'' కొంచెం అనుమానంతో జంగిరెడ్డివైపు చూశాడు.

''చెబితే మీరు కోపంతో రెచ్చిపోతారేమో? ధాన్యం దుకాణాల్లో అమ్ముతాడట...''

పరంధామయ్య ముఖంలోకి నెత్తురు పొంగుతూ రావడంచూసి పాచికపారిందని మరోసారి నవ్వుకున్నాడు జంగిరెడ్డి.

''ఇవ్వాళ వీని అంతు తేలుస్తాను'' పరంధామయ్య శరీరంలోని నరాలన్నీ నిగిడాయి.

'ఇది బ్రహ్మాస్త్రం దీనికి తిరుగులేదు.... అనుకున్నాడు జంగిరెడ్డి. అవసరమైన డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఊరిలో ఉన్న దుకాణాలన్నిటి దగ్గరకూ వెళ్ళి పంచాయితీ పెట్టుకున్నాడు పరంధామయ్య. రమేష్ అమ్మేధాన్యం వాళ్ళు తీసుకుంటే ఊరిలోనే లేకుండా చేస్తానని బెదిరించాడు. పరంధామయ్యకు భయపడి దుకాణాల వాళ్ళంతా రమేష్ దగ్గర ధాన్యం ఖరీదుచేయమని చెప్పారు.

ఇంటికి వచ్చి మంచంపైన కూర్చుని తనక్కడే గొణుక్కున్నాడు. తర్వాత వంట గదిలోకి వెళ్ళి ''నీ మొగనిపని అయిపోయింది. నా పరువంతా మంటగలిపాడు'' అన్నాడు.

కమల మౌనంగా వుండిపోయింది.

మీనాక్షమ్మ కనిపిస్తూనే'' ''నీ కొడుకు పని అయిపోయింది. ఇక చేతికి రాడు'' అనుకుంటూ వరండా దాటి బయటకు నడిచాడు.

గేట్ దగ్గరకు నడిచి, గడ్డి కిందపడటం చూసి ఎదిరి దొడ్లో వేసి, సూర్పిళ్ళ దగ్గరకు ప్రయాణమయ్యాడు.

సూర్పిళ్ళ కుప్పపై కూర్చుని ఇంటి విషయాలన్నీ అక్కడి పనివాళ్ళకు చెప్పడం సాగించాడు పరంధామయ్య.

రమేష్‌కు తండ్రిపై కోపం పొంగుకు వచ్చింది. 'ఇంటి విషయం రచ్చకెందుకు తేవాలి? ఈ మాత్రం తెలియదా తండ్రికి తెలిసి కూడా ఇలా మాట్లాడటం అంటే ఇంటి వాళ్ళ మీద అణుమాత్రమైనా గౌరవం లేకపోవడమే కమలపై కూడా కోపం వచ్చింది.

ఇంటివైపు దారితీస్తూ దారిలో రాజయ్య కొట్టులోకి సిగరెట్లు కొనుక్కోవడానికి వెళ్లాడు రమేష్. రాజయ్య జరిగిన విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. రమేష్ కోపం తారాస్థాయికి చేరుకుంది. 'అమ్మ పెట్టదు, అడుక్కు తిననివ్వదు' అన్నట్లుగా తను ఇచ్చేది లేదు! రెండు బస్తాలు అమ్మితే ఇంత రాద్ధాంతం చేస్తాడా?-- అనుకుంటూ విసవిసాకొట్లోంచి బయటకు నడిచాడు.

తన ఇంటి ముందునుంచి వెళుతున్న రమేష్‌ను ఆపాడు జంగిరెడ్డి. ''ఇవ్వాళ్ళ మీ నాయన నీ పరువు మొత్తం తీశాడు. ఈ విధంగా దుకాణాల దగ్గరకు వెళ్లి...'' రమేష్ ముఖంలోని భావాలను పసిగడుతూ అన్నాడు.

# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- [illegible]రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత !**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత !!**



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

రమేష్ మౌనం అర్థాంగీకారంగా తోచింది. "ఎదిగిన కొడుకుతో దోస్తులా ఉండాలికాని, మీ నాయన నిన్ను పాలిగానిలా చూస్తున్నాడు. ఊరిలోనివారంతా నిన్ను చూసి నవ్వుకుంటు న్నారు" అన్నాడు ఇంకాస్త రెచ్చగొడుతూ.

రమేష్ పాములా బుసకొట్టాడు. "ఈ ముస లివాణ్ణి ఎలా అదుపులో పెట్టాలో తెలియ డంలేదు"

"నేను చెబుతాను, నీవు ఏమీ అనుకోవు గదా" అంటూ రమేష్ చెవి దగ్గరగా వచ్చి సన్నగా ఏదో విషయం చెప్పాడు. రమేష్ మౌనంగా తలవూపాడు.

ఇంటికి వస్తూనే ఉరికినట్లుగా వంటగదిలోకి వెళ్లాడు. కమల వంట పూర్తి చేసి ఇల్లు సర్దడంలో మునిగివుంది.

"నీకేమయినా బుద్ధుందా? ధాన్యం ఎక్కడ పోయించాలో తెలియకపోతే ఎలా? ఇంత వయస్సు వచ్చినా చిన్న పిల్లలా ప్రవర్తిస్తే కాపురం ఎలా సాగుతుంది. చిన్నతప్పు దొర్లితే దానిలోంచే తీగలాగుతూ వెళ్లడం మా నాన్న అలవాటు. ఇన్ని రోజులైనా అతని మనస్తత్వం తెలుసుకోకుండా ప్రవర్తిస్తే బతకటమే కష్టమ న్న సంగతి నీకు తెలియదా?"

రమేష్ మాటలు బాణాల్లా తాకాయి ఆమెకు. కళ్ళలోంచి నీళ్ళు ధారలుగా కారుతు న్నాయి. తల్లిదండ్రులు పువ్వుల్లో పెట్టిపెంచా రు తనను. నోరు తెరిచి ఒక్క తిట్టు కూడా తిట్టి ఎరగరు. తను కోరినవన్నీ ఎదురు చెప్పకుండా తీసుకువచ్చేవాడు నాన్న.

ఒక్కరోజులో బతుకు ఎంత అన్యాయంగా మారింది? స్వర్గంలోంచి నరకంలోకి తోసి వేసినట్లుగా ఉంది. ఈ సుఖాన్ని బావుకోవడాని కేనా ఇంత డబ్బు ఖర్చుచేసి పెళ్ళిచేసుకో వడం? ఎన్నో సంవత్సరాల సంపాదనని తన సుఖంకోసం ధారపోశాడు నాన్న. ఏ ముఖం పెట్టుకుని మళ్ళీ పుట్టింటికి వెళ్లడం? వాళ్లకు తన బాధలు చెప్పి అసంతృప్తిపాలు చే యాలా?

ఈ కుటుంబంలో ఒకరినొకరు అర్థంచేసు కునే ప్రయత్నమే లేదా? చిన్న చిన్న తప్పుల్ని పట్టుకుని రాద్ధాంతం చేస్తే మనుగడ ఎలా సాధ్యం? మనిషికి మనసు అనేది ఉంటుందనీ, వెకిలి మాటలవల్ల అది క్షోభప డుతుందని తెలియదా వీరికి?

కమల శరీరంలోని అణువణువు భర్త, అత్త, మామలపై అసహ్యంతో మెలికలు తిరిగిపో యింది. ఆ క్షణంలో తల్లి ఎదలో తలదూర్చి గుండె పగిలేలా ఏడ్వాలనిపించింది.

"నంగనాచిలా మూతి ముడుచుకుంటే చే సిన తప్పు చెల్లిపోతుందా?"

రమేష్ మాటలు ఈటెల్లా కమల గుండెల్లో గుచ్చుకున్నాయి.

"నేనేం తప్పు చేశానని, అంతగా తీసివేసి మాట్లాడటం?" వెక్కిళ్ళతో అంది కమల.

రమేష్ మనసు కరిగిపోయింది. అయినా ఆ భావాన్ని తొక్కిపట్టాడు. ఆడదానిపై ఏ మాత్రం జాలి చూపించినా నెత్తికెక్కి కూర్చుంటుంది. చెప్పుకింద తేలుగా అదిమి ఉంచాలి అన్న మిత్రుల మాటలు గుర్తు వచ్చాయి. లేని కోపాన్ని గొంతులోకి తెచ్చుకుని, "ఎదురు మాట్లాడటం నేర్చావా? నోరు మూసు కుని పడి వుండక" అన్నాడు కసిగా.

"మాట్లాడితే తప్పు, మాట్లాడకపోతే తప్పు, పని చేస్తే తప్పు, పని చేయకపోయినా తప్పు! కూర్చున్నా తప్పు! నిలబడినా తప్పు! ఏడ్చినా తప్పు!" కమల రెచ్చిపోయింది.

పెళ్ళి తర్వాత ఇంతగా ఎప్పుడూ కోపం రాలేదు కమలకు. నిజానికి బుద్ధి తెలిసినప్ప టినుంచి కూడా తనకు ఇంతగా కోపం రావడం ఎరగదు. ప్రతి విషయానికి తలవంచుకు వెళ్ళి పోవడమే తెలుసు. అయినా నోటినుంచి అను కోకుండానే వెలువడ్డాయి ఆ మాటలు.

'తను ఈ విధంగా మాట్లాడటం తనకే ఆశ్చర్యం అనిపించింది. తర్వాత భయప డింది. తనను తాను అదుపులో ఉంచుకోవాల నుకుంది. అయితే ఈ మాత్రం అయినా ఎదురుతిరగకపోతే బానిసత్వంతో మగ్గిపోవ లసి ఉంటుందేమో అనుకుంది. ఎన్ని కలలు కంది జీవితం గురించి? ఎంత హాయిగా బతకాలనుకుంది? ఏదీ సుఖం? వీళ్ళిచ్చే సుఖ మేమిటి ఎదురుతిరిగితే లాక్కోవడానికి? అన్ని టికీ సిద్ధపడాలి' అనుకుంది. ఆ కొద్ది క్షణాల్లో

ఎన్నో ఆలోచనలు ముప్పిరిగొన్నాయి కమల ను.

రమేష్ ఆశ్చర్యపోయాడు. మూగగా ఉండే కమలేనా ఈ విధంగా మాట్లాడటం? పాలేరు ఒక్కసారిగా ఎదురుతిరిగి కొట్టవచ్చినట్లుగా అనిపించింది కమలను చూస్తూనే. అంతులేని ఆవేశం అతనిలో చోటు చేసుకోవడంతో శ్వాస వేగం హెచ్చింది. కళ్ళు ఎరుపెక్కాయి. ముఖంలో కోపం ప్రస్ఫుటించింది. పిడికిలి బిగించి ముందుకు ఉరికాడు.

కమల స్థిరంగా నిలబడింది. కళ్లలోంచి నీళ్ళు ధారగా కారుతున్నాయి. ఆమె శరీరంపైన ఎన్ని దెబ్బలుపడ్డాయో ఆమెకు గుర్తులేదు. కమల బలమైన శరీరం దెబ్బలకు తట్టుకోగలిగింది కాని సున్నితమైన మనసు వ్రక్కలైపోయింది.

★ ★ ★

స్కూటర్‌ఏక్సిడెంట్‌లో సురేష్ చనిపోయి నెలలు గడుస్తున్నా సరోజ మనసులో మాత్రం అతని రూపం వామన విక్రమంతో పెరిగిపోతోంది. కొన్ని విషయాలు ఎంతగా మరచిపోదామన్నా రెట్టింపై కళ్ళముందు మెదలుతాయి.

''జీవితం చిన్నపిల్లవాడిచేతిలో ఉన్న బొమ్మలాంటిది. చిన్నపిల్లవాడెప్పుడూ మోటివ్‌గా బొమ్మకాలు విరిచేయడు. అయినా బొమ్మకాలు విరిగి మూలపడుతుంది. తప్పు చిన్నపిల్లవాడిదీకాదు! బొమ్మదీ కాదు! జీవితంలో జరిగే సంఘటనలెప్పుడూ ఇలాగే ఉంటాయి. ఎందుకు జరిగింది అని తరిచి చూసుకోవడం వృధా! ప్రవాహంలా ముందుకు సాగుతూనే వుండాలి'' అన్న వాసుదేవరావుగారి మాటలు సరోజకు కొంతవరకు స్వాంతన కలిగించగలిగాయి.

''ధర్మం, అధర్మం సమాజం రూపొందించిన సూత్రాలు. మనసు నిర్ణయాలు ఒక్కొక్కసారి సమాజం నిర్ణయించిన సూత్రాలకు వ్యతిరేకంగా ఉండవచ్చు. సమాజం నిర్ణయించిన సూత్రాల ప్రకారమే వెళితే కొందరి జీవితాల్లో అశాంతి ఏర్పడే అవకాశంవుంది. మరెవ్వరికీ హాని కలిగించక, తన మనసుకు నచ్చిన మార్గంలో వెళ్ళడంవలన మనిషి తప్పుచేశాడని సమాజం నిర్ణయించినా, ఆ నిర్ణయాలు దారప్రుపోగుల్లాంటివి; మార్గాన్ని అడ్డుకోలేవు. కొన్ని తెలియని దారుల్లో వెళుతూ మార్గాన్ని ఏర్పరిచేముందు ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి ఉంటుంది. మార్గాన్ని సుగమం చేస్తూ మరికొందరు పయనించడానికి అవకాశం కల్పించడం మానవుని విధి'' అన్న వాసుదేవరావుగారి మాటలు సరోజకు చీకట్లో దివ్వెల్లా గోచరించాయి.

ఒకేవ్యక్తి చెప్పిన రెండు విషయాలు ఒక్కోసారి పరస్పరవిరుద్ధంగా ఉంటాయి. రుషిలాంటి గురువుమాటల్లో తప్పిదమా? తను అవగాహన చేసుకోవడంలో లోపం ఉండవచ్చు.

సరోజ తను ఎన్నుకోబోయే మార్గాన్ని గురించి తీవ్రంగా ఆలోచించింది. సమాజగమన సూత్రాలు, స్వేచ్ఛకు ఎప్పుడూ వ్యతిరేకంగానే ఉంటాయి. కొన్ని పరిస్థితుల్లో పూర్తిగా స్వేచ్ఛవైపు వెళితే తృప్తి మిగులుతుంది. కాని సంఘంలో ఒకరిగా మనడానికి అవకాశం లేకుండా పోతుంది. 'స్వేచ్ఛ అనే ఆయుధంతో సమాజగమన సూత్రాల్లోని కొన్ని లొసుగులను ఛేదిస్తూ వెళ్ళాలి' అనుకుంది.

స్వేచ్ఛఅన్న విషయం సమాజగమనసూత్రాలకు పూర్తిగా వ్యతిరేకమైనప్పుడు; ప్రతిమనిషి తనకు తెలియని సామాజిక సూత్రాలనే జైలులో బంధింపబడేవున్నాడా?

సమిష్టిగా వ్యవస్థఏర్పరచుకుని, కొన్ని మార్గదర్శక సూత్రాలను నిర్ణయించుకుని, సంఘం ముందుకు వెళుతుంది. వ్యవస్థలోని వ్యక్తికి ఆ మార్గదర్శక సూత్రాలను గౌరవించవలసిన అవసరం ఉంది. వ్యవస్థలోని కొందరు వ్యక్తులు సూత్రాలను గౌరవించమని వ్యతిరేకదిశలో పయనిస్తే సమాజం ఏమౌతుంది... కుప్పకూలిపోదా?

''మా సిస్టర్‌ని నేను ఎంతగానో ప్రేమించాను సతీష్! ఒక సంఘటన నన్ను వాస్తవంవైపు లాక్కువెళ్ళింది. మనిషి ఏ విషయంగురించి ఎక్కువ జాగ్రత్త పడతాడో, ఏది జరగకూడదని అనుకుంటాడో అదే జరిగితీరుతుంది'' ఆవేదనగా అన్నాడు శ్రీనివాస్.

''ఏ విషయం గురించి నీ వింతగా మధన



.పడుతున్నావో నాకు తెలుసు. జీవితాన్ని పూర్తిగా అవగాహనచేసుకోకుండా ముందుకు సాగితే ఇలాంటి మానసిక సంఘర్షణే ఎదురౌతుంది. కొన్ని విషయాల్లో లోతులేదులెమ్మనుకుని పయనిస్తే ఊబిలా అది మనల్ని లోపలికి లాక్కుంటుంది. మరికొన్ని విషయాలు ఎంతో క్లిష్టమైనవనుకుని పయనిస్తాంగానీ అక్కడ అదేం కనిపించదు. సాధారణ విషయాలపై చలిస్తూ అక్కడేదో ఊబి ఉందని భ్రమించేవారిలో నీవు ఒకడివి''

''నీవు చెప్పేవన్నీ సిద్ధాంతాలు. వాస్తవానికి వచ్చినప్పుడు ఆ థియరీలు తారుమారవుతాయి''

''పాముకాటుతో శరీరంలో విషం ప్రవహిస్తుంది. అంతకన్నా ఆ భయంకర సంఘటన యొక్క కాటు మనసులో నింపే విషాదం ఎక్కువ. పాముకాటు వేసిందని అలాగే ఉండిపోతామా? ఔషధాన్ని ఉపయోగిస్తాం. అలాగే మనసుకు డైవర్షన్ అనే ఔషధాన్ని వాడాలి''

''బాధాకరమైన సంఘటనను చూసి జాలిపడటం మనిషి ప్రవృత్తి. ఆ బాధ తనకే సంభవించినదయితే నూరంతలుగా ఎక్కువ బాధపడతాడు. బాధయొక్క తీవ్రత బాధింపబడినవాడికే తెలుసు''

''ఇతరుల బాధకూడా తన బాధగానే ఊహించాడు కాబట్టే బుద్ధుడు సర్వసుఖాల్ని త్యజించగలిగాడు''

''మహానుభావులను, మామూలువారిని ఒకే ఒరలో దూరుస్తున్నావు''

''మనుషులు నీవు ఊహించినంత దుర్మార్గంగా లేరు; అలా అని అందరూ మంచివాళ్లేనని నేను అనడంలేదు. కొన్నికొన్ని పరిస్థితుల్లో నిన్ను అత్యంతమైన ఆశ్చర్యంలో ముంచివేసే మంచితనాన్ని కొందరిలో చూడగలుగుతావు. మహాత్ములను చూసి మనిషి నేర్చుకోలేకపోతున్నాడు ఎందుచేత? మహాత్ములను ఉన్నతమైన ఆసనంపై కూర్చోబెట్టి, పూర్వజన్మసుకృతం అని మసిపూసి మారేడుకాయను చేస్తారు. కొంతగానైనా మహాత్మునిలోని మంచితనాన్ని తమలో రూపకల్పన చేసుకోవాలనే ఆలోచనే చేయరు. మనసుకు బానిస అయిన మానవుడు ఆ మనసును పూర్తిగా కంట్రోల్‌చేసే శక్తిని తన ఆధీనంలోకి తెచ్చుకోవాలన్న ఆలోచన చేయడు. ఎన్నో అరలున్న మేధస్సులో మొదటి అరమాత్రమే తెరచి సంతృప్తిపడతాడు. మిగతా అరలన్నీ చీకటిగా ఉంటాయి. మొదటి అరని మూసివేస్తేగాని మిగతా అరల్లో వెలుగురాని ప్రత్యేకమైన అరలవి. మొదటి అరలోని సుఖాలకు బానిస అయి, మరికొన్ని అరలు తెరచిచూడాలన్న ప్రయత్నమే చేయడు....''

''సతీష్ నీతో వాదించడం నావల్లకాదు. నాపరిస్థితిలో నీవే ఉంటే ఏంచేసివుండేవాడివి?''

''నీకు కోపం రాదుకదా? నీ స్థానంలో నేను వుండి, నాస్థానంలో నీవుంటే బంగారుబొమ్మలాంటి మా చెల్లెలికి మళ్ళీ పెళ్ళి ఎందుకు చేయకూడదు అనుకునేవాడిని. ఇన్ని ఆదర్శాలు వల్లిస్తావే? ఆచరణకు అవకాశం వచ్చింది, ఆమెను జీవితసహచారిణిగా ఎందుకు ఎన్నుకోవు అని నిన్ను నిలదీసేవాడిని''

శ్రీనివాస్ ఆశ్చర్యానికి అంతేలేదు. ''సతీష్... నిన్ను పొగడటం నాచేతకాదు. నిన్ను వివాహం చేసుకోగలిగితే మా చెల్లెలంత అదృష్టవంతురాలు మరెవ్వరూ ఉండరు''

సతీష్ చిన్నగా నవ్వి మిత్రుని భుజంపై చేయివేశాడు. చీకటిపడటంతో ఇద్దరూ గార్డెన్ నుంచి బయటకు నడిచారు.

వారంరోజుల తర్వాత సతీష్, శ్రీనివాస్ పల్లెకు ప్రయాణమయ్యారు.

శ్రీనివాస్‌వెంట వచ్చిన సతీష్‌ను చూసి సీతారామయ్య, రుక్మిణమ్మ ఆశ్చర్యపోయారు. శ్రీనివాస్ రావడంలో విశేషంలేదుగానీ వెంట ఓ మిత్రుణ్ణి తీసుకురావడం ఎందుకో వాళ్లకు అర్థంకాలేదు. అతనిని ఏవిధంగా గౌరవించాలో తెలియక తికమకపడ్డారు.

సతీష్ తాత గొప్ప రచయిత. ఆంధ్రప్రదేశ్‌లో ఆయన పేరు విననివారుండరు. సీతారామయ్య చూచాయగా సతీష్ తాత పేరు వినివున్నాడు సతీష్ తల్లి గర్భంలో వున్నప్పుడే తండ్రి గతించాడు

సతీష్ తాత దగ్గరే పెరిగాడు. తల్లి వద్దని

ఎంతగా వాదించినా ఆమె మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని, సతీష్ తాత పట్టుబట్టడంతో పెళ్ళి చేసుకోవడానికి ఆమె ఎట్టకేలకు సమ్మతించింది. పెళ్ళవగానే సతీష్ తల్లి వసుంధర భర్తతో ఢిల్లీ వెళ్ళిపోయింది. భర్త సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగి.

ఆరేళ్ళవయసునుంచి సతీష్ తాత దగ్గరే పెరిగాడు. సతీష్‌కు అన్నికోణాలనుంచి జీవితాన్ని చూడటం నేర్పాడు. వజ్రాన్ని సానపట్టినట్లుగా, సతీష్‌ను తీర్చిదిద్దాడు. పదహారేళ్ళవయసులోనే సతీష్ జీవితాన్ని గురించి నిశ్చితమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నాడు. శరీరానికి పాతిక సంవత్సరాలు వున్నా మనసు ఏభైసంవత్సరాల అనుభవంతో పండిపోయింది.

సరోజను చూడటానికే సతీష్ వచ్చాడని శ్రీనివాస్ తల్లిదండ్రులకు చెప్పలేదు. సరోజ అభిప్రాయం ఎలావుందో తెలుసుకోకుండా తొందరపడటం మంచిదికాదని సతీష్ వారించడంవల్లనే అతను పెళ్ళిచూపుల విషయాన్ని గుప్తంగా వుంచాడు.

ఎంతో కష్టంగా సతీష్‌కు, సరోజ టీ తీసుకెళ్ళి ఇచ్చే ఏర్పాటు చేయగలిగాడు శ్రీనివాస్. కాని ఇద్దరూ ఆ అవకాశాన్ని వినియోగించుకోలేదు. టీ ఇచ్చేసి ఒక్కనిముషం కూడా అక్కడ నిలబడకుండా సరోజ వెళ్ళిపోయింది. ఆమెను పలకరించడానికి సతీష్‌కు అవకాశమే దొరకలేదు.

సరోజకు చిన్ని కూతురు జానకి. జానకి పెళ్ళి రెండుసంవత్సరాల క్రితమే జరిగింది. సంవత్సరం తర్వాత జానకికి కొడుకు పుట్టడం, టి.బి. రావడం ఒకేసారి జరిగింది. సంవత్సరం వరకు ఎలాగో నెట్టుకురాగలిగింది. టి.బి. హాస్పిటల్‌లో వుండి స్పెషల్ ట్రీట్‌మెంట్ తీసుకోవడం తప్పదని స్పెషలిస్ట్ చెప్పడంతో తన కొడుకుని సరోజ దగ్గర వుంచి వెళ్ళింది జానకి.

ఈ రెండునెలలుగా పిల్లవాడితోనే కాలం గడిచిపోతోంది సరోజకు.

సరోజతో ఎలాగైనా కల్పించుకుని మాట్లాడి ఆమె అభిప్రాయాలు ఎలాంటివో తెలుసుకోవాలని వుంది సతీష్‌కు. అవకాశంకోసం ఎదురు చూస్తూ వుండిపోయాడు.

సతీష్ వుంటున్నది ఊయల వున్న గదిలోనే. ఓరోజు సరోజ రావడం గమనించి నిద్ర పోతున్నట్లుగా నటించాడు. బాబును ఊయలలో పడుకోబెట్టి డాబాపైకి వెళ్ళిపోయింది సరోజ.

పది నిమిషాలసేపు చూశాడు బాబు నిద్రలేస్తాడేమో అని. అతడు ఊహించింది జరగలేదు. మెల్లగా ఊయల దగ్గరకు వచ్చాడు. ప్రశాంతంగా నిద్రపోతున్నాడు పసివాడు. మెల్లగా బుగ్గపై చిటికవేశాడు. అతడు ఊహించిన కదలిక బాబులో లేకపోవడంతో తొడపై గిల్లాడు ఎక్కువ నెప్పి కలగకుండా బాబు కెవ్వుమన్నాడు.

ఏడుస్తున్న బాబును ఎత్తుకుని డాబాపైకి నడిచాడు సతీష్.

సతీష్‌ను చూస్తూనే ఆశ్చర్యపోయింది సరోజ.

"బాబు ఏడుస్తున్నాడు, మీరు డాబాపైకి వెళ్ళడం చూశాను. బాబును మీకిద్దామని తీసుకువచ్చాను" అంటూ పసివాణ్ణి ఆమెకిచ్చాడు. సరోజ చేతుల్లోకి రాగానే బాబు ఏడుపు ఆగిపోయింది.

సతీష్ నిలబడి వుండటం చూసి- "కూర్చోండి" అంది సరోజ.

"థ్యాంక్స్" అంటూ ఓ కుర్చీని ఆక్రమించాడు సతీష్.

సరోజ బాబును నిద్రపుచ్చడంలో మునిగిపోయింది.

సతీష్ ఏదోఒకటి మాట్లాడాలని- "బాబు అంతా మీపోలికే" అన్నాడు.

సరోజ నవ్వి- "మా అక్కయ్య సంతానానికి నా పోలికలు ఎలా వస్తాయి" అంది.

సతీష్‌కు తెలుసు. తను మాట్లాడిన మాట అసంబద్ధమయినదని సంభాషణ పెంచడానికి ఇటువంటి విషయాలే ఎక్కువగా వుపయోగపడతాయి.

"మారుపు చుట్టరికం అయినా రక్తసంబంధమేకదా. బాబు కళ్ళు మాత్రం మీలాగే వున్నాయని ఒప్పుకోక తప్పదు"

"నేను పోలికల గురించి ఎక్కువగా

పట్టించుకోను, చిన్నపిల్లల కళ్ళు మామూలుగానే పెద్దవిగా వుంటాయి''

రెండు ప్రయత్నాలు విఫలమయ్యాయి. మూడోసారి కూడా విఫలమైతే నోరు మూసుకోవటంతప్ప గత్యంతరం వుండదు అనుకుని- ''మీరు ఎంతవరకు చదువుకున్నారు'' అన్నాడు సతీష్.

''చదువు మనిషికి ఎంతవరకు ముఖ్యం? డిగ్రీలు వున్నంతమాత్రాన మనిషి ఉన్నతుడవుతాడా? మనిషి గుణగణాలన్నీ డిగ్రీలనే మీటర్లతోనే కొలుస్తారా?'' అందామె.

''చేపకు నీరు ఎంత అవసరమో, మనిషికి కూడా చదువు అంతే అవసరం. ప్రపంచంలో చదువు లేకుండా ముందుకుసాగడానికి వీలు పడదు. చదువులేకుంటే మనిషి ఒడ్డుపైకి విసిరివేయబడిన చేపలా గిలగిలలాడిపోతాడు. అయినా అక్షరంముక్క కూడా రాకుండా మహోన్నతమైన మానవులుగా ఎదిగినవారెందరో'' అన్నాడతను.

''జంతువులన్నీ నీళ్లలోనూ, నీటిబయట రెండువిధాలుగా బతకలేవు. కొన్ని జంతువులకు మాత్రమే ఇది సాధ్యం. ప్రతి విషయానికీ మినహాయింపులు వుంటాయి. వాటిని పట్టుకుని వేలాడటం విజ్ఞత అనిపించుకోదు'' అందామె.

''కత్తికి రెండువైపులా వుండే పదునులా, మీ మాటలకు రెండువైపులా పదును వుంది. ఈ జ్ఞానం మీకు చదువువలననే వచ్చిందని నేననుకోను. చదువుకాని మరో విషయం ఏదో మిమ్మల్ని ఉన్నతురాల్ని చేసింది''

''జీవిత పరమావధి చేరుకోవడంలో చదువు ఒక మెట్టు. సముద్రం ఉప్పొంగినా చెలియలికట్ట దాటిపోనట్లుగా, పూర్తి చదువుపైనే ఆధారపడిన మనిషి, ఆ పరిధిలోనే ఇమిడివుంటాడు. అలాఅని చదువుకు వున్న విలువ తీసివేయడానికి వీలులేదు''

''మీ మాటలు నాకు అర్థంకావడంలేదు''

''మీకు అర్థంకానట్లుగా మాట్లాడాలని నేను అనుకోవడంలేదు మీరు స్వాంతనగా ఆలోచిస్తే సులభంగా అర్థమౌతుంది. మీ జీవితాన్ని ఒక గమ్యంవైపు తిప్పుకోవడమేలేదు'' అన్నాడతను.

''మీరు చెప్పే గమ్యమేమిటో నాకు తెలుసు, చదువు పొడిగించమనికదూ?''

''ఒంటరిగా ఎన్నాళ్ళు గడుపుతారు ఈ పల్లెటూరిలో,

ఒంటరితనం జీవితానికి స్లోపాయిజన్‌వంటిది. చదువు కొనసాగించడంవలన ఒంటరితనానికి దూరమయినట్లు ఉంటుంది. పరిస్థితులు అనుకూలించకపోతే మీకాళ్ళపై మీరు నిలబడతారు. ఒంటరితనమనే జైలునుంచి పారిపోయి స్వాంతన చేకూర్చే ఏ పనిచేసినా మంచిదే! మీకు కాలేజీకి వెళ్ళడానికి మనసొప్పకపోతే నేనుగాని, శ్రీనివాస్‌గాని ట్యూషన్‌చెబుతాం. సమాజంలో కలిసిపోతే మీరు జీవితాన్ని ఎంతగానో ఎంజాయ్ చేయవచ్చు''

''మీరు చెప్పిన విషయాలు ఆచరించదగ్గవే! కాని నేను ఒంటరితనంతో బాధపడటంలేదు. ఈ సినిమాలు, షికార్లులాంటివి నాకు ఏమాత్రం ఇష్టంలేదు. నా మనసు కరుడుగట్టి పాషాణమైపోయింది. వర్షపుచినుకు పాషాణంపై పడి ఏ మార్పును కలిగించనట్లుగానే సుఖ, దుఃఖాలనే వర్షపు చినుకులు నా మనసుపై పడి ఏ మాత్రమూ మార్చలేవు''

''ఒక సంఘటన మిమ్మల్ని సమూలంగా ఆక్రమించుకుని మీచేత ఈ మాటలు అనిపిస్తోంది. మేఘాలు కొంతకాలం మాత్రమే సూర్యుడిని అడ్డగిస్తాయి, ఎల్లకాలమూ అడ్డగించలేవు. ఆత్మశక్తి అనే వేడిని పుంజుకోగలిగితే అడ్డగించే మేఘం కరిగి నీరైపోతుంది. మళ్ళీ మీరు మామూలు మనిషిగా మారిపోతారు''

''కొన్నిరకాలయిన జీవాలు చీకట్లో ఉంటూ తృప్తిపడతాయి. ఆ చీకటివాటిముందునుంచి తొలగిపోతే వాటి కళ్ళు పోయినట్లుగానే బాధపడతాయి. వాటి జీవితం అటువంటిది. విధాత వాటిని ఆ విధంగా సృష్టించాడు''

''చీకట్లోంచి ఒక్కసారిగా వెలుగులోకి వస్తే కళ్ళు మూసుకుపోతాయి. అలా అని చీకట్లోనే ఉండిపోవాలని ఎవరూ కోరడం జరగదు''

''మీరు అన్నట్లుగానే నాకు ఆపాదింపబడిన చీకటిని అధిగమించి ఈ మాత్రమైనా

వెలుగులో ఉండగలుగుతున్నాను"

"మీరున్న వెలుగులో విషయాలను క్షుణ్ణంగా పరిశీలించే శక్తి మీకు ఉండవచ్చు. ఒకేదగ్గర స్థిరంగా ఉండి, ఆకళింపుచేసుకున్న విషయాలనే మళ్ళీ పరిశీలిస్తూ ఉంటే మనం ఎంతవరకు ఎదుగుతాం? ప్రపంచం విశాలమైంది. మీరు ముందుకు వస్తే ఎన్నో విషయాలు నేర్చుకుంటారు"

"ఏదో నేర్చుకోవాలన్న విషయాసక్తత నశించింది నాలో. అమృతకలశం లాంటి నా జీవితంలో విషపుబిందువు చిందింది. చంద్రుడులేని ఆకాశంలా నా మనసు శూన్యమైపోయింది. మనసుకు ముసలితనం వచ్చి ఆధ్యాత్మికంవైపు పరుగెడుతోంది. చేతివేళ్ళ సందుల్లోంచి సముద్రపు ఇసుక జారిపోయినట్టుగా ప్రపంచంలోంచి నా జీవితం క్షణక్షణానికి తరిగిపోతోంది. నావరకు నేను తరచి చూసుకోవడానికే సమయం చాలడంలేదు... ప్రపంచాన్ని చూడటానికి నేనెందుకు ఉత్సుకత చూపించాలి?"

సరోజ కొంతవరకు మనసువిప్పి మాట్లాడినందుకు సతీష్ సంతోషపడ్డాడు. "మీరు ఎటువంటి విషయాలని ఆలోచిస్తారో చెబుతారా?"

"చెప్పుకోలేనివి... చెప్పాలన్నా మాటల్లోపెట్టడానికి వీలులేనివి"

"నేను చెప్పగలను! మీ మనసులో ఏదో ముద్రించుకుని, అదే శాశ్వతమైనదని భ్రమపడుతూ, దాని చుట్టూ ప్రదక్షిణచేస్తూ ఉన్నారు. మకిలితో నిండివున్నదానిని పంచరంగులని భ్రమసి, మీ హృదయపు హారతిని ఇస్తూ కర్పూరంలా హరించుకుపోతున్నారు. మీరు గొప్పగా ఊహించుకున్నదానిని తుడిచి, అసలురంగు బహిర్గతపరిచేవారిని చుట్టుపక్కలకు రానివ్వకుండా అంధకారంలో ఉండిపోవాలనుకుంటున్నారు. అద్దంలో చూసుకుంటే మీ ముఖమే కనిపిస్తుంది. వేరొక వస్తువును ఉంచినా, ఆ వస్తువు ప్రతిబింబమే కనిపిస్తుంది. మానవుని మనసుకూడా అద్దంలాంటిదే. ఎన్నో ప్రతిబింబాలు మనసుపై పడుతుంటాయి. చెరిగిపోనివ్వాలి. మరొక దృశ్యం మనసుపైపడటానికి అవకాశాన్ని ఇవ్వాలి. ఏ దృశ్యమైనా శాశ్వతమైన ముద్రవేసుకోకూడదు. గాజులాంటి మీ మనసుకు మకిలిపట్టింది. దానిని తుడుచుకోవడానికి ప్రయత్నించక, అదే స్థిరమయిందని, సుఖప్రదమైనదని అనుకుంటున్నారు. దాన్ని తుడిచివేసే శక్తి మాకివ్వండి... మళ్ళీ మామూలు ప్రపంచాన్ని చూడగలుగుతారు" "మనసుకు పట్టిన మకిలిని తుడిచివేసే పరికరం నాకు తెలుసు. సంతోషమనే శక్తితో దానిని వెలిగిస్తే మకిలి కరిగిపోతుంది. సంతోషాన్ని పరిగ్రహించే పరిస్థితిని విధాత కల్పించలేదు" సరోజ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"అన్నీ తెలిసిన మీరు, మిమ్మల్ని మీరు గుర్తించలేకపోతున్నారు- ఎవ్వరి వీపు వారికి కనిపించనట్టుగా! మీలో పెరిగిన కలుపుమొక్కను పెరికివేయక, దాని వేళ్ళు మీ శరీరంలోని అణువణువూ వ్యాపించేలా చేస్తున్నారు. మిమ్మల్ని మీరు గుర్తించుకున్నా సమయం మించిపోతుంది"

"ఎవరు మీరు? జీవితార్థాన్ని సంపూర్ణంగా జీర్ణించుకున్న యోగిలా మాట్లాడుతున్నారు? నా మనసు కవాటాలను తెరిస్తే, క్షణంలో వస్తువులన్నీ పసిగట్టి వాటి రంగు, రూపు వివరించగలిగేలా ఉన్నారు."

"మీరన్నట్టుగా సంతోషమనే శక్తితో మిమ్మల్ని వెలిగించడానికి ఉపయోగపడే వ్యక్తిని"

"ఈ ప్రపంచంలోని సంతోషం ఏమిటో నాకు తెలుసు. అమృతం తాగుతూ విష్ణువుచే వధింపబడిన రాక్షసునిలాంటిది ఈ మనిషిలోని సంతోషం. అమృతం గొంతులోకి దిగీదిగగానే రాక్షసుని తల ఛేదింపబడినట్టుగా నా జీవితం ఛేదింపబడింది. విడివడిన బంధాల్ని మళ్ళీ కలిపేశక్తి మీకు ఉందేమో చెప్పండి?"

"అమృతవాక్కులు వింటూనే అనుకున్నాను మీరు అమృతాన్ని తాగివుంటారని" నవ్వుతూ అన్నాడు సతీష్.

సరోజ నవ్వింది. జీవితంలో అంత తృప్తిగా ఎన్నడూ నవ్వలేదు. సతీష్ మాటలు గుర్తుతెచ్చుకుని మళ్ళీమళ్ళీ నవ్వింది. నీలాకాశంలో తళుక్కున మెరిసే చుక్కల్లా ఆమె పలువరుస. నవ్వుతో ఎగిసిపడుతున్న ఆమె అవయ

విశిష్ట సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో [illegible]త్త పరిమళంతో వస్తోంది.

Imageads 2418 Tel

వాల కదలిక ప్రశాంతమైన సరస్సులాంటి సతీష్ మనసును ఉధృతంగా ప్రవహించే సెలయేరులా మార్చింది.

అప్పుడే విచ్చుకునే కలువలోని సోయగం, పున్నమి చంద్రుడిలోని చల్లని పాలవెన్నెల లాంటి కంటిమెరుపులు లేచిగుళ్ళలాంటి పెదవుల్లోని కోమలత్వం సౌరభాన్ని వెదజల్లిన ట్లుగా, ఆమె ఆకర్షణను విరజిమ్ముతోంది. బ్రహ్మ తనలోని సర్వశక్తులను కేంద్రీకరించి తయారుచేసిన అపురూపమైన స్త్రీమూర్తి సరోజ.




మోహన్‌కు ఇరవయి అయిదు సంవత్సరాల వయసున్నా మరో పది సంవత్సరాలు ఎక్కువే కనిపిస్తాడు. ప్రవర్తనలోనూ, శారీరకంగానూ, చిరుబొజ్జ పెరగడంవలన టక్ చేయడం కొంచెం ఎబ్బెట్టుగా అనిపిస్తుంది. గ్రాడ్యుయేషన్ వరకు ఎలాగో లాగగలిగాడు. ఇంటర్ తర్వాత కాలేజీకి వెళ్ళడం చాలావరకు తగ్గించాడు. చిన్నప్పటినుంచి వందల్లో ఖర్చుచేయడానికి అలవాటుపడటంవలన సినిమాలు, తాగుడు, పేకతో సమయం గడిచిపోయేది. గ్రాడ్యుయేషన్ తప్పి, గ్రూప్‌వైజ్‌గా ఎగ్జామ్స్ ఇస్తూ ఆరు సంవత్సరాలకాలంలో డిగ్రీ అయిపోయిందనిపించాడు. మోహన్ పెద్దన్నయ్య శంకర్ షుగర్‌ఫ్యాక్టరీ చూస్తుంటాడు సీజన్‌లో. మిగతా సమయాల్లో తండ్రికి సహాయంగా ఉంటాడు. రెండవ అన్న శ్రీధర్ ఆయిల్‌మిల్ చూస్తూంటాడు. రెండు మూడు రోజులకు ఒకసారి హైద్రాబాద్ వస్తూంటాడు.

ఫ్లోర్‌మిల్స్, సినిమా కాంప్లెక్స్, సూపర్‌మార్కెట్ మేనేజ్‌మెంట్ శేషగిరిరావుగారే చూస్తారు.

శేషగిరిరావుగారికి ఇంట్లోవాళ్ళతో మాట్లాడే తీరికే ఉండదు. కొడుకు మోహన్‌తో గత అయిదు సంవత్సరాలుగా తీరికగా ఓ రోజన్నా మాట్లాడే సమయం దొరకలేదు. మోహన్ చదువు, ప్రవర్తన గురించి ఆలోచించే ప్రయత్నమే చేయలేదు శేషగిరిరావుగారు.

సాంప్రదాయమైన కుటుంబం, అందమైన అమ్మాయి, ఆరులక్షల కట్నంతో వస్తున్న సంబంధాన్ని కాదనలేకపోయాడు శేషగిరిరావుగారు. మోహన్ పెళ్ళి ఘనంగా జరిగింది.

పెళ్ళి జరిగినా మోహన్ ప్రవర్తనలో మార్పు రాలేదు. అతను తాగే సిగరెట్లకు రోజుకు రూముప్పయి రూపాయలదాకా ఖర్చు అవుతాయి. రోజూ బార్‌కు వెళ్ళవలసిందే. వారానికి ఒక్కసారయినా కాల్‌గర్ల్ కావాలి. నెలకు పదివేలదాకా ఖర్చు చేస్తాడు మోహన్. తండ్రి దగ్గర నుంచి అయిదువేలు పాకెట్‌మనీగా వస్తుంది. మిగతా అయిదువేలు మేనేజర్లను పీడించీ, బెదిరించీ తీసుకుంటాడు.

శేషగిరిరావుగారు కొత్తగా ఒక ఇండస్ట్రీ పెడుతున్నారు. దానికి పెట్టుబడి సమకూర్చుకోవడం కోసం అన్ని రకాలైన ఖర్చులపైనా పొదుపు పాటిస్తున్నారు. ఆ సందర్భంగా ఫ్యాక్టరీ, ఎస్టేట్ మేనేజర్లకు మోహన్ ఎంత పీడించినా, ఏడ్చినా డబ్బు ఇవ్వవద్దు అని చెప్పడంతో మోహన్ పరిస్థితి అయోమయం అయింది. తండ్రితో ఘర్షణకు దిగాడు. ఫ్లోర్ మిల్స్ తనే చూసుకుంటానన్నాడు. అనుభవం లేకుండా మేన్‌టెయిన్ చేయలేవని తండ్రి అన్నాడు. ఫీల్డ్‌లోకి దిగిన తర్వాత అనుభవం దానంతట అదే వస్తుందని ఎదురు చెప్పడంతో శేషగిరిరావుగారు దిగిరాక తప్పలేదు. కొత్తగా కట్టబోయే ఫ్యాక్టరీ స్టార్ట్ అవుతూనే, ఫ్లోర్‌మిల్స్ మోహన్ మేనేజ్ చేయడానికి అంగీకరించాడు. ఆ విధంగా మోహన్‌కు మామూలుగా నెలనెలా అందే మొత్తంలో కోత పడలేదు.

★ ★ ★

పావని అంట్లు తోముతూ బాత్‌రూమ్‌లో ఉంది. వాసుదేవరావుగారు ఎర్రటి ఎండలో చమటలు కక్కుతూ ముందు గదిలోకి రావడం

చూసి నాగరత్నమ్మ "రండి... అన్నగారూ" అంటూ సాదరంగా ఆహ్వానించింది. లోపలికి వెళ్ళి రెండు నిముషాల్లో మజ్జిగ గ్లాసుతో తిరిగి వచ్చింది. మజ్జిగ తాగుతూనే వాసుదేవరావుగారికి సేద తీరినట్లయింది. ప్రయాణంలో పావని గురించిన ఆలోచనల్లతో సతమతమైపోయాడు. నాగరత్నమ్మ ప్రశాంతత చూసి కొంతవరకు సంతృప్తిపడ్డాడు.

"పని మనిషి వచ్చి అంట్లు తోమిపోతుందని చెప్పినా మీ అమ్మాయి వినదు అన్నగారూ! ఈ పనికి పనిమనిషి ఎందుకని మాన్పించింది! నన్ను ఏ పనీ ముట్టుకోనివ్వదు. మెరుపుతునకలాంటిది మీ కూతురు!" అంది నాగరత్నమ్మ.

ఆ మాటలకు మరింత స్వాంతన చేకూరింది. తను ఊహించింది ఒకటి జరుగుతున్నది మరొకటిగా గోచరించింది వాసుదేవరావు గారికి.

ముందు గదిలో ఎవరో మాట్లాడుకోవడం వినిపించి బాత్‌రూములోంచి బయటకు వచ్చి ముందుగదివైపు చూసింది పావని. ఆమె గుండె ఆగిపోయినంతపని అయింది. "నాన్నేనా?" తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. ఉత్తరం రాసి రెండురోజులవుతుంది. ఉత్తరం ముట్టకముందే నాన్న వచ్చినట్లుంది అనుకుని ముందు గదిలోకి పరుగుతీసింది.

"బావున్నారా నాన్నా... అమ్మ కులాసా" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

కూతురిని చూస్తూనే ప్రయాణపు బడలిక పూర్తిగా తీరిపోయినట్లయింది వాసుదేవరావు గారికి. కూతురిపై మమకారపు బంధాలు పెనవేసుకుపోయి విడదీయరానంతగా బిగుసుకుపోయాయి. విశ్రాంతిగా కూర్చున్నపుడు పావని గురించిన ఆలోచనలతోనే సతమతమైపోతాడు. ప్రపంచంలోని తత్వాలన్నీ జీర్ణించుకుని ప్రాపంచిక సుఖాలన్నిటిపైనా వైరాగ్యాన్ని పెంచుకున్నాడు. కూతురిపై మమకారం మాత్రం ఎంతగా తొక్కిపెట్టినా ఉబికివస్తోంది.

వాసుదేవరావుగారు భోజనం ముగించి టౌన్‌లోకి వెళ్లారు. శ్రీకాంత్ వస్తూనే తండ్రి వచ్చిన సంగతి చెప్పింది పావని. శ్రీకాంత్ నవ్వి "అమ్మాయిగారి ముఖం వెయ్యివోల్టుల బల్బులా వెలిగిపోతుంటే, మీ నాన్నగారు వచ్చి ఉంటారని అప్పుడే ఊహించాను" అంటూ పావని బుగ్గపై చిటికవేశాడు.

"ఛీ... ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు అన్న ధ్యాసే ఉండదు మీకు!"

"చూస్తే ఏమిటట! సినిమాల్లో చూసి ముచ్చటపడటంలేదా? ఇంకా నేచురల్‌గా ఉన్న సీన్ చూసి మరింత సంతోషిస్తారులే!"

"మీలో మార్పు ఎప్పుడు వస్తుందో ఏమో? మీరు దగ్గరగా నిలబడితే నాకు భయం వేస్తుంది. ఏక్షణంలో ఏం చేస్తారో అని, ఆ చేయడం ఎవరైనా చూస్తే ఎలాగా అని!" శ్రీకాంత్‌కు దూరంగా జరుగుతూ అంది పావని.

"బి.సి. కాలపు అమ్మాయిలా మాట్లాడుతున్నావు. అమెరికా, జపాన్‌వాళ్ల సినిమాలు చూడటంలేదూ? పబ్లిక్ ప్లేస్‌ల్లో కూడా హాట్‌కిస్‌లు తీసుకుంటారు వాళ్లు. నేను చేసే ఈ చిన్న టచ్‌కే భయపడిపోతే ఎలాగా?" పావనికి మరింత దగ్గరగా జరిగాడు శ్రీకాంత్.

"అబ్బాయిగారికి మనం ఉండేది ఇండియాలో అన్న సంగతి గుర్తుంటే చాలా మంచిది"

"అయితే ఓసారి వెస్టర్న్ కల్చర్‌లోకి అడుగుపెడదాం" అంటూ ఆమె పెదాలకు తన పెదాలు కలిపాడు.

"మైగాడ్..." అంటూ గుండెలపై చేతులు వేసుకుని "ఎవరైనా చూస్తే ప్రాణం పోయినంత పనికాదూ..." అంది వెడల్పాటి కళ్ళను మరింత వెడల్పు చేస్తూ

"ప్రాణం పోతే ఏం? సావిత్రి ప్రాతివత్యంతో భర్త ప్రాణాల్ని యముడినుంచి విడిపించుకు వచ్చింది ఆ పతివ్రతలాగే యముడితో పోరాడి నీ ప్రాణాల్ని విడిపించుకు వచ్చి మహాసతీప్రతుడిగా చరిత్రలో మిగిలిపోతాను"

"మరి నేను మా ఇంటికి వెళ్ళిపోతే దిండును కౌగలించుకుని బతుకుతారా?"

"అమ్మాయిగారు ప్రయాణం కట్టేశారన్న మాట... అలా అయితే... ఇవ్వాళ్ళ రాత్రి

స్పెషల్‌గా...''

''ఛీ... మీకు మరీ బుద్ధిలేకుండా పోతోంది''

''నేనేమన్నాను... స్పెషల్‌గా స్వీట్లు ఏమైనా చేసి పెడతావేమోనని...'' ఓరగా పావని వైపు చూస్తూ, పెదాల్లో చిరునవ్వును దాచుకుని అన్నాడు శ్రీకాంత్.

''తెలుగు సినిమాలు చూస్తూ కూడా మీ మాటల్లోని గూడార్థాన్ని కనిపెట్టలేనంత అమాయకురాలినేం కాదు నేను'' అంటూ చటుక్కున వంటగదిలోంచి మధ్య గదిలోకి నడిచింది.

శ్రీకాంత్ ఆమె వెంటే మధ్య గదిలోకి వచ్చాడు. ముందు గదిలోని వాళ్ళకు వినపడేలా- ''మరిప్పుడెలాగా, మీల్స్ లేకుంటే టిఫిన్‌తో సరిపెట్టుకుంటాను'' అన్నాడు.

''టిఫిన్ రెడీ, తినండి''

''ఆడవాళ్ళకెప్పుడూ వంటల చింతే, నేను అనేది ఆ టిఫిన్' చిన్నగా పావనికి వినపడేలా అన్నాడు.

''మగవాళ్లకెప్పుడూ ఆ చింతే!'' అంటూ భయంగా దిక్కులు చూసింది ఎవరైనా వింటున్నారేమో అని.

''ఆ చింత అంటే ఏమిటో మాటల్లో చెప్పు, నాకెలా తెలుస్తుంది?''

''మీరిలా మాట్లాడారంటే, మీకు విడాకులిచ్చి మరొకర్ని చేసుకుంటాను'' కోపం నటిస్తూ అంది.

శ్రీకాంత్ సీరియస్‌గా మారిపోయాడు. ''నీవు చేసుకోగలవేమోకాని, నేను మాత్రం నాజన్మాంతం వరకు మళ్లీ పెళ్లిచేసుకోను. నీవు లేకుండా నేను నేనుగా ఎలా మనగలుగుతానో ఊహించుకోలేను. నాలోనీవు నాకంటే ఎక్కువ స్థిరంగా ఉన్నావు. నిన్ను నాలోంచి తీసివేస్తే ఆత్మలేని శరీరంలా కదలక మెదలక పడి



వుంటాను'' ఎటో చూస్తూ ట్రాన్స్‌లో ఉన్నట్లుగా మాట్లాడాడు శ్రీకాంత్.

పావని ఆనందంతో పులకించిపోయింది. మనసు ఆహ్లాదంతో తేలికపడింది. 'ఏ స్త్రీ అయినా ఇంతకంటే కోరుకునేది ఏముంది? ఇంతమంచి భర్త ప్రపంచంలో ఏ స్త్రీకి దొరుకుతాడు? తనంత అదృష్టవంతురాలు భూమిపైన ఉందా?' అతీతమైన ఆనందంతో దుఃఖం పొంగిపొరులుతూంది. అంతులేని దుఃఖంతో పిచ్చినవ్వు పరవళ్ళు తొక్కుతూంది. తను రెండింటినీ చూసింది. అత్తవేసే అభాండాలకు దుఃఖంతో మనసు విపరీతంగా బరువెక్కి మేడపైకి ఎక్కి పిచ్చిగా నవ్వుకుంటుంది కొన్నిసార్లు.

ఎవరో వస్తున్న అలికిడి కావడంతో పావని వంటగదిలోకి, శ్రీకాంత్ డాబాపైన గదిలోకి వెళ్ళిపోయారు.

సాయంత్రం ఆఫీసునుంచి వస్తూనే రామారావుగారు వియ్యంకుడిని క్షేమసమాచారాలడిగారు.

వాసుదేవరావుగారికి గుబులుగానే ఉంది. ఇంట్లో దమ్మిడీలేదు. స్వంత ఇల్లు. ఇరవయి సంవత్సరాలుగా ఉన్నఊరు కాబట్టి డబ్బు ప్రసక్తి లేకుండానే కాలం గడిచిపోతోంది. ఎందరో పరిచయస్తులు వాసుదేవరావుగారి మీది గౌరవంతో ఏ ఆపదవచ్చినా ఆదుకుంటారు. నెలనెలా వచ్చేడబ్బు ఇంటిఖర్చులకే సరిపోతుంది. ఏ మాత్రం మిగల్చడానికి అవకాశమే లేదు. ఉద్యోగవిరమణ తర్వాత వచ్చిన డబ్బంతా పావని పెళ్లికి ఖర్చయిపోయింది. ఇంతవరకు వాసుదేవరావుగార్కి పెద్దమొత్తంలో అప్పుచేయవలసిన అగత్యం ఏర్పడలేదు.

''బావగారూ... మీకు ఇంతవరకు మూడు ఉత్తరాలు రాశాను. మీరు డబ్బుపంపడమేమో కాని రిప్లయ్ కూడా రాయలేదు''

వాసుదేవరావుగారు మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయారు.

''మొత్తం అయిదు వేల ఆరువందలు. మీకు ఇవి కొత్తగా అనిపించవచ్చుకాని, ఈ ప్రాంతంవాళ్ళకి ఇవి మామూలే. కావాలంటే పక్కఇళ్ళలోకి వెళ్ళి విచారించండి. మీరు పది వేలు పెళ్ళయిన ఆరునెలలకు ఇచ్చారు. కాబట్టి వెయ్యి రూపాయలదాకా ఇంట్రెస్ట్ అవుతుంది''

వాసుదేవరావుగారికి అసహ్యం అనిపించింది. ఫండ్ డబ్బు వస్తూనే మిత్రుడు ఒకతను అత్యవసరం అంటే ఇచ్చాడు. డబ్బు వచ్చినప్పుడు పావని పెళ్లి నిశ్చయంకాలేదు. నిశ్చయం అయివుంటే వీలుకాదని చెప్పివుండేవాడే! కట్నం డబ్బుకు ఇంట్రెస్టా? వీళ్ళా తన కూతురిని సుఖపెట్టేది? తన కూతురి జీవితంలో నిప్పులుపోయడానికి తప్ప మరెందుకూ ఉపయోగపడరు! అతని శరీరం కుతకుత ఉడికిపోయింది. ఇప్పుడు అయిదు వేల ఆరువందలు ఎక్కడినుంచి తెచ్చేది? జీవితంలో ఎవ్వరినీ 'దేహీ' అని చెయ్యి చాచి అడగలేదు. తప్పదు! కూతురి సుఖంకోసం ఏమైనా చేయవలసిందే! వాసుదేవరావుగారి చేతులు వణికాయి. పూర్తి ముసలితనం ఆక్షణంలో ఆవహించిందతనిని.

''కొద్దిరోజుల్లోగా మొత్తం పంపండి, మాకు కొన్ని అప్పులున్నాయి, తీర్చాలి'' కఠినంగా అన్నారు రామారావుగారు.

'ఏవిధంగా చూసినా వాళ్ళు చెప్పే అయిదువేల ఆరువందలు కొత్తగా సృష్టించినవే తప్ప సాంప్రదాయకంగా ఉన్నది ఒక్కటీలేదు. ఒప్పించడానికి చేసే ప్రయత్నం శుద్ధదండగ' అని వాసుదేవరావుగారు అనుకునేంతలో—

''మీరు మిగతా డబ్బు పంపిస్తానన్నంతవరకు మీ కూతురు ఈ ఇంటి గడపదాటదు'' అంది నాగరత్నమ్మ.

వాసుదేవరావుగారికి గుండె ఆగినంతపని అయింది.

ఏమాట వాళ్ళ నోటినుంచి రాకూడదని ఇన్నిరోజులుగా ఎదురుచూస్తున్నాడో ఆ మాట రానేవచ్చింది. బండరాయి తలపై పడినట్లుగా తోచింది. విషపు బాణం గుండెకు గుచ్చుకున్నట్లుగా ఆమాట హృదయాన్ని తాకింది. కళ్ళలోంచి నీళ్ళు చిమ్ముకొచ్చాయి. 'ఇన్నేళ్ళ అనుభవం ఒక ఎత్తు. ఆడపిల్ల తండ్రిగా అనుభవం మరొక ఎత్తు! భగవాన్... జన్మజన్మలకూ




ఆడపిల్లలకు తంత్రిగా వేయకు' అనుకుని "సరే" అన్నాడు రెండు అక్షరాల్ని పత్తి పలు కుతూ. ఆ రెండు అక్షరాల్లో తన అసహ్యాన్ని, కోపాన్ని ప్రతిఫలింపజేస్తూ.

మంచుతో తడిసిన ముగ్ధమనోహరమైన గులాబీలా తళుకులీనుతూ పావని శ్రీకాంత్‌కు కనిపించింది ఆ రాత్రి. ఏదో నిర్మలత్వం ఆమెలో గోచరించింది అతనికి.

మన్మథుని ధనుస్సునుంచి వేగంగా దూసుకువచ్చే పుష్పగుచ్ఛంలా, పడిపడిగా సాగే సెలయేరుచేసే సడిలా, మేఘాలు మత్తులో ముద్దులు కుస్తున్నప్పుడు తళుక్కున మెరిసే మెరుపులా ఆమె అతడిని ఆక్రమించింది.

ఆమె ఉధృతంలో సుడిలోపడిన గడ్డిపోచలా తిరిగి పోయాడతను. ఆ రాత్రి ధారలుగా కురిసిన అమృతాన్ని తాగి తాగి మత్తెక్కి ఆ ప్రవాహంలో కొట్టుకుపోయాడతను.

అది ఒక మహత్తరమైన రసానుభూతి. శరీరాలుకాదు, ఆత్మలే ఏకమైన పరిపూర్ణ తాదాత్మ్యస్థితి.

తెల్లవారుజామున అయిదు గంటలకు తండ్రి వెంట ప్రయాణమయింది పావని. శ్రీకాంత్ మత్తుగాపడుకుని ఉన్నాడు. రాత్రి శ్రీకాంత్ చెప్పిన విషయం విని పావని మనసు తేలికపడింది. ట్యూటోరియల్ కాలేజీలో పనిచేయడానికి శ్రీకాంత్ వైజాగ్ వెళ్ళిపోతానన్నాడు. శ్రీకాంత్‌తో వెట్టుకింద కాపురం చేయడానికి కూడా తను వెనుకాడదు. ఇద్దరి జీవితాలకు ఒక గమ్యం ఏర్పడుతుంది.

శ్రీకాంత్‌ను లేపడానికి ఆమెకెందుకో మనస్కరించలేదు. అతని కాళ్ళకు తన నుదుటిని ఆన్చి ఒక నిమిషంసేపు అలాగే ఉండిపోయింది. ఆమె మనసుకు మరింత స్వాంతనచేకూరినట్లనిపించింది. అతని ముఖం వైపుచూస్తూ ఉండిపోయింది. నుదుటిపైని వెంట్రుకలు పాన్‌గాలికి నయ్యాటలాడుతున్నాయి. నున్నటి చెక్కిళ్ళు, అరవిందాల్లాంటి కళ్ళు, నలుపు, ఎరుపుకాని పసుపురంగులో మెరిసిపోతున్న చుబుకం, పలుచని మీసాలు, విల్లులా వంకీలు తిరిగిన పెదాలు-- ఒక ప్రత్యేకమైన శక్తి అతని ముఖంలోంచి ప్రతిఫలిస్తోంది. ఒక్కసారిగా కళ్ళలోంచి నీళ్ళు జలజలరాలాయి. ఓ పులకరింత శరీరంలో క్షణకాలం మెరుపులా మెరిసిమాయమయింది. ఇక చాలు. ఈ జీవితం ధన్యమయింది అనుకుని మేడమెట్లు గబగబా దిగింది పావని.

* * *

గేట్‌దగ్గరకు వస్తూనే పరంధామయ్యా అరవడం వినిపించింది రఘురామయ్యకు. అసలామనిషిని చూస్తూనే వెగటు పుడుతుంది. పరంధామయ్యా మనస్తత్వం నీచమయింది. ఏక్షణంలో ఏవిధంగా మాట్లాడతాడో తెలియదు. రఘురామయ్యకు మాటకు మాట చెప్పడం చేతకాదు. కాని బిడ్డముఖంచూసి నోరు మెదపకుండా ఉండవలసి వస్తోంది. అరవై సంవత్సరాలు రఘురామయ్యకు. బస్సు దిగి కూతురు ఇంటికి వచ్చేసరికి ఆయాసం ముంచుకు వచ్చింది. ఆ ఊళ్లో రిక్షాలు లేవు.

వరండాముందు నిలబడి పాలేరుతో మాట్లాడుతున్న పరంధామయ్యా రఘురామయ్యా రావడం గమనించనట్లుగా ఉండిపోయాడు.

మీనాక్షమ్మ రఘురామయ్యను చూస్తూనే వరండాలోంచి కేకవేసింది, "మీ నాన్న వచ్చాడు కమలా" అని.

తండ్రి వచ్చిన వార్త వింటూనే కమల ఆనందంతో పొంగిపోయింది. కడుగుతున్న పాత్రను అలాగే వదిలేసి వరండాలోకి పరుగు తీసింది. తండ్రిని చూస్తూనే ఆమె ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. ఇన్నిరోజుల కష్టాల స్మృతినీ ఆ క్షణంలోని ఆనందం కప్పివేసింది. కుశలప్రశ్నలు వేయడం కూడా మరచి అలాగే నిలబడిపోయింది.

కమలను చూస్తూనే రఘురామయ్య అవాక్కయిపోయాడు. ఆమె ముఖంలో కళాకాంతులు లేవు. దిగులును గూడుకట్టుకున్నట్లుగా ఉన్న కళ్ళు. పుష్టిగా, ఆరోగ్యంగా నిగనిగలాడుతూ ఉండే కమల దీర్ఘరోగంతో బాధపడుతున్న దానిలా కనిపించింది. రఘురామయ్య అంతరంగం బాధతో విలవిలలాడింది.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళి చల్లటినీటితో ముఖం కడుక్కుని, వరండాలోకి వచ్చి కూర్చున్నాడు.

సాయంత్రం ఆరుగంటల సమయం సూ

ర్యుడు అస్తమించినా, వేడిగాలి వేగంగా వీస్తోంది.

కమల కాఫీ కలుపుకుని వచ్చింది. కాఫీ తాగుతూ కూతురు అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ ఉండిపోయాడు రఘురామయ్య.

వరంధామయ్య వేగంగా ఇంట్లోకి వెళ్ళి, తిరిగివచ్చి "బావగారూ ఎప్పుడు వచ్చారు? చిన్నపని ఉండిపోయింది... తొందరలో వచ్చేస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

రఘురామయ్య మనసు చివుక్కుమన్నా, వరంధామయ్య మనస్తత్వం తెలియడంవలన ఎక్కువ బాధ కలగలేదు. వరంధామయ్య ఎదురుగా ఉండకపోవడమే ఒకవిధంగా మంచిది. విషపు బాణాల్లాంటి మాటలతో ఎదుటివారి మనసులో చికాకును కలిగించడం అతని అలవాటు.

"డాబాపైన పడుకుందువుగాని రా నాన్నా" కమల అనగానే వరండా అరుగుపైనుంచి లేచాడు రఘురామయ్య. మేడమెట్లు ఎక్కడంలో కమల తండ్రికి సహాయపడింది.

రఘురామయ్య బెడ్‌పైన కూర్చుంటూనే నిలబడివున్న కమలను చూసి "కూర్చోతల్లీ" అన్నాడు. కమల మంచం కొనకు కూర్చుంది.

మోడువారిన చెట్టు ఒక్కసారిగా పూచినట్లుగా ఆమెలో వసంతం వెల్లివిరిసింది. తను ఈమధ్య పదేపదే తలుచుకుంది నాన్న వస్తే బాగుండునని! అంతరాత్మ పిలుపునందుకునే నాన్న వచ్చాడనుకుంది.

సిగరెట్ వెలిగించుకోవడంకోసం అగ్గిపెట్టెకై వెతికాడు రఘురామయ్య. కిందికివెళ్ళి అగ్గిపెట్టె తెచ్చి తనే తండ్రి సిగరెట్ వెలిగించింది. చిన్నతనంనుంచి అలా వెలిగించడం కమల అలవాటు.

సిగరెట్ తాగుతూ "ఎలా ఉందమ్మా నీ కాపురం? నీవు సన్నబడటం చూస్తే నాకేదో భయంగా ఉందమ్మా?" అన్నాడు బాధగా.

తన బాధ తండ్రిముందు చెప్పుకోవాలని తపనగా ఉన్నా అంతరంగంలోనే అణుచుకుంది. మార్గాయాసంతో ఉన్న అతను సుఖంగా నిద్రపోవాలని ఉంది ఆమెకు. రాని నవ్వు ముఖానికి పులుముకుని, "తండ్రులకు కూతుళ్ళు అలాగే కన్పిస్తారు నాన్నా! నాకేమయింది... హాయిగా ఉన్నాను. నోట్లో నాలికలా కాపురం అంతా నా చేతిమీదుగానే నడుస్తుంది..." బాధనంతా గొంతుదగ్గరే అదిమిపెట్టి అంది. ఆ క్షణంలో విషంలా బాధ పైకిపాకి ముఖంలో దుఃఖపు ఛాయ అలుముకుంటూంటే ముఖం పక్కకు తిప్పుకుంది. బాధను దిగమింగి మళ్ళీ నవ్వుముఖంతో తండ్రివైపు తిరిగింది.

మార్గాయాసంవలన రఘురామయ్యకు కునుకుపట్టింది. మంచంకోడుకు తలఆన్చి అలాగే ఉండిపోయింది కమల.

రమేష్ చేయిచేసుకున్నప్పటినుంచి ఆమెలో అసంతృప్తి చోటుచేసుకుంది. సాంప్రదాయం విధించిన భార్యాభర్తల అనుబంధం కోసమే ఆమె అతనితో మామూలుగా ఉండగలుగుతోంది. ప్రేమ పూర్తిగా చచ్చిపోయింది. ప్రేమస్థానంలో ద్వేషం మొలకెత్తుతోంది. ద్వేషాన్ని తగ్గించుకోవడానికి ప్రయత్నంచేయడానికి అవకాశం లేకుండా మరో సంఘటనతో ఘర్షణ జరిగి ద్వేషపుమొక్క వృక్షమై వేళ్ళూనుకుంటోంది. వరంధామయ్య ఇంట్లోకి వస్తూనే ఆమె గుండెవేగం రెండింతలుగా పెరుగుతుంది. ఎంతో జాగ్రత్తగా శరీరమంతా కళ్ళుపెట్టుకుని పనిచేసినా, ఏదో తప్పుపట్టడం అతని అలవాటు. తప్పును వేలెత్తి చూపుతూ సంజాయిషీ అడిగినట్లుగా ముఖంలోకి చూస్తాడు. చిన్నచిన్న తప్పులుచేయడం మానవసహజం. ప్రతి ఒక్కరూ నిత్యజీవితంలో ఎన్నో తప్పులు చేస్తూవుంటారు.

ఇటువంటి విషయాలను బహిర్గతపరచి మనసును విరిచివేయడం మంచిదికాదు అన్న ఇంగితజ్ఞానం అతనిలో లేదు. వరంధామయ్య దగ్గరకు వస్తూనే శరీరంపై పురుగులు పాకినట్లుగా ఉంటుంది కమలకు. పాముకు కోరలో విషం పేరుకుపోయినట్లుగా కమలకు మనసులో అతనంటే అసహ్యం పేరుకుపోయింది. అత్తగారు ప్రతిపనిలో తప్పుపడుతుంది. వంటకాలు బాగాలేవని సణుగుతుంది.

వంటకాలు ఎక్కువచేస్తే మామగారు తిడతారు. తక్కువచేస్తే భర్త తిడతాడు. ప్రతి చిన్న విషయానికి పొదుపు అంటూ అత్త పోరుతుంది. ఇంట్లోకి అవసరమైన సామాగ్రి గురించి అడిగితే తండ్రీకొడుకులు ముఖం చాటేస్తారు. తనొక్కదానికోసమే వంటంతా చేసుకుంటున్నట్టుగా భావన కలుగుతుంది. తల్లిదగ్గరనుంచి అయిదువందలు తెచ్చుకుంది. రెండునెలల్లో ఇంటికికావలసిన సామాగ్రి తేవడంతో అయిదు రూపాయలు కూడా మిగలకుండా అయిపోయాయి. ఒక పౌడర్‌టిన్ను కోసం నెలరోజులుగా పోరినా రమేష్ తీసుకురాలేదు. రోజురోజుకీ వాళ్ళల్లో అసహనం పెరుగుతోంది. తనేదో వాళ్ళపైపడి తింటున్నట్టుగా ఉంది ధోరణి! పాలిగాణ్ణి కూడా కొంత మంచిగా చూడాలి, లేకుంటే మరుసటిరోజే పని ఎగవేస్తాడు! పాలిగాడికి ఉన్న విలువ తనకు లేదు! బానిసను బజారులో కొనుక్కువచ్చినట్లుగా ప్రవర్తిస్తున్నారు వీళ్ళు. లక్షరూపాయల కట్నంతో వచ్చిన తను లక్ష కష్టాలతో సతమతమైపోతోంది.

బాత్‌సోప్ ఇంట్లో ఎవ్వరూ వాడరు. రమేష్‌కు కూడా సోప్ గురించిన పట్టింపు లేదు. చాటుగా సబ్బు పెట్టుకుని తనవరకు వాడుతుంది కమల. అత్తగారు ఒకసారి చూసి, మామగారికి చెప్పడంతో అతను కళ్ళెర్రచేసి- ''సబ్బులు, స్నోలు, పౌడర్లు వాడటం మా ఇంటావంటా లేదు. మనం భోగంవాళ్ళంకాదు! ఒక్కొక్కసబ్బు మూడు రూపాయలు అవుతుంది. తేరగా డబ్బు వచ్చిందని అన్నీ కొనేయడమేనా'' అనడంతో కమలకు తల కొట్టేసినట్లయింది. తలకు రాసుకోవడానికి నూనె కూడా తీసుకురాకుండా పొదుపు ఆచరిస్తున్నారు ఇంట్లోవాళ్ళు. తైలసంస్కారంలేక అత్తగారి జుట్టు అట్టలుకట్టిపోయింది. ఓసారి పుట్టినరోజని తను తెచ్చుకున్న సెంటెడ్ ఆయిల్, పౌడర్, స్నోలతో మేకప్ అవడం చూసి అత్తగారు ముక్కుపై వేలేసుకుంది. పరంధామయ్యకు ఎదురువెళ్ళి ఈ విషయం చెప్పివచ్చింది. ''ఇదేమైనా సానికొంప అనుకున్నావా? సెంటాయిల్ రాసుకోవడానికి! మా పరువు తీసేలా ఉన్నావునీవు! మా బతుకును బజార్లోకి ఈడ్చేలా ఉన్నావు! నీవంటి కోడలుంటే కాపురమే కూలిపోతుంది. బుద్ధిలేక నిన్ను కోడలిగా తెచ్చుకున్నాం. పట్నంలో పెరిగిన ఆడపిల్ల పనిచేయదని అందరూ చెబుతున్నా వినకుండా! వాళ్ళమాట విననందుకు మంచిశాస్తి జరిగింది మాకు!'' అని మామగారిచేత చీవాట్లు తింది. ఆ క్షణంలోనే బాత్‌రూమ్‌కెళ్ళి మరోసారి తలస్నానం చేసి సెంటెడ్ ఆయిల్, పౌడర్, స్నోల వాసనలను వదుల్చుకుంది. రమేష్‌తో ఈ విషయం ఎన్నిసార్లు చెప్పినా వాళ్ళంతేలే ఊరుకోమంటాడు.

పొయ్యిదగ్గరి పొగతో, నిరంతరమైన ఏడ్పుతో కమలకు కళ్ళు మామూలుగా కనిపించడంలేదు. పత్రికల్లో అక్షరాలు అల్లుకుపోయినట్లుగా కనిపిస్తున్నాయి.

దీనికితోడు నిత్యం తండ్రి, కొడుకుల మధ్య తగువులు.

''నీభర్త నేను పండించిన ధాన్యం అమ్ముకుంటున్నాడు'' అంటూ పదే పదే తనతో చెప్పడం మామగారి అలవాటు. కమల నోరు మెదపకుండా ఉండటంచూసి- ''మీ భార్యాభర్తలు ఇద్దరూ కలిసి నాకు తెలవకుండా డబ్బు దాస్తున్నారు'' అనడం కూడా పరిపాటి అయిపోయింది.

మీ ఇద్దరికి తిండిపెట్టడమే దండగ, మళ్ళీ ధాన్యం అమ్ముకుని డబ్బు కూడబెట్టుకుంటారా, ఈరోజు అటోఇటో తేలిపోవాలి'' అంటూ కోపంగా ఇంట్లోకి ప్రవేశించాడు పరంధామయ్య.

ముందుగదిలో ఉన్న రమేష్‌ను చూసి- ''ధాన్యం అమ్మిన డబ్బు ఎక్కడదాచావో తీసుకురా...'' అన్నాడు.

''డబ్బెక్కడిది?'' బిక్కముఖం వేశాడు రమేష్.

''కొట్టులో అమ్మిన ధాన్యం డబ్బు''

''నేను అమ్మలేదు, నా దగ్గర డబ్బులేదు'' రమేష్ నిక్కచ్చిగా అనడంతో, పరంధామయ్య మరింత కోపంతో రమేష్‌కు దగ్గరగా వచ్చాడు.

''డబ్బు ఇచ్చి అడుగు ముందుకువెయ్యి''

పరంధామయ్య మాటలకు రమేష్ కోపం

కట్టలు తెంచుకుంది. "అమ్మాను. డబ్బు ఖర్చుచేశాను... అయితే ఏమిటి?" అన్నాడు.

వినకూడని బూతులు తిట్టడం సాగించాడు పరంధామయ్య. రమేష్ ఒక్కసారిగా ముందుకు ఉరికి తండ్రిగొంతు పట్టుకున్నాడు.

అనుకోని పరిణామానికి కమల శ్వాస స్తంభించిపోయింది.

రెండు నిముషాలు అలాగే గడిస్తే రమేష్ చేతిలో పరంధామయ్య చనిపోయేవాడే!

ముగ్గురు పాలేర్లు వచ్చి తండ్రికొడుకులను విడిపించారు. పరంధామయ్య ఆయాసంతో రొప్పుతూ మంచంపై పడిపోయాడు.

మరునాడు ప్రొద్దున్నే ఊహించని పరిణామం జరిగింది. తండ్రి, కొడుకులిద్దరూ ముందురోజు జరిగినదంతా మరిచిపోయి మామూలుగానే ఉన్నారు.

కమలకు అసహ్యం వేసింది. వీళ్లకు ప్రవర్తనా సరళిలేదు. అనుబంధం విలువ తెలియదు. ఆత్మీయత మాధుర్యం తెలియదు. ఇవన్నీ వీళ్ళలో వెతకడం ఎడారిలో నీటికోసం వెతకడం వంటిది అనుకుంది.

ఆలోచనలలో పడిపోయి వంటచేయడం మరిచిపోయింది కమల. తేరుకుని వంటింట్లోకి దారితీసింది.

అత్తగారు వంటింట్లోకి వచ్చి మెటికలు విరుస్తూ- "నీ భర్తకు, నీ మామగారికి ఇంత ప్రేమగా ఎన్నడయినా వంట చేశావా?" అంది నిష్ఠూరంగా.

తండ్రి వచ్చిన సంతోషంలో ఎవరేం మాట్లాడినా క్షమించేస్థితిలో ఉంది కమల.

'తనను ప్రేమించే వారికోసం చేసేపనిలో ఎనలేని తృప్తి ఉంటుంది. తనను ద్వేషించి, బాధించేవాళ్లకోసం చేసేపనంతా బూడిదలో పోసిన పన్నీరులా ఉంటుంది! అత్తగారు వేసిన నిందలో తప్పులేదులే! నవ్వుకుంది కమల.

'స్త్రీ, పురుషుల మధ్యలో ఈ విభేదం ఏమిటి? స్త్రీ అనుక్షణం మగవాడిముందు తల వంచుకుని బతికే పరిస్థితి ఎందుకు వచ్చింది? భారతదేశంలో స్త్రీ, పురుష సంబంధం, యజమాని, సేవకుని మధ్యలో ఉన్న సంబంధంకంటే నీచంగా ఉంది. సమిష్టికుటుంబాలలో స్త్రీ ఆశలు, ఆశయాలకు విలువేలేదు. స్త్రీ మాట గడ్డిపోచలా తీసివేస్తారు. స్త్రీకబాహాటంగా సంకెళ్ళులేవు. కాని కనిపించని సంకెళ్ళు, కనిపించే సంకెళ్ళకంటే ఎక్కువగా పనిచేస్తున్నాయి. పుట్టుకతోనే సంకెళ్ళతో పుడుతూ, చనిపోయేవరకు సంకెళ్ళతోనే చనిపోతుంది స్త్రీ. కర్ణుని కవచకుండలాల మాదిరి స్త్రీకి సంకెళ్ళు అంతర్భాగమైపోయాయి. సంకెళ్ళను తెంపివేసుకోవడానికి ప్రయత్నంచేసిన ప్రతిస్త్రీ సాంప్రదాయం ప్రకారం పతితురాలవుతుంది. విదేశాలలో సాంప్రదాయాలనే సంకెళ్లు లేవు. మనసుకు నచ్చింది చేస్తారు! ఆత్మసంతృప్తి ఇవ్వని క్షణంలోనే వివాహం విచ్ఛిన్నమవుతుంది. విదేశాలలో ప్రతి స్త్రీ తనకాళ్ళపై తాను నిలబడగలిగే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ఆర్థికంగా స్థిరపడిన స్త్రీ, మానసికంగా తృప్తి ఎప్పుడు లోపించినా తన గమ్యాన్ని మార్చుకునే అవకాశానికి వీలుంటుంది" కొన్నిరోజుల క్రితం రేడియోలో వచ్చిన ప్రసంగం విన్న తర్వాత కమల లోని ఆలోచనాసరళి మారింది. రఘురామయ్య భోజనం చేస్తూనే మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు. కమలకు తృప్తిగా ఉంది. అలాగే తండ్రివద్దగ్గరే కూర్చుండిపోయింది.

భోజనాలు అవుతూనే తండ్రి, కొడుకులిద్దరూ డాబాపైకి వచ్చారు. రఘురామయ్యతో మాట్లాడటానికి.

"మీనాన్న చాలా తెలివయినవాడిలా ఉన్నాడు. పెళ్ళిసమయంలో డబ్బులేదు అంటే విలువయిన బంగారం ఇస్తానన్నాడు. బంగారం ధర పెరుగుతూనే బంగారం ఇవ్వడంమాని డబ్బు ఇచ్చాడు. ఇదేమైనా మిరపకాయల వ్యాపారమనుకున్నాడా? తేడావచ్చిన ఇరవయివేలు పంపించమని ఎన్నిసార్లు ఉత్తరం రాసినా డబ్బు పంపించలేదు! లక్షాధికారి అల్లుడు కావాలి అంటే తేరగా వస్తాడా?" పరంధామయ్య అరుపులకు తండ్రి లేస్తాడేమో అని భయపడింది కమల. నిద్రవస్తున్నట్లుగా నటించి పడుకోవడం ఉత్తమం. మూర్ఖ

లైన భర్త, మామలతో వాదించడం నిష్ప్రయో జనం అనుకుంది.

"మీ నాన్నది దొంగనిద్ర. నేను డబ్బు అడు గుతానన్న ఉద్దేశంతో ముసుగుపెట్టి పడుకు న్నాడు. ఇంత తొందరగా నిద్రెలా పడుతుంది? రెండులక్షల కట్నం ఇస్తామని ఎందరో వచ్చినా మీనాన్న కాళ్ళావేళ్ళా పడితే ఈ సంబంధం ఒప్పుకున్నాం. మీనాయన డబ్బు ఎలా ఎగవే స్తాడో చూస్తాను. బంగారంలాంటి మరో అమ్మా యిని తీసుకువచ్చి మా అబ్బాయికి పెళ్ళిచేస్తా ను" రఘురామయ్యను నిద్రనుంచి మేల్కొల్ప డానికి విఫలప్రయత్నాలు చేస్తున్నాడు పరంధామయ్య.

కమలకు దుఃఖం రాలేదు. వస్తున్న నవ్వుని బలవంతంగా ఆపుకుంది. ఈ మూర్ఖులకింద మరొక స్త్రీయా? ఏ జన్మలో చేసుకున్న పాపమో తను అనుభవిస్తున్నది చాలదా?

"ఆ డబ్బు రాకుండా నీవు మీ తల్లిగారింటి కి వెళ్లడానికి వీలులేదు" పరంధామయ్య నిక్క చ్చిగా అన్నాడు.

"నేను తిరిగివచ్చేప్పుడు ఎలాగైనా మా నాన్నను ఒప్పించి మీకు రావలసిన డబ్బుతీ సుకు వస్తాను. మా నాన్నను కష్టపెట్టకండి" ప్రాధేయపడింది కమల.

"నీ మాటపైన నమ్మకం ఉంచి నిన్ను పంపిస్తున్నాను. డబ్బుతో ఇంట్లోకి అడుగుపె ట్టు. డబ్బు లేకుండా ఇంట్లోకి అడుగుపెట్టడాని కి వీలులేదు. మనిషికి ఒక మాట గొడ్డుకు ఒక దెబ్బ అన్నారు" పరంధామయ్య మాటలు కమలలో అంతులేని అసహ్యాన్ని కలి గించాయి. వయోభారంతో కుంగిపోయిన స్త్రీలా ఒక్కొక్కమెట్టు దిగుతూ వంటింట్లోకి చేరు కుంది.

అన్నంముందు కూర్చుంది కాని ఒక్క మెతుకూ గొంతులోకి దిగడంలేదు. జీవితం అర్థవిహీనంగా, వికృతంగా, బ్రహ్మరాక్షసి రూ పుదాల్చి కళ్ళముందు కదలాడుతోంది. చావడం మేలు అని ఎన్నోసార్లు అనుకుంది కాని చావడం తప్ప మరో గత్యంతరంలేని పరిస్థితిలో తను దిగబడిపోతుందని ఎన్నడూ అనుకోలేదు.

కింద ఉన్న బెడ్‌రూమ్‌లో రమేష్ కమల కోసం ఎదురుచూస్తున్నాడు. కమల బెడ్ రూమ్ లోకి వస్తూనే రమేష్‌కు అటుతిరిగి పడుకుంది.

"మీ నాన్న మోసం నాకు బాగా అర్థమ యింది. ఇంత మోసమా? పొలం నుంచి వస్తూ విషయమంతా వివరించాడు నాన్న. ఈ మోసా లు మా దగ్గర పనిచేయవు. వచ్చేప్పుడు డబ్బు తీసుకురావలసిందే!"

రమేష్ మాటలను కమల విననట్లుగానే ఉండిపోయింది.

రెండు నిముషాల తర్వాత "తెల్లవారితే, వెళ్ళిపోతావుగా! అటు తిరిగి పడుకుంటే ఎలా?" అన్నాడు రమేష్.

★ ★ ★

సతీష్, సరోజ మనసులు కలిసిపోవడం శ్రీనివాస్‌కు ఆనందాన్ని కలిగించింది.

సీతారామయ్య ముందు ఈ విషయాన్ని కదపడానికి శ్రీనివాస్‌కు భయం వేసింది. ఎన్నోసార్లు తండ్రి ముందుకువెళ్లడం, ముఖ్య మైన విషయాన్ని చెప్పడానికి ధైర్యం చాలక మరేదో విషయాన్ని మాట్లాడటం సంభ వించింది.

విషయాన్నంతా రుక్మిణమ్మకు వివరించి, భర్తను ఒప్పించే బాధ్యత ఆమెపైన వేశాడు శ్రీనివాస్.

రుక్మిణమ్మ పూర్తి విషయాన్ని భర్తకు చెప్పక ముందే అతని కళ్ళు చంద్రనిప్పులయినాయి. "భారతస్త్రీ ఒకసారి విధవగా మారిన తర్వాత, మరో పెళ్ళి కోసం ప్రయత్నించడం తప్పు. కులాలు వేరయిన ఈ పెళ్ళి జరగడానికి వీలులేదు. అలా జరగాలనుకుంటే నా బొంది లోంచి ప్రాణం పోయిన తర్వాతే..." అన్నాడు సీతారామయ్య శరీరం కోపంతో వణికిపో తుండగా.

పక్కగదిలోంచి సంభాషణ విన్న శ్రీనివాస్ పెదవి విరిచాడు. మనిషి సనాతనుడు కావ చ్చుకాని ఛాందసుడు కాకూడదు. తండ్రి ఛాందసత్వంతో సరోజ జీవిత పుష్పాన్ని వికసింపనీయకుండా, తన చేతులతోనే నలిపివే స్తున్నాడు. వికసించడానికి అన్ని అనువులు

కల్పించవలసిన బాధ్యత ఉండికూడా!

శ్రీనివాస్‌కు హాస్టల్‌లో ఉండటం ఇష్టంలేదు. తమ్ముడు వాసు కూడా పక్కటౌన్‌కు వెళ్ళి చదవడం శ్రీనివాస్‌కు సమంజసమనిపించలేదు. వాసు రోజూ అయిదు కిలోమీటర్లు వెళ్ళి తిరిగిరావడం, అలసిపోయి పడుకోవడంతో అతని చదువు అంతంతమాత్రమే సాగేది. శ్రీనివాస్ వాసు స్టాండర్డ్ టెస్ట్ చేసి చూశాడు. వాసులో స్టాండర్డ్ పూర్తిగా లోపించింది. వాసు చదువు ఇలాగే సాగితే ముందు చదవబోయే పెద్ద చదువులకు ఎంతగానో ఆటంకమౌతుందని వాసును కూడా సిటీకి తీసుకువెళ్ళి చదివించాలని నిర్ణయించుకున్నాడు. వాసు ఉండటానికి అనువుగా సరిఅయిన హాస్టల్‌లేదు. ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, ఇద్దరికీ వండిపెట్టడానికి సరోజను తీసుకు వెళ్లాలని నిర్ణయించుకున్నాడు శ్రీనివాస్.

సరోజను తీసుకువెళ్లడం సీతారామయ్యకు ఇష్టంలేదు. గత్యంతరంలేక ఒప్పుకున్నాడు.

సరోజ సిటీ వాతావరణానికి అలవాటుపడిపోయింది. అన్నదమ్ములిద్దరికీ టిఫిన్, మీల్స్ రెండూ రెడీ చేయాలి. మీల్స్ కారేజీల్లో సర్ది ఉంచాలి. ఉదయం పదిగంటల వరకు ఊపిరిసలపని పనితో సతమతమైపోయేది సరోజ.

పల్లె వాతావరణంలో నిముషాలు గంటల్లా సాగుతాయి. పట్టణ వాతావరణంలో గంటలు నిముషాల్లా కరిగిపోతాయి.

బట్టలు ఉతకడం, ఇల్లు శుభ్రం చేయడం క్షణం తీరికలేకుండా పనిలో మునిగిపోవడంతో సరోజకు గతాన్ని గురించిగాని, భవిష్యత్తులో జరగబోయేదాన్ని గురించి ఆలోచించే అవకాశం కలగలేదు.

సాయంత్రం అవుతూనే మళ్ళీ వంటపని. రాత్రిపడుకునే వరకు తీరికలేకుండా పనిచేసుకుంటూ వెళ్ళడం సరోజ అలవాటు చేసుకుంది. ఏ మాత్రం తీరిక లభించినా టి.వి. చూస్తూనో, మేగజైన్స్ చదువుతూనో కాలం గడిపివేసేది. సరోజ ప్రయివేట్‌గా చదవడానికి కావలసినదంతా సమకూర్చాడు శ్రీనివాస్.

చదవడం ఒకసారి అలవాటు తప్పితే, మళ్ళీ మొదలెట్టడం అసహనంగా ఉంటుంది. ఎలాగో ఓపిక తెచ్చుకుని పుస్తకాలు చదవడం సాగించింది.

సతీష్ చెప్పినట్లుగానె జీవితం వేగాన్ని పుంజుకుంది. 'వేగంగా సాగే జీవితాల్లో ఎంతో ఉత్సాహం ఉంటుంది. మందంగా సాగే జీవితాల్లో ఏదో లోపం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది' వాసుదేవరావుగారు అన్నమాటలు గుర్తు వచ్చాయి సరోజకు.

* * *

రెండు అంతస్తులతో, సుమారు రెండు ఎకరాల్లో విశాలంగా ఉన్న భవనంముందు టాక్సీ దిగి గేట్ దగ్గరకు వచ్చారు రాజేశ్వరరావుగారు. గూర్ఖా తనను గుర్తించనందుకు అసహనంగా చూస్తూ తనెవరో చెప్పాడాయన.

"మాఫ్‌కీజియే సాబ్, ఆప్‌కో నహీ పహచానా" అంటూ గేట్ తెరిచాడు గూర్ఖా. రాజేశ్వరరావుగారు నవ్వుకున్నారు. జ్యోతి పెళ్ళి తర్వాత ఇక్కడికి రావడం ఇదే మొదటిసారి! గూర్ఖా ఎలా గుర్తుపడతాడు?

విశాలమైన పోర్టికో దాటి, మీటింగ్ హాలంత ఉన్న ఫ్రంట్‌హాల్లోకి వెళ్ళి సోఫాలో కూర్చున్నారు.

జ్యోతి షాపింగ్‌కు వెళ్ళిందని నౌకరు వచ్చి చెప్పాడు. పొద్దున్నే సిటీకి వచ్చినా అవసరమయిన పనులు ముగించుకునే వరకు సాయంత్రం అయిదు గంటలయింది.

కూల్‌వాటర్ తాగి మళ్ళీ అడిగాడు నౌకరుని- జ్యోతి రావడానికి ఎంత టైమ్ పడుతుందని. గంటలో రావచ్చు అని చెప్పాడతను. రాజకీయంలో, డబ్బు సంపాదనలో ఒక ఎత్తు ఎదిగిన తర్వాత పనిలేకుండా ఒక గంట కూర్చోవడం అంటే నరకంతో సమానమౌతుంది. రాజేశ్వరరావుగారు అసహనంతో కూర్చుండిపోయారు.

పోర్టికోలోంచే చూసింది జ్యోతి- ఫ్రంట్ హాల్‌లో ఎవరో కూర్చుని ఉండటం.

రాజేశ్వరరావుగారు అనుకోకుండా ద్వారం వైపు చూశారు. జ్యోతి తండ్రిని చూసి వేగంగా రావడంతో చీర కుచ్చిళ్ళు తట్టుకుని కిందపడబోయి సంభాళించుకుని మళ్ళీ అదే వేగంతో




వస్తోంది. ఆమె ముఖంలో ఎన్నడూ చూడని వెలుగు చూశాడతను. రాజేశ్వరరావుకు మొదటిసారిగా కూతురిపై ప్రేమ ప్రవాహంలా ముందుకుదూకింది. రాజకీయాన్ని, డబ్బును తప్ప ఎప్పుడూ ఎవ్వరినీ ప్రేమించలేదతను. జ్యోతికి ఆరులక్షల కట్నంతో పెళ్ళిచేయడం హోదాకోసం తప్ప, ప్రత్యేకమైన ప్రేమకాదు. ఇన్నాళ్ళకు రాజేశ్వరరావుగారి హృదయం స్పందించింది జ్యోతి దగ్గరకు వస్తూనే.

ఎన్నోసార్లు చూశాడాయన తన పసితనంలో లేగదూడను విడుస్తూనే, ఆవువైపు ఎంత వేగంగా పయనిస్తుందో! లేగదూడ ఉరకడం పాలకోసం మాత్రమే అని సరిపెట్టుకోలేకపోయాడు. అందులో తల్లిని చేరాలన్న ఆత్రుత వుంది. అదేవిధమైన ఆత్రుత జ్యోతిలో చూసి చలించిపోయాడు.

''అలా చిక్కిపోయావేమ్మా'' కూతురు దగ్గరికి వస్తూనే అడిగాడు రాజేశ్వరరావు.

''సన్నగా వుండటమే నాజూకుకదా నాన్నా! అమ్మను, చెల్లిని తీసుకురాకపోయారా... టీ తీసుకువస్తాను'' అంటూ ప్యాకెట్స్ సోఫాపైన పడవేసి డైనింగ్‌హాల్‌లోకి వెళ్ళింది.

టీ తండ్రికిచ్చి, ఎదురుగావున్న సోఫాలో కూర్చుంది జ్యోతి. తోడికోడళ్ళు ఇద్దరూ వచ్చారు షాపింగ్‌నుంచి. సోఫావైపు ఒక చూపు విసిరి వాళ్ల రూముల్లోకి వెళ్ళిపోయారు. అయిదు నిముషాల తర్వాత ఇద్దరు బావగార్లు తండ్రితోకలిసివచ్చారు. పోర్టికోలోనే వాళ్లతో ఏవేవో విషయాలు మాట్లాడుతూ పదినిముషాలు గడిపాడు శేషగిరిరావు. ఇద్దరు కొడుకులూ వాళ్ల రూముల్లోకి వెళ్లిపోతూనే సోఫాదగ్గరకు వచ్చాడు శేషగిరిరావు. రాజేశ్వరరావువైపు చూసి- ''చాలారోజుల తర్వాత వచ్చారు కూతురిని చూడటానికి'' అన్నాడు నవ్వుతూ.

పదినిముషాల నుంచి కడుపులో రగులుతున్న మంటను అణగదొక్కి ముఖానికి నవ్వు పులుముకుని చిన్నగా నవ్వాడు రాజేశ్వరరావు. కొడుకులతో తర్వాత మాట్లాడవచ్చు? వచ్చిన బంధువును అలాగే కూర్చోబెట్టి వాళ్లతో మాట్లాడాలా? ఒక్క నిముషం తనను పలకరించి ఆ తర్వాత మాట్లాడుకోకూడదా? ప్రాపంచిక విలువలన్నీ డబ్బుతో ముడిపడివుంటాయని తెలిసినా ఇంత అతివాస్తవికంగా జరగడం అతనిని కలవరపెట్టింది.

అయిదునిముషాలసేపు ఇద్దరిమధ్యా సంభాషణ జరగలేదు. ఇద్దరు శత్రువులు అనుకోని పరిస్థితిలో ఎదురుపడినప్పుడు ఎదురయ్యే పరిస్థితిలా వుంది. ''డైరెక్టర్స్ మీటింగ్ వుంది, తొందరగా వెళ్లాలి'' అంటూ తన రూమువైపు వేగంగా వెళ్ళిపోయాడు శేషగిరిరావు.

జ్యోతి తండ్రి ముఖంలోకి చూస్తూవుండిపోయింది. ''మరి అడగలేదేం నాన్నా?'' అంది మెల్లగా.

''అల్లుణ్ణి అడుగుతానులేమ్మా'' అన్నాడు ఎటో చూస్తూ.

ఫోన్ దగ్గరకు వెళ్ళి మోహన్ వుండే క్లబ్‌లకు, బార్‌లకు, ఫ్యాక్టరీలకు ఫోన్‌చేసింది. ఒక క్లబ్‌లో మోహన్ జాడ తెలిసింది. తండ్రి వచ్చిన విషయం అతనికి తెలిపింది. 'తనకు రావడానికి వీలుపడదని, రాత్రి వచ్చినప్పుడు ఆ విషయం గురించి మాట్లాడుకోవచ్చని' ఫోన్ డిస్‌కనెక్ట్ చేశాడు. జ్యోతి ముఖంలో అసహ్యం పెల్లుబికింది. తమాయించుకుని ''రేపు వెళ్లమని చెప్పారు నాన్నా'' అంది.

రాజేశ్వరరావు సోఫాలోంచి లేచి- ''నేను వెళతానమ్మా, పొద్దున్నే వచ్చి నిన్ను తీసుకువెళతాను'' అన్నాడు.

''భోజనంచేసి వెళ్లండి నాన్నా''

''వద్దమ్మా... ఆకలిగాలేదు'' అంటూ వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. జ్యోతి ఎంతగా ప్రాధేయపడినా భోజనంచేసివెళ్లడానికి అంగీకరించలేదు రాజేశ్వరరావు.

తండ్రి ముఖంలోని దిగులుని జ్యోతి ఊహించగలిగింది. కూర్చున్నంతసేపు ముళ్లపైన కూర్చున్నట్లుగానే వున్నాడు. బంధువు ఇంటికి వచ్చిన దేవుడు అన్న నానుడి వీళ్లకు తెలియదా? బంధువుని అగౌరవపరచడం తమయొక్క గొప్పతనం అనుకునే వీళ్లకు నీతి వాక్యాలు చెప్పడం చెవిటివాడిముందు శంఖం ఊదడం వంటిది.

తమకంటే ఎక్కువడబ్బు వున్నవాళ్ల కాళ్ళు




కడిగి నెత్తిపైన చల్లుకోవడం కూడా వీళ్లకి అలవాటే! బొంబాయినుంచి ఒక మెగా కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టర్ వస్తే ఇంటిల్లిపాది ఏకమై నెత్తిన ఎక్కించుకున్నారు. జ్యోతికి ఎబ్బెట్టుగా అనిపించింది. మనిషిని గౌరవించడంలో కూడా లిమిట్‌దాటి పోకూడదన్న విచక్షణా జ్ఞానం వీళ్లకు లేనట్టుంది అనుకుంది. డబ్బులేనివారు డబ్బుకోసం కక్కుర్తిపడితే పరవాలేదు. డబ్బు వున్నవారు డబ్బులేనివారికంటే డబ్బుకోసం ఎక్కువ కక్కుర్తిపడతారని తన అత్తగారింటివాళ్లను చూసిన తర్వాతే తెలిసింది జ్యోతికి. కోటీశ్వరుడు బూతు మాట్లాడినా బ్రహ్మసూత్రం చెప్పినట్లుగా చెవియొగ్గి వింటారు. దరిద్రుడు బ్రహ్మసూత్రాన్ని చెప్పినా, బూతు మాట్లాడినట్లుగా ఈసడించుకుంటారన్న వాసుదేవరావుగారి మాటలు గుర్తుకువచ్చాయి జ్యోతికి.

రెండువేలు నెలకు సంపాదించే ఏ ఉద్యోగస్తుణ్ణి చేసుకున్నా ఎంతో సుఖంగా వుండగలిగేదాన్నేమో? డబ్బు ఎక్కువగా వున్నంతమాత్రాన స్త్రీ సుఖపడుతుందని పెద్దవాళ్లు సంబంధాల్ని నిర్ణయించడానికి అలవాటుపడిపోయారు. డబ్బు ఎక్కువగా వున్నప్పుడు డబ్బులేనివాడికి, ఆ డబ్బు ఇస్తే తన కూతురిని మరింత సుఖపెడతాడని ఎందుకు ఊహించడంలేదు?

తండ్రి తన ఇంట్లో తినకపోవడంతో మనసు చివుక్కుమంది జ్యోతికి. అన్నంముందు కూర్చున్న తర్వాత తండ్రి కళ్ళలో మెదిలాడు. రెండు ముద్దలు కూడా తినలేకపోయింది. గదిలోకి వెళ్ళి భర్తకోసం ఎదురుచూస్తూ ఉండిపోయింది. పన్నెండు తర్వాత వచ్చాడు మోహన్.

తాగిన మైకంలో వున్నాడు మోహన్. అతనికి కావలిసింది శరీరం. ఆ శరీరాన్ని ఏ మనసుతో ఇస్తుందన్న విషయం అతనికి అనవసరం.

"ఏమంటున్నాడు మీ నాన్న నిన్ను తీసుకు వెళతాడా?" రూములోకి వస్తూనే డ్రెస్ మారుస్తూ అడిగాడు మోహన్.

"మీకోసం ఎదురుచూసి వెళ్ళిపోయారు"

"ఎందుకో ఎదురుచూడటం. సాంప్రదాయం ప్రకారం మన పెళ్లప్పటినుంచి ఇప్పటిదాకా రెండులక్షలదాకా బాకీపడ్డాడు మీ నాన్న. మా అన్నగార్లను చూశావా? వాళ్ల గదుల్లో వున్న ఫర్నిచర్ చూస్తే నీవు ఆశ్చర్యపోతావు. అవన్నీ వాళ్ల అత్తగారింటినుంచి తెచ్చుకున్నవే! మా అన్నలు తిరిగే ఇంపోర్టెడ్‌కార్లు వాళ్ల అత్తగారింటినుంచి తెచ్చుకున్నవే! నేను డొక్కు కారులో తిరగడం చూసి మా ఫ్రెండ్స్ హేళన చేస్తున్నారు. ఇంపోర్టెడ్ కారు కొనమని వేధిస్తున్నారు. మీనాన్నదగ్గరనుంచి రెండు లక్షలు తెచ్చావంటే పదిహేను నిముషాల్లో కారు కొనవచ్చు. ఆ కారు వస్తే మనకు అందరూ విలువ ఇస్తారు.

"పెళ్ళి సమయంలో మాతో ఈ విషయాలన్నీ చెప్పలేదు. పెళ్ళి తర్వాత మాట్లాడుతున్నారు. మీరు ఆ సమయంలోనే మీకు ఇవ్వవలసిన లిస్టంతా చెప్పివుంటే పరిస్థితి మరోవిధంగా వుండేది..."

"నీ తండ్రివైపు మాట్లాడటంవలన నీకు ఒరిగే ప్రయోజనం ఏముంది? నాకు సంబంధించినవి నీకు సంబంధించినవికావా? మీ తండ్రికి ఆస్తి తక్కువేంలేదు. ఇవ్వవలసినవి నీవు తీసుకోవడంవల్ల అతనికేమాత్రం ఇబ్బంది వుండదు. మనం అడగడంలో అన్యాయం ఏముంది?"

"న్యాయం, అన్యాయం ఏవిటో ఎవరు చెప్పగలరు? మనం న్యాయం అనుకునేదంతా మా నాన్నగారికి అన్యాయంగా కనిపించవచ్చు"

"నీతో ఎక్కువగా మాట్లాడవలసిన అవసరం నాకు లేదు. మనకు వచ్చేదంతా అణాపైసలతోసహా మీ నాన్ననుంచి తీసుకురావాలి. నాన్న ప్రత్యేకంగా నన్ను పిలిపించుకుని ఈ విషయం గురించి గుర్తుచేశాడు. అన్నలిద్దరూ ఇంపోర్టెడ్ కార్లలో జల్సాగా తిరుగుతున్నారు. నేను డొక్కుకారులో తిరగడం నీకు నామోషీగా లేదూ?"

"నాన్నగారు నా పెళ్ళికోసమై అప్పుచేశారు. ఆ అప్పు ఇంతవరకూ తీర్చలేదు. ఇప్పుడు కొత్తగా నాకోసం మరింత అప్పుచేయమని ఎలా చెప్పేది?"

"అప్పులు అందరికీ వుంటాయి. మా నాన్న యాభయిలక్షలు అప్పులో వున్నాడు. ఈ విషయాలన్నీ చెప్పి నన్ను మార్చడానికి ప్రయత్నంచేయకు! నాకు కావలసినది డబ్బు! ఆ డబ్బు తీసుకువచ్చి నీపేరుమీదే కారు రిజిస్ట్రేషన్ చేయించుకో..."

జ్యోతికి భర్తతో మాట్లాడటానికి అసహ్యం అనిపించి ఊరకుండి పోయింది.

మోహన్, జ్యోతిని తనవైపు తిప్పుకున్నాడు. ఆమె శరీరంలోని అణువణువు అతనంటే అసహ్యంతో ఉడికిపోతోంది. పాముని కౌగలించుకుని పడుకున్నట్లుగా ఉంది ఆమెకు.

ఉదయాన్నే తండ్రి వెంట రైల్వేస్టేషన్‌కు ప్రయాణమయింది జ్యోతి. ఫస్ట్‌క్లాస్ టికెట్లు తీసుకున్నారు రాజేశ్వరరావుగారు.

రాజకీయమైన చిక్కులు కొన్ని వచ్చినందు వల్లనేమో సీరియస్‌గా ఉండిపోయారు ఆయన.

తన మనసుకు పూర్తిగా వ్యతిరేకమైన మనుషులతో ఎంతకాలం జీవించాలి? క్షణకాలమే దుర్భరమనిపిస్తుంటే? తండ్రికి విషయాన్ని గుర్తు చేద్దామని, జ్యోతి అటువైపు చూసింది. కాని ఆయన మరో లోకంలో ఉన్నాడు. ముఖంలో కళాకాంతులు లేవు. సీరియస్ మూడ్‌లో ఉన్నప్పుడు ఈ విషయాలు మాట్లాడటం సమంజసంగా ఉంటుందా? ఎందుకీ నరక యాతన? భర్త సహృదయుడైతే తనకీపాట్లుండేవికావు.

అమ్మా.... భిక్షంపెట్టు అని అడుక్కోతినడంలో ఎంత ఆవేదన ఉందో, అత్తింటివాళ్ల కోసం కన్నవాళ్లను డబ్బు అడగడంలోనూ అంతే ఆవేదన ఉంది.

పెళ్లి వలన తనకు ఒరిగింది ఏముంది? పెళ్లి అయ్యేవరకు బాధ అంటె ఏమిటో తెలియదు. పెళ్లి తర్వాత బాధపడని క్షణం లేదు.

సుఖం మేడల్లోను, డబ్బులోను ఉంటుందని అంటారందరూ. సుఖానికి మెరుగులు దిద్దడానికే డబ్బు అవసరమౌతుంది. అంతేకానీ డబ్బే పూర్తి సుఖాన్ని ఇవ్వలేదని తన విషయంలో తేటతెల్లమయిపోయింది. మరి సుఖం ఎక్కడుంది?

తను సుఖంగా ఉండాలనేగదా ఇంత డబ్బు ఖర్చుచేసి నాన్న పెళ్లి చేశాడు? మరి తన సుఖంకోసం ఇంతగా తాపత్రయపడే నాన్ననే మళ్లీమళ్లీ డబ్బు కోసం పీడించడం అంటే....

తన వలన అయ్యే పని కాదిది. తండ్రి ముఖంలోకి చూస్తూ అడగలేదు. మరి గత్యంతరం?

నిరంతరం ఏడ్వడంతో ఆమె కళ్లలో నీళ్లు ఇంకిపోయాయి. ఏమూల ఉన్నాయో రెండు చుక్కలు కనుకొలకుల్లోకి వచ్చి నిలిచాయి.

అంతరంగంలోని బాధ ఉబికి ఉబికి వస్తోంది. ఎంతగా ప్రయత్నం చేసినా ఆగడం లేదు. తన దుఃఖం తండ్రికి కనిపించనీయకుండా టాయిలెట్‌లోకి వెళ్లి వెక్కివెక్కి ఏడ్చింది.

ట్రెయిన్ దిగుతూ ఆమె దుఃఖాన్ని తనలో లీనంచేసుకుంది.




పాపని రిక్షా దిగే వేగంలో చీర కొన తగులుకుని చిరిగిపోయింది. తల్లిని చూడాలన్న ఆమె ఆత్రుతచూసి వాసుదేవరావుగారు నవ్వుకున్నారు.

పరుగుతో తల్లి ఉన్న వంట గదిలోకి వెళ్లింది. చేస్తున్న వంటను ఆపి సంభ్రమంతో హటాత్తుగా లేచి నిలబడటం పాపని వంగొని తల్లికాళ్లకు మొక్కడం క్షణకాలంలో జరిగిపోయింది.

ఆ తల్లి హృదయం ఆనందంతో కంపించింది అలాగే కూతురిని తన ఎదకు అదుముకుంది. వాసుదేవరావుగారు వంటగది ద్వారం దగ్గర నిలబడి తల్లీ, కూతుళ్ల అనురాగాన్ని చూసి భుజంపైన ఉన్న ఉత్తరీయంతో

e town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the tow

# విపుల

ఈరోజు కాలేజి డిబేట్‌లో ఇతర ప్రాంతాల్లోని జీవన విధానంగురించి అంత బాగా ఎలా మాట్లాడగలిగావ్?

నేను 'విపుల' పాఠకురాలిని; ప్రతినెలా దాదాపు పదిహేను భాషల కథల్నీ, ఆయా జీవన విధానాల్నీ తేటతెలుగులో చదివే అవకాశాన్నిస్తుంది 'విపుల'



కళ్లు తుడుచుకున్నారు. అవి ఆనందభాష్పాలా? కన్నీళ్లా? ఏమో? ఆయనకే తెలియదు.

సినిమాలు, షికార్లు, పేరంటాలు అన్నీ ఆనందంగా జరుగుతున్నాయి పావనికి. అత్తగారింటి కష్టాలు మధ్యలో గుర్తుకు వచ్చినా తల్లికి చెప్పలేదు. చెప్పినా ఆమె చేయగలిగింది ఏముంది బాధపడటం తప్ప.

వాసుదేవరావుగారు ఇంట్లో కూడా గంభీరమైన మనిషే. రోజుకు నాలుగు అయిదు మాటలు కూడా ఆయన నోటిగుండా వెలువడవు. ఆయనకి కావలసింది ఏమిటో భార్యకు అనుభవం మీద తెలుసు. ఎప్పుడైనా వాళ్లిద్దరి మధ్యా సంభాషణ జరిగినా అది పావని గురించిగానీ, వాతావరణం గురించిగానీ మాత్రమే. భార్య ఏపని చేసినా ఆక్షేపణ తెలపడాయన. భర్త ఏది చెప్పినా తలఊపి పనిచెయ్యడం తప్ప ఎదురుమాట్లాడి ఎరుగదు ఆమె.

ప్రశాంతంగా ఉండే సరస్సులాంటిది వారి సంసారం. మూర్తీభవించిన పుణ్య దంపతులు వారు. ఎవరినీ నిందించడంగాని, ఎవ్వరితోనూ మాటపడటంగాని ఎరుగరు వాళ్లు.

★ ★ ★

కమలకు గతాన్ని తవ్వి బేరీజు వేసి చూసుకోవడానికి కావలసినంత సమయం దొరికింది.

ఇద్దరు వదినెలను చూస్తే ఆమెకు ముచ్చటగా ఉంది. వాళ్లకు కావలసిందేమిటో పట్టుదలగా సాధించుకుంటారు భర్తలద్వారా. అత్తకు ఒదిగి ఉన్నట్లే ఉండి, అవసరం అనుకున్నప్పుడు ఎదురుతిరిగినా మళ్లీ మనసులు కలుపుకుని ఒకటైపోతారు. మనసులో కల్మషాన్ని నింపుకోకుండా అన్నీ ఆ క్షణాన్నే వదిలించుకుని మళ్లీ ఒకటి కావడం, ఆత్మీయంగా మెలగటం కమలకు అపురూపంగా తోచింది.

పిన్నలు తమ చెప్పుచేతల్లో ఉండాలని పెద్దల ఆకాంక్ష. అనుభవం మాత్రమే ఉండి ఆలోచనాసరళిలో పరిపక్వతలేని పాతతరంవాళ్ల శాసనాలకు లొంగిఉంటుందా ఈ కాలపు యువత గౌరవంకొద్దీ లొంగివున్నట్లే ప్రవర్తిస్తారు. దాంతో నిజంగా లొంగివుండకపోయినా గమనించరు పెద్దలు.

ఈ విషయాన్ని పెద్దవాళ్ళు చూసీచూడనట్లుగా పోవడాన్ని అలవరచుకోవాలనీ, లొంగి ఉన్నారుకదా అని బానిసల్లా చూసి మరింత మెడలు వంచడానికి ప్రయత్నిస్తే పరిస్థితి బెడిసికొట్టే ప్రమాదం ఉందనీ వాసుదేవరావుగారన్న మాటలు గుర్తుకు తెచ్చుకుంది కమల.

ఈ గ్రహింపు లేని తన తల్లి కోడళ్ళను సాధించడానికి అందర్లాగే ప్రయత్నం చేస్తుంది. వాళ్ళు ఎదురుతిరగడంతో ఖిన్నురాలవుతుంది. ఈ ఘర్షణవలన తల్లికే ఎక్కువ బాధ కలుగుతుంది. అత్తతో ఏ మాత్రం ఘర్షణ జరిగినా కోడళ్ళు అలిగి గదిలోకి వెళ్ళి పడుకోవడంతో పనిభారం మొత్తం తన తల్లిపైనే పడుతుంది. రెంటికి చెడ్డరేవడిలా తయారైన ఆమె పరిస్థితి చూసి కమల నవ్వుకునేది.

కమలకు వేగంగా పొంగిపొరలుతున్న ప్రవాహంలోంచి, నిశ్చలమైన ప్రవాహంలోకి వచ్చిపడినట్లుగా ఉందిక్కడ! నెమరువేసుకోవడానికి ఏం మిగిలింది. గతంలోగాని, అత్తవారింట్లోగాని. ఒక్కక్షణం అయినా తిరిగి గుర్తుకుతెచ్చుకునేలా ఉందా తన జీవితం? మోడువారిన చెట్టులా ఉందే! ఒకమూల పడివున్న శిలలా ఉందిగదా ఈ జీవితం. వీచేగాలికి ఊగుతూ తమకు ప్రాణం ఉందని చాటుకునే చెట్లలోని ఆహ్లాదం, హాయిగా రెక్కలు చాచుకుని ఎగిరే పక్షుల్లోని ఉత్సాహం తనలో ఏది? వాటి జన్మలే కొంతవరకు సార్ధకమైనవి. వాటికి కోడ్ ఆఫ్ కండక్ట్‌లేదు; మనసుకు నచ్చిన పనిచేస్తాయి. జంతువుల్లో కలిగే దుఃఖం వాటి జీవితాల్లో ఒక భాగంగా మిగిలిపోతుంది కాని మానసిక క్షోభకు దారితీయదు. పరిణామక్రమంలో ఎదిగిన మానవుడిలో జంతువులలోని ఈ లక్షణాలు తొలిగిపోవడం వల్ల మానవజాతికి మేలు జరిగిందా? రఘురామయ్య కర్మయోగిలా తనకేదీ పట్టనట్లుగా ఉంటాడు - ఎవ్వరిపైనా కోపాన్ని పెంచుకోడు. ప్రతి పనిని ఎంతో జాగ్రత్తగాచేస్తాడు. జీవితాన్ని ఎంతగానో అర్ధంచేసుకున్నాడు. అన్ని రంగుల్ని తనలో ఇముడ్చుకున్న తెల్లుపు వర్ణంలా. అందుకే తండ్రి అంటే కమలకు ఎనలేని గౌరవం.

ప్రకృతి ఈ మాంసయుత శరీరాన్ని ఇస్తే,





సమాజం ఆ శరీరపు మనుగడకురూపకల్పన చేసింది. మనిషి జీవితగమనం గురించి కొత్తగా ఆలోచించవలసిన అవసరంలేదు. సమాజం దానిని ఏర్పరచింది. కాని, ఆ ఏర్పరచబడిన మార్గాలు ఎంతవరకు సమంజసమైనవని ఆలోచించడం తప్పనిసరి పరిస్థితిగా తయారయింది. ఈ ఏర్పరచబడిన మార్గాల్లో పయనిస్తూ, మార్పు ఎంతవరకు అవసరం అనేది ఆలోచించుకోవడం మనిషి ధర్మంగా పరిణమించింది. ఇలాగే మార్పు లేకుండా సాగితే మనిషి మనిషిగా మిగిలిపోడు. సమాజం అనే యంత్రం తయారుచేసిన వస్తువుగా మిగిలిపోతాడు.

మార్పు యొక్క సాధ్యాసాధ్యాలు ఎవరిపైన ఆధారపడి ఉన్నాయి? సమాజంలో మార్పుకోరే మనుషులపైనా? అధికారంలో ఉన్న మనుషులపైనా? అధికారంలో ఉన్న మనిషికి మార్పు యొక్క అవగాహన ఉంటుందన్న నమ్మకం ఏమిటి?- రేడియోలో విన్న ఓ ప్రసంగం ఇంకా ఆమెలో సంచలనాన్ని రేకెత్తిస్తోంది.

తల్లి పిలుపుతో ఆలోచనల నుంచి బయటపడింది.

తప్పనిసరి పరిస్థితిలో కమల తల్లికి చెప్పింది - తను అత్తవారింటికి వెళ్ళేప్పుడు తీసుకువెళ్లవలసిన లిస్టంతా. ఆ చెప్పడం అంతా రికార్డ్ చేసిన కాసెట్ టేపురికార్డర్‌లో ఉంచి బటన్ నొక్కితే ఏవిధంగా ముందుకు సాగుతుందో, ఆవిధంగా ఉంది.

పార్వతమ్మ కళ్ళలో నీళ్ళు నిలిచాయి. "నేనేం చేయాలనమ్మా! మీ నాన్నను అడగాలి. లక్షల ఆస్తి ఉండి డబ్బుకోసం ఇంతగా కక్కుర్తి పడటం ఎందుకమ్మా! మీనాన్న చేతిలో పెత్తనం లేదమ్మా ఇప్పుడు. లక్షరూపాయల కట్నం ఇచ్చినందుకే మీ వదినలు కళ్ళల్లో నిప్పులుపోసుకుంటున్నారు. మళ్ళీ నీవు డబ్బు అడుగుతున్నావని తెలిస్తే ఇంకేమైనా ఉందా? అంతా నీ ప్రారబ్ధం! ఎంత భయంకరమైందీ ఆడజన్మ? అడకత్తెరలో పోకలా అత్తగారిల్లు, పుట్టిల్లు మధ్య నలుగుతుంది! నీవు దిగులుపెట్టుకోకు. వీలు చూసుకుని మీ నాన్నకు చెబుతాను" అంది.

రెండురోజుల తర్వాత కమల విషయం భర్తకు చెప్పింది పార్వతమ్మ. సంసారబంధాలకు కొంతవరకు అతీతంగా ఉండటం వలన ఆయన అంతగా బాధపడినట్లనిపించలేదు. "నా చేతిలో ఏమీలేదు కమలా! మీ అన్నలకు చెబుతాను. మీ మామగారి మూర్ఖత్వానికి అంతులేదు. అతను చెప్పేదంతా అబద్ధం. నీ పెళ్లి సమయంలో కట్నం మొత్తం బంగారం రూపంలో ఇస్తానన్నాను. ఒప్పుకోకుండా డబ్బు కావాలన్నాడు. అలాగే ఇచ్చాను. మళ్ళీ ఇప్పుడు విషయాన్ని తిరగదోడుతున్నాడు. నాకు చావు దగ్గరపడుతోంది. బాధల నుంచి, సంసారం నుంచి ఎంత దూరంగా ఉంటే అంతగా ముక్తిమార్గానికి దగ్గరవుతాను" అంటూ వేదాంతంలో పడిపోయాడు రఘురామయ్య.

కొంతసేపటి తర్వాత పెద్దకొడుకు శేఖర్‌ను పిలిచి విషయమంతా వివరించి చెప్పాడు.

కొన్ని నిముషాలు మౌనంగా ఉండిపోయాడు శేఖర్. ఈ సీజన్‌లో వ్యవసాయం ఏ మాత్రం లాభసాటిగా లేదు నాన్నా పెట్టుబడి డబ్బు చేతికి రావడమే గగనంగా ఉంది. ధాన్యం ధర తగ్గుముఖంలో ఉంది. రెండు నెలలైనా ఆగకుండా ధాన్యాన్ని అమ్మితే సగం ధరకే అమ్ముకున్నట్లుగా ఉంటుంది. ఈ పరిస్థితిలో నీవేం చేయమంటే అదేచేస్తాను' అన్నాడు సన్నటి స్వరంతో.

రఘురామయ్యకు ఏం చెప్పాలో తోచలేదు. ధాన్యాన్ని తక్కువ ధరకు అమ్మమనడం సమంజసంకాదు. చేతిలో ఉన్న డబ్బంతా ఊడ్చి కమలకు కట్నం కింద ఇచ్చివేయడం జరిగింది. కొడుకుల చేతికి ఆస్తి మాత్రమే ఇచ్చాడు కాని డబ్బు ఇవ్వలేదు.

"కమలా ... మీ మామగారికి చెప్పు - ధాన్యం తక్కువ ధరలో ఉందని, రెండు నెలల్లో ధాన్యం అమ్ముతూనే డబ్బు అణాపైసలతో చెల్లువేస్తామని! అతను వ్యవసాయదారుడే కాబట్టి పరిస్థితిని అర్థంచేసుకోగలడని అనుకుంటాను" అన్నాడు రఘురామయ్య కమల వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ.

కమల మౌనంగా ఉండిపోయింది.

★ ★ ★

పుట్టింట్లో జ్యోతికి సుఖంగానే ఉంది. అయినా ఒంటరిగా కూర్చున్నప్పుడు గతం గుర్తుకు వచ్చి దుఃఖం ముంచుకువచ్చేది. నవలలు చదువుతూ, చిన్నచిన్న పనులుచేస్తూ కాలం గడిపేది. జ్యోతికి తల్లి దగ్గర చనువు ఎక్కువ. జరిగిందంతా పూసగుచ్చినట్లుగా తల్లికి చెప్పింది. ''కొంతకాలం ఓపికపట్టు జ్యోతీ! కాలగతిలో పరిస్థితులు చక్కబడతాయి. అంతవరకు మనం ఆగడం తప్పితే చేయగలిగిందేమీలేదు. కారు విషయం వీలు చూసుకుని మీ నాన్నను అడుగుతాను'' అంది కృష్ణవేణమ్మ.

రాజేశ్వరరావుగారు రాత్రి భోజనం చేసేప్పుడు విషయాన్నంతా చెప్పింది కృష్ణవేణమ్మ.

''కోటీశ్వరులై వుండి కూడా ఏమిటా పిచ్చికోరికలు. వాళ్లు కోరినవన్నీ నోరు మెదపకుండా ఇవ్వడమేనా? దీనికి అడ్డు, అదుపులేదా?'' అన్నారాయన.

''జ్యోతి జీవితం చక్కబడాలంటే తలఒగ్గక తప్పదు''

''అమెరికానుంచి కారు కొనడానికి అవసరమయినన్ని డాలర్లు పంపించమని వినయ్‌కు ఉత్తరం రాస్తాను; అమెరికన్ డాలర్లు అయితే కారు త్వరగా, తక్కువ ధరకు వస్తుంది''

కిచెన్‌రూములో గోడకు ఆనుకుని సంభాషణ వింటున్న జ్యోతి దీర్ఘంగా నిట్టూర్చింది. వినయ్‌కి జాబ్ దొరికి ఒక సంవత్సరం అవుతోంది. అతనికి అన్నివేల డాలర్లు పంపించే అవకాశం వుందా? ఆనంద్‌కు అసలింకా జాబ్ దొరకలేదు!

* * *

''జ్యోతీ...''

వెనక్కి తిరిగి చూసింది జ్యోతి. పావనిని చూస్తూనే ఒక్కసారిగా పోయిన పెన్నిధి దొరికినంత సంతోషం అనిపించింది జ్యోతికి. పావ



ని కలిసి మాట్లాడాలని ఎన్నిరోజులుగానో అనుకుంటోంది. పావని అత్తవారింటినుంచి రాలేదేమోనని వూరకుండిపోయింది.

"నీవు ఫోన్ చేయవలసింది పావనీ! ఇదివరలో దాదాపు ప్రతిరోజూ కలుసుకునేవాళ్లం మనం" నొచ్చుకుంది జ్యోతి.

"నీవు వచ్చావన్న సంగతి తెలియదు, నీతో కలిసి మాట్లాడటం కంటే ఇష్టమైంది ఏముంటుంది నాకు" అంది పావని.

పావని చేతిలో వున్న ప్యాకెట్స్‌వైపు చూసి "షాపింగ్ చేసినట్లున్నావు, మా ఇంటికి ఎప్పుడు వస్తావు" అంది జ్యోతి.

"నీకో సర్‌ప్రయిజ్‌న్యూస్ - రెండురోజుల క్రితమే కమల, సరోజ కనిపించారు. రేపు సాయంత్రం ఇద్దరూ మా ఇంటికి వస్తామన్నారు. నీవు కూడా రాకూడదూ! నలుగురం సరదాగా మాట్లాడుకోవచ్చు"

పావని మాటలకు జ్యోతి కళ్లు మెరిశాయి. "కమల, సరోజ కనిపించారా! రేపు మీ ఇంటికి తప్పకుండా వస్తాను" అంటూ తను షాపింగ్ పూర్తిచేయడానికి సెంటర్‌వైపు నడిచింది.

* * *

నలుగురు స్నేహితురాండ్రు కొబ్బరిచెట్టు కింద కూర్చుని వాసుదేవరావు రాకకోసం చూస్తూ వుండిపోయారు. వాసుదేవరావుగారు దగ్గరలోనే వున్న పల్లెటూరు వెళ్లారు, అనారోగ్యంగా వున్న ఓ మిత్రుడిని పరామర్శించి రావడానికి.

పావని స్థిరంగా కూర్చుండిపోయింది. జ్యోతి గడ్డిపరకల్ని తెంపుతూ ఎటోచూస్తూ వుండిపోయింది. కమల దృష్టి దూరంగా వెళ్లే వాహనాలపై వుంది. సరోజ నీలాకాశంవైపు దృష్టి సారించింది.

"మన మెడల్లో మంగళసూత్రాలు పడుతూనే మన గొంతు మూసివేయబడి మూగమనుషుల్లా, జంతువుల్లా, షోకేస్‌ల్లో బొమ్మల్లా మిగిలిపోతాం. మనకు గొంతు వుందికదా అని ఉపయోగించుకోవడానికి ప్రయత్నిస్తే మళ్లీ ఎన్నటికీ మాట్లాడకుండా పీక నొక్కేస్తారు. మనం బొమ్మలం అన్న విషయం మనకు అనుక్షణం గుర్తువుండాలి. అత్తగారికి మనం కేవలం పనిమనుషులం, బానిసలం. భర్తలకు కోరినప్పుడు సుఖాలివ్వడానికి వేశ్యలం. మామగారికి బంగారుగుడ్లు పెట్టే బాతులం; ఏక్షణంలో ఏం కోరినా పుట్టింటినుంచి మూటలు కట్టుకుని తీసుకురావాల్సిందే! అటు పుట్టింట్లో వదినలముందు హీనమైనవాళ్లం; మనం వస్తే వాళ్ల గుండెల్లో గుబులు - ఎంత డబ్బు అడుగుతామో అని! అత్తగారి దృష్టిలోనేమో వంశం నిలబెట్టడానికి పిల్లలను కనే యంత్రాలం. ఇది భారత స్త్రీ చరిత్ర. వేల ఏళ్లుగా మనం కేవలం సహగమనంనుంచి మాత్రమే విముక్తిచెందాం. అంతకుమించి మన పరిస్థితిలో ఏమాత్రం మార్పురాలేదు. దేవుడు మరచిపోయి మనకు మనసు అనేదొకటి ఇచ్చాడు. ఆ మనసే ఇవ్వకుంటే ఈ బాధే లేకపోవును" జ్యోతి వాక్కులు మిగతా ముగ్గురినీ నిశ్చేష్టులనుచేశాయి.

నలుగురి మధ్య నిశ్శబ్దం ఆవరించింది. లయబద్ధంగా పక్షుల అరుపులు. పిల్లగాలి తెమ్మెరలు శరీరాలకు చల్లగా తాకుతూ వెళుతున్నాయి. భావపరంపరలతో వాళ్ల అంతరంగాలు వేడెక్కాయి.

వాళ్ల ఎదురుగా వున్నతమైన గోడవుంది. అది సాంప్రదాయమనే పునాదితో నిలబడివుంది - కొన్ని లక్షలమంది చమటతో తడిసిన గ్రేట్ వాల్ ఆఫ్ చైనాలా.

"సాంప్రదాయమనే మౌఢ్యం నా జీవితంలో అంతులేని అగాథాన్ని ఏర్పరచింది. ఆ అగాథాన్ని పూడ్చటానికే నా ప్రాణశక్తి కరిగిపోతోంది. ఆ అగాథాన్ని పూడ్చి దానిపై క్రొంగొత్త కోరికలనే విత్తనాలను చల్లాలి. అవి మొలకెత్తాలి. ఆ క్షణంలోనే నా జీవితానికి శాంతి చేకూరుతుంది" అంది సరోజ.

అంత దుఃఖంలో కూడా ఆమెవైపు ఆశ్చర్యంగా చూశారు ముగ్గురూ. అంతరంగంలో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నా ఋషిలా తన జీవితానికి భాష్యాన్ని చెబుతోంది సరోజ.

వాసుదేవరావుగారు రావడంతో నలుగురూ లేచి నిలబడ్డారు. వాళ్లకు ఎదురుగా పచ్చికపై కూర్చుని, నలుగురినీ కూర్చోమని సైగచేశారాయన.

వాతావరణంలో నిశ్శబ్దం ఆవహించింది.




పక్షుల చప్పుడు తగ్గిపోయింది. వేగంగా వీచే గాలి వినురుగా ఎటో వెళ్ళిపోతోంది. ఊగిఊగి అలసినచెట్లు అలసట చెంది విశ్రాంతి తీసుకుంటున్నాయి. పడమరలో కుంగిన సూర్యుని కిరణాలలో వేడి లోపించి, నులివెచ్చదనంతో శరీరాన్ని తాకుతున్నాయి.

''ఒక స్త్రీగా నా కర్తవ్యం ఏమిటి?'' హటాత్తుగా ప్రశ్నించింది జ్యోతి.

''ఎవరైనా సరే... తను కర్తవ్యాన్ని గుర్తించాలంటే, సమాజంలో వారికి ఉన్న పరిధి, ఉన్న విలువ గమనించాలి''

''ప్రపంచంలోనే భారత స్త్రీకి ఒక విశిష్టత ఉందని ఎవరో మహారచయిత అన్నాడు...'' అంది సరోజ వాసుదేవరావు వైపు చూస్తూ.

''కాని, భారత స్త్రీ తన జీవితంలో ఏది విశిష్టమని అనుకుంటున్నదో ఆ అంశాన్ని ముందుతరంవాళ్ళు అపహాస్యంచేసే అవకాశం ఉంది. అలా అని బరితెగించమని చెప్పడం నా అభిమతం కాదు! కాని భారత స్త్రీ గమనంలో స్పష్టత లేదు. వేల ఏళ్ళుగా రక్తంలో జీర్ణించుకుపోయిన సాంప్రదాయం మనసును కూడా ఆవరించడం వలన ఆ తేడాల్ని ఆమె సునిశితంగా గమనించలేకపోతోంది''

''నాకు జీవిత మార్గమే అగమ్యగోచరంగా ఉంది. కొన్ని కొన్ని పరిస్థితుల్లో, నాకున్న పరిధిలో నేనెలా ప్రవర్తించాలో నాకే తెలియడంలేదు'' కమల అంది.

''ఒకరిని పోలినవారు మరొకరు ఉండనట్లుగా, ఒక మనిషి జీవితంలోని సంఘటనలు మరో మనిషి జీవితంలోని సంఘటనలతో పోలి ఉండవు. ఎవరికి వారే జీవితాన్ని తరిచి చూసుకుని ముందుకు అడుగువేయాలి. మరొకరిని తన జీవిత మార్గాన్ని సూచించమని అడగటం అస్థిరమానసిక స్థితికి కారణమౌతుంది''

''సర్కస్‌లో మనిషిలా జీవితంలో ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా క్రూరమృగంలాంటి ఏదో ఒక సంఘటనవచ్చి కబళించి వేయడానికి సిద్ధంగా ఉంటుంది. అనుక్షణం జీవితాన్ని గురించి బాధపడేవాడికి సుఖమెక్కడుంటుంది? అజాగ్రత్తగా ఉంటే ఈ సమాజంలో బతకడమే దుర్లభమౌతుంది? మరి గత్యంతరం? మనుమలనుంచే మనిషి దూరంగా పారిపోవాలి! మనుమలనుంచి దూరంగా పారిపోవడం జరిగితే జంతువులా జీవితాన్ని సాగించవలసివస్తుంది, కర్మకు అతీతంగా! మనుమల్లో మనిషి ఉన్నప్పుడే కర్మచేసే అవకాశం ఉంది! కర్మ మరో జన్మకు కారణమౌతుంది. మరోజన్మ నుంచి తప్పుకోవడానికి మనుమలనుంచి దూరంగా పారిపోవడం ఉత్తమమైన మార్గమా?'' సరోజ ప్రశ్నించింది.

''మతాన్ని సాంప్రదాయపు స్తంభాలు నిలబెడుతున్నాయి. తరతరానికి సాంప్రదాయాలు తరిగిపోతున్నాయి. సాంప్రదాయపు స్తంభాలు తరగడం వలన మతపు పైకప్పు బీటలువారుతుంది. పరిస్థితి ఈ విధంగా కొనసాగితే కొన్ని తరాల తర్వాత మతపు శిథిలాలే మిగిలే అవకాశం ఉంది. మతంనుంచి దూరంగా పారిపొమ్మని నేను చెప్పడం లేదు! మతంలోని కొన్ని ఆచారాలను తరిచిచూసి ఆచరించాలని నా అభిప్రాయం. సైంటిఫిక్‌గా మతాలను ఆకళింపు చేసుకోవాలని ఈ తరం కోరుతుంది. సైన్స్‌కు అందని ఎత్తులో మతం ఉందని ముందుతరం అంటుంది. ఇది ఎటూ తేలని సమస్య!''

''ఈ సమాజంలో ఇప్పుడున్న పరిస్థితిలో స్త్రీ ఎంతవరకు తన స్వేచ్ఛను వినియోగించుకోగలుగుతుంది?'' జ్యోతి అడిగింది.

''గతతరాలవాళ్ళు ఎక్కువగా మత సిద్ధాంతాల ప్రాతిపదికపై వాళ్ల జీవితాల్ని కొనసాగించారు. ఈ తరంవాళ్ళు స్వేచ్ఛ ప్రాతిపదికపై జీవితాన్ని సాగిస్తున్నారు. పశ్చిమదేశాలన్నీ ఈ దశకు ఏనాడో చేరుకున్నాయి. భారతదేశంలో ఈతరం కొంతవరకు స్వేచ్ఛ ప్రాతిపదికపై జీవిస్తున్నా నరనరాల్లో జీర్ణించుకుపోయిన గతం వాళ్ల గమనానికి అడ్డుకట్టవేస్తోంది. పశ్చిమదేశపు స్త్రీ, పురుషుల్లో వివాహం జీవితంలో ఒక సంఘటన మాత్రమే! మొత్తం జీవితాన్ని వివాహం డామినేట్ చేయదు! భారతదేశంలో వివాహం మొత్తం జీవితకాలానికే ముఖ్యమైనదిగా ఏర్పరచబడింది''

''అంటే పశ్చిమదేశాల వివాహవ్యవస్థ శ్రేష్ఠ

మైందా?" కమల ప్రశ్నించింది.

"చిన్నచిన్న సంఘటనలకే వివాహాన్ని రద్దు చేసుకుని అశాంతితో బాధపడటం పశ్చిమదేశాలలో జరుగుతోంది. మనదేశంలో ఎటువంటి సంఘటన అయినా ఆ బంధాన్ని కదిలించదు. మహావృక్షం వేళ్ళు భూమి లోతుకు చొచ్చుకుపోయినట్లుగా వివాహం అనే బంధం శారీరక అవసరాలను మించి మనిషి జీవితంలో అత్యున్నత స్థానం ఆక్రమించుకుని ఉంది.

"అంతటి అత్యున్నత స్థానం వివాహానికి ఇవ్వడం సమంజసమేనా అన్న విషయం ఇప్పటి యువత ఆలోచించాలి. పశ్చిమ దేశాల వాళ్ళు వివాహాన్ని శారీరక అవసరం మాత్రమే అనుకుంటున్నారు. ఇది సమంజసమని అనుకోగలమా?" అన్నారు వాసుదేవరావుగారు.

"సమాధానాన్ని కోరి మేము వస్తే మమ్మల్నే ప్రశ్నిస్తున్నారు మీరు?" అంది జ్యోతి నవ్వుతూ.

"ఈ తరానికి ప్రతినిధులు మీరు. ప్రస్తుత సామాజిక పరిస్థితుల్లోనే అవకాశమున్నరీతిలో మీ జీవితాన్ని గడుపుతున్నారు... గమనిస్తున్నారు. సరియైన దారి నిర్ణయించుకోవలసిన భారం మీపైనే ఉంది. మీకు అడ్డంకుగా ఉన్న మార్గాలను ఛేదించడమో, మార్చడమో నిర్ణయించుకోవలసిన బాధ్యత మీపైనే ఉంది. ముందుతరంవాళ్లను నమ్మలేకపోతున్న మీరే మళ్ళీ సలహా కోసం వాళ్ళ దగ్గరకు వెళ్ళడం సమంజసమనిపించుకోదు" అన్నారు వాసుదేవరావుగారు.

చీకటిపడడంతో సంభాషణ ఆరోజుకు అలా ముగిసింది.

★ ★ ★

ఊహించని విధంగా రామారావుగారు రావడం వాసుదేవరావుగారిని ఆశ్చర్యపరచింది. సాదరంగా ఆహ్వానించారాయన్ని భార్యాభర్తలు.

సాయంత్రం తను వచ్చిన విషయం చెప్పడంతో భార్యా భర్తలిద్దరూ దిగ్భ్రమ చెందారు. పావనిని అత్తగారింటికి పంపడం వారికి ఏమాత్రం ఇష్టం లేదు. "అల్లుడుగారు లేనేలేరు కదా..." తగ్గు స్వరంతో అంది అనసూయమ్మ.

"అల్లుడు లేనంతమాత్రాన కోడలు కోడలు కాకుండా పోతుందా అక్కగారూ! శ్రీకాంత్ ఉత్తరం కూడా రాశాడు రెండు రోజుల్లో వస్తున్నట్లుగా. కొంచెం డబ్బు అవసరమయినట్లుగా కూడా ఉత్తరంలో రాశాడు. అయిదు వేలు ఇస్తే ప్రయివేట్ కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం దొరుకుతుందట. నేనెంత ప్రయత్నం చేసినా డబ్బు సర్దుబాటు కాలేదు. మీ అల్లుడికి ఉద్యోగం మీరే ఇప్పించాలి. ఉద్యోగాలు దొరికే అవకాశాలే తక్కువ. వచ్చిన అవకాశాన్ని చేజేతులా విడిచిపెట్టుకోవడం...." రామారావుగారు ఇద్దరి ముఖాల్లోని భావాలను పరిశీలిస్తూ అన్నారు.

ఇద్దరిలోనూ ఆనందం పొంగిపోయింది. అల్లుడు ఉద్యోగి అయితే వాళ్లకు అంతకంటే కావలసింది ఏముంది?

అయిదు వేల మొత్తం తలుచుకుంటే భయం వేసినా వాసుదేవరావుగారిలో ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. తల తాకట్టు పెట్టి అయినా అయిదు వేలు తేవాలనుకున్నారు. పావనిని తిరిగి అత్తగారింటికి పంపించాలంటే వాసుదేవరావుగారికి కష్టంగా ఉంది. పెద్ద మనిషి ప్రత్యేకంగా వస్తే కాదనడం ఎలాగ? సరేననడం ఎంతవరకు సమంజసం? పదిహేను రోజులు కూడా కాలేదు పావని అత్తవారింటినుంచి వచ్చి. పావనిని తీసుకువెళ్లడానికి ప్రత్యేకమైన కారణం ఏమైనా ఉందా? అత్త గయ్యాళి, కొడుకు లేకుండాచూసి కోడలిని ఎంతగా కష్టపెడుతుందో? పావనిని అడిగి తెలుసుకోవాలి అనుకున్నాడు.

వంటింట్లో ఉన్న పావని దగ్గరకు వెళ్లి, "మీ అత్తగారింటికి వెళతావా అమ్మా! మీ మామగారు నిన్ను తీసుకెళ్లడానికి వచ్చారు" అన్నారు.

పావని ముఖంలో భయం గోచరించింది. ఆయనగారు లేకుండా అక్కడికి వెళ్లాలంటే భయంగా ఉంది నాన్నా" అంది.

"రెండు రోజుల్లో వస్తానని రాశాడటమ్మా"

"వచ్చిన తర్వాతే వెళ్లవచ్చు. అయినా ఆయన వచ్చిన మర్నాడే వెళ్లిపోతారుగా"

'ఇప్పుడీయనకు ఏమని సమాధానం చెప్పడం?'

పావని నేల చూపులు చూస్తోంది. ఆమె కళ్ళలో నీళ్లు స్రవించడం తండ్రి గమనించా




డు. పావని మానసికంగా కోలుకునే వరకు పంపకూడదనే నిశ్చయానికి వచ్చాడు. అయిదు వేలు అప్పు తేవడానికి కండువా భుజంపై వేసుకుని బయలుదేరారు వాసుదేవరావుగారు.

టౌన్ పెద్దలందరికీ వాసుదేవరావుగారంటే ప్రత్యేకమైన అభిమానం ఉంది. విద్యావంతులే కాకుండా ధనవంతులు కూడా అతనిని గౌరవిస్తారు.

రెండు గంటల్లో డబ్బు సమకూరింది. వస్తూనే డబ్బు రామారావుగారికి ఇచ్చారు. వాసుదేవరావుగారు ఇంత త్వరగా డబ్బు ఇస్తాడని ఊహించక ఆశ్చర్యపోయాడు రామారావు.

డబ్బు లెక్కపెట్టుకుని "రేపు పొద్దున బస్‌కే కోడలిని నావెంట తీసుకువెడతాను" అన్నాడు రామారావు.

"పావనికి కొంచెం జ్వరంగా ఉంది. రెండు మూడురోజుల తర్వాత నేనే వచ్చి మీ కోడలిని మీ ఇంటికి తీసుకువస్తాను" ప్రాధేయపడినట్లుగా అన్నారు వాసుదేవరావుగారు.

రామారావుగారి ముఖం సీరియస్‌గా మారిపోయింది. "ఇది మరీ బాగుందండీ? లేడిలా గంతులు వేస్తున్న మనిషిని పట్టుకుని జ్వరం వచ్చిందని అంటున్నారు. కూతురిపైన ఇంత ప్రేమ ఉన్నవాళ్లు పెళ్లిచేయకుండా అలాగే ఇంట్లో ఉంచుకోవలసింది. పావనిని పంపించక తప్పదు"

వాసుదేవరావుగారికి ఒక్కసారిగా శరీరంలోని రక్తం ఉవ్వెత్తున పరుగులు తీసింది. ఒక మూర్ఖుని ఎదుట చేతులు కట్టుకొని నిలబడి, అతను అనే మాటల్ని తలవంచుకొని భరించడం. జీవితకాలంలో ఎవ్వరినుంచీ పల్లెత్తు పరుషమైన మాట పడలేదు. పెద్ద ఆఫీసర్ల నుంచి కూడా ప్రత్యేకమైన గౌరవాన్ని అందుకున్నారు సుఖదుఃఖాలకు అతీతుడిగా జీవితాన్ని ముగించాలనుకున్న అతనికి దుఃఖానికి రాజమార్గం వేస్తున్న రామారావును చూస్తే అసహ్యం వేసింది. వేగంగా వంటగది వైపు వెళ్లి "మీ మామగారు నిన్ను తీసుకువెళతారట. ప్రయాణానికి సిద్ధంగా ఉండు పావనీ" అన్నారు ఎటో చూస్తూ- ఆమె ముఖంలోకి సూటిగా చూసి చెప్పలేక.

పావనికి షాక్ తగిలినట్లయింది. శ్రీకాంత్ లేకుండా అత్తగారింటికి వెళ్లకూడదని పావని నిశ్చితమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకుంది. అయినా నోరు మెదపడానికి వీలుకాని పరిస్థితి కల్పించబడింది. ఆమె గుండె వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టి నిస్సత్తువ ఆవహించి ఒళ్లు వేడెక్కడం మొదలయింది.

వెళ్లే ముందు తల్లిని కౌగలించుకుని బావురుమంది పావని. ఆమె జీవితంలో మొదటిసారిగా తండ్రి కళ్లు చెమర్చడం చూసింది.

పావని అత్తగారింటికి వచ్చి వారంరోజులయినా శ్రీకాంత్ వైజాగ్ నుంచి రాలేదు. "డబ్బుకోసం వారింకా రాలేదేం మావగారూ" ఉండబట్టలేక అడిగింది పావని.

"తెలిసిన మనిషితో డబ్బు వంపించాను. అయినా ఇటువంటి విషయాలు నీకెందుకూ, వంటింట్లోకి వెళ్ళి పనిచూసుకో." విరాగ్గా అన్నాడు రామారావు.

నాగరత్నమ్మ దీర్ఘాలు తీసింది. "ఈమె ఒక్కదానికే శ్రీకాంత్‌పైన ప్రేమ ఉన్నట్లు! మరెవ్వరికీ ప్రేమలేనట్లు! కనిపెంచి పెద్ద చేసిన మేము అతన్ని కసాయివాళ్ళకు అప్పగిస్తామా ఏమిటి? అన్నీ పనికిమాలిన కూతలు! తిని అరగని మాటలు- చేతినిండా పని ఉంటే ఇటువంటి ఆలోచన్లు రావు! మూడుపూటలా తిని బలవడం చూడు, ఎలాఉంది! పెళ్ళయినప్పుడు పూచికపుల్లలా ఉండేది! తేరగా వచ్చింది కదా అని అత్తగారింట్లో మేయడం మొదలుపెట్టి...."

ముందుగదిలోంచి అత్తమాటలు వింటూనే పావని కళ్లు గిర్రున తిరిగాయి. తనేం తప్పు మాట్లాడిందని? విషయం అడిగి తెలుసుకోవడం కూడా తప్పేనా? ఎందుకు మనుషులు ఇంత భయంకరంగా ప్రవర్తిస్తారు? మనుషుల మనస్తత్వాలు ఇంత కుచ్చితంగా ఉంటాయా? ఎందుకు ఇంత నరకాన్ని చూపిస్తున్నారు! వారం రోజులుగా జ్వరం ఉన్నా ఇంటి పనంతా తనొక్కతే చేస్తోందే! అయినా కనికరంలేదా? బట్టలు ఎంత తెల్లగా ఉతికినా బట్టలు పిండటం చేతకాని మనిషీ ఒక మనిషేనా అని దీర్ఘాలు. ఎక్కువ నీళ్లలో జాడిస్తే

నీళ్ళబిల్లు ఎక్కువవస్తుందంటారు. తక్కువనీళ్లతో ఉతికితే ఎక్కడి మురికి అక్కడే ఉంది ఏం ఉతికావ్ అంటారు. గదులు ఎప్పటికప్పుడు ఊడుస్తూ అద్దంలా ఉంచినా ఇల్లంతా దుమ్ము పేరుకుపోయిందని- అత్తగారు, మామగారు అంటూనే ఉంటారు. తను అన్నం ముందు కూర్చుంటే ఏం మిగుల్చుకుని తింటుందో అని అందరూ ప్రత్యేకంగా చూసిపోతారు. మొదట్లో కూరలు మిగల్చేవారుకాదు. ఆతర్వాత మజ్జిగ, రసం కూడా మిగల్చడం మానేసారు. అనవసరంగా పళ్లెంనిండా కూరలు వదిలేసి చేతులు కడిగేసుకుంటారు. రోజూ ఒక పూటయినా పస్తు ఉండవలసి వస్తోంది.

తల్లిగారింట్లో తనొక రాజకుమార్తెలా పెరిగింది. ఎవ్వరూ తనలా సుఖపడి ఉండరు! తను తినేప్పుడు నాన్నగారు తొంగిచూసేవారు. తను తినడం చూస్తే నాన్నకు అమృతం తాగుతున్నంత తృప్తిగా ఉంటుంది. ఒక్కోసారి నాలుగయిదు రకాల కూరలు, రెండు మూడు రకాల స్వీట్లు చేసేది అమ్మ ఎంత వారించినా వినకుండా! తనా తిండికోసం ముఖంవాచిపోయింది! వెయ్యిజన్మలెత్తినా అమ్మా నాన్నలు తనపై పెంచుకున్న అభిమానానికి ఋణం తీర్చుకోగలదా? అంతగా సుఖం, అంతగా ప్రేమను చవిచూసిన తనకా బిచ్చగత్తెకు వేసినట్లుగా అన్నం వేయడం? సుఖదుఃఖాలు చీకటి వెలుగుల్లా తననెందుకిలా వెంటాడుతున్నాయి? సుఖాన్ని చూసిమురవాలా? దుఃఖాన్ని చూసి బతుకుపై ఆశవదులుకోవాలా? దేవుళ్ళతో సమానమయిన భర్త, తల్లిదండ్రులు; యమభటులతో సమానమయిన అత్తమామలు.

ఇన్నిరోజులయినా ఆయనగారి నుంచి ఉత్తరం ముక్కయినా రాలేదేం? డబ్బు వీళ్ళు పంపించారా? లేక అవసరాలకు వాడుకున్నారా? లేక ఇదంతా డబ్బు రాబట్టడానికి వేసిన ప్లానా? పావనికి వెన్నెముకలో వణుకు మొదలయింది! ఒక్కసారిగా నిలబడటమే దుర్భరమై అలాగే కళ్ళు తిరిగిపడిపోయింది.

అరగంట తర్వాత మేల్కొంది పావని. చుట్టూ ఎవ్వరూ లేరు. డైనింగ్‌టేబుల్, కుర్చీలు మూగగా చూస్తున్నాయి. అర్ధగంట అయినా ముందుగదిలోంచి డైనింగ్ రూమ్‌లోకి ఎవ్వరూ రాలేదు. లేక వచ్చి చూసి కూడా ఏమీ పట్టనట్లుగా వెళ్లిపోయారా? భయపడిపోయింది. పనిమనిషయినా అలా ఎవ్వరూ పట్టనట్లుగా వుండటం వీలుకాదే? ఈ ఇంట్లో తనో బానిస. అంతే! కట్నం తెచ్చే బానిస... మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్లి బోల్ట్‌వేసుకుని మంచంపైన పడిపోయింది మళ్లీ కళ్లు తిరగడంతో.

తలుపు ధన్‌ధన్‌మని చప్పుడవుతూనే కళ్లు నులుముకుని లేచి కూర్చుంది పావని. బోల్ట్ తీస్తూనే అత్తగారు కనిపించడంతో కంగారుపడిపోయింది. మామూలుగా ఆమె డాబాపై గదిలోకి రాదు.

"బోల్ట్ ఎందుకు వేసుకోవాలి? ఏం? నిద్రపోతున్నావా పనిపాటలు చేసుకోవాలన్న ధ్యాన ఉంటేగా? మణిమాణిక్యాలు ఏమైనా వున్నాయా నీ దగ్గర దాచుకుపోవడానికి" అందామె వస్తూనే.

పావని మాట్లాడకుండా తలదించుకుంది.

"అంత మొద్దునిద్రా? ఇరవైసార్లు తట్టినా లేవకపోవడం?"

పావని మూగగా వుండిపోయింది.

"తల్లిగారింటి దగ్గర సాగినట్లుగా అత్తగారిళ్లలో సాగుతుందనుకుంటే పెళ్లి, పెడాకులు లేకుండా వుండాలి. అక్కడి సాగుబాటు ఇక్కడ మాపైన చూపించుకోవడం ఏంబాగోలేదు. రెండు గంటలప్పుడు పడుకోవడానికి వచ్చి, ఏడు గంటలవుతున్నా ఇంకా పడుకుని వుండటమా? ఎవరికైనా చెబితే నవ్విపోతారు. మధ్యాహ్నం తిన్నావు కాని పాత్రలు కడిగివేసే జ్ఞానం లేదా? ఇక్కడ ఇదంతా చెల్లదు. పని సక్రమంగా చేసి తిండి తినాలి. లేకుంటే పస్తే అన్నది గుర్తుంచుకో! ఈ రాత్రికి వంట చేయదలుచుకోలేదా ఏం? రోజురోజుకు పని అంటే అశ్రద్ధ పెరిగిపోతోందేం నీకు? తల్లిగారింటికి వెళ్లి వచ్చినప్పటినుంచీ నీ ప్రవర్తన మరోవిధంగా వుంది. ఈ రాత్రి పనిమొత్తం నాపైన రుద్దాలని చూస్తున్నట్లుంది? అప్పుడే ఇంతగా తెలివిమీరిపోయావా? కొమ్ములు మొలిచాయా ఏం...?"




పావనికి ఎన్నడూ రానంతగా కోపం వచ్చింది. చాలావరకు నిభాయించుకున్నా గొంతులోంచి కరుకుగా వచ్చాయి మాటలు. ''మీకు పనిచెయ్యాలి కాని, నాకు జ్వరం వచ్చి చచ్చిపోయినా మీకు పట్టింపు లేదా ఏం?'' అంది.

నాగరత్నమ్మ కళ్లు వెడల్పుచేసి, చేత్తో నోటి పై కొట్టుకుంది. ఎన్ని అన్నా బానిసలా పడి వుంటుందనుకుంది గానీ పావని ఇంత తెగించి కరుకుగా మాట్లాడగలుగుతుందని ఆమె ఎన్నడూ అనుకోలేదు. షాక్ తిన్నట్లుగా ఒక నిమిషం అలాగే నిలబడిపోయింది.

''నీకేమయింది దుక్కలా వున్నావు. పనిచే యవలసి వస్తుందని జ్వరం అంటూ అబద్ధం ఆడుతున్నావు. ఈ నాగరత్నమ్మ దగ్గర అటువంటి పప్పులేం వుడకవు. ఈ రాత్రి పనిచేసి తీరవలసిందే. రోగమొచ్చినా సరే పనిచేసి వెళ్ళి పడుకో అంతే!'' అంది నాగర త్నమ్మ.

''నాకు పనిచేయడమే కాదు; కిందికి దిగిరా వడం కూడా సాధ్యం కాదు. మీరు నాకు తిండి పెట్టకున్నా సరే నీళ్లు తాగి బతకగలను. కానీ పనిచేయలేను'' పావని ముక్కుపుటాలు కో పంతో విచ్చుకున్నాయి. ఉధృతంగా వస్తున్న కోపాన్ని ఎంతో కష్టంగా అదిమిపట్టింది.

నాగరత్నమ్మకు రక్తమంతా ముఖంలోకి వచ్చింది. ''సరే... అంతవరకు వస్తే దాని ఫలితమేదో చూస్తావ్. రానీ-శ్రీకాంత్ చెబుతాను నీ పొగరుమొత్తనాన్ని. పెళ్ళాన్ని నెత్తికెక్కించు కున్నాడు'' అంటూ మెట్లుదిగి కిందికి వెళ్లిపో యింది.

* * *

కమల మళ్లీ అత్తగారింటికి వచ్చి రెండురో జులవుతుంది. పని అలవాటు తప్పినట్ల యింది. అత్తగారింటివాళ్ల మనస్తత్వాలకు అలవాటుపడటం నేర్చుకున్నా ఇప్పుడు అవ న్నీ మళ్లీ కొత్తగా అనిపించాయి. అయినా మూడురోజుల్లోనే సర్దుకుని మళ్లీ మామూలుగా డిలో పడిపోయింది. డబ్బు తేలేదని ఇంటిల్లి పాది గొంతువరకు కోపం నింపుకుని వున్నారు. పరిస్థితి చెప్పినా అర్థం చేసుకోవడానికి ప్రయ త్నమే చేయడంలేదు వాళ్లు.

జీవితప్రవాహానికి ఎదురీదాలనుకుంది కమల. అడ్డుగోడ కట్టినట్లుగా మరొక సంఘట నతో ఆమె మనసు పూర్తిగా చెదిరిపోయింది. తేరుకోలేనంత భయంకరంగా ఆ సంఘటనా సుడిగుండం ఆమెను తనలోకి లాక్కుంది. పరిస్థితులకు రాటుదేలిపోయినా ఆ సంఘ టన ఆమెను లావాలా కరిగింపజేసింది.

ఉదయపు పనంతా అయిపోయింది ఆరోజు. పొగకు వంటగదిలో చిరాకనిపించి చల్లగాలి పీల్చుకుందామని వసారాలోకి వచ్చింది కమల. పాలిగాడు బాలయ్య ఆరోజు పొలం వెళ్లలేదు. కండలు తిరిగిన శరీరం, ఆకర్షణీయమైన ముఖం అతనిది.

బీడీ తాగుతూ వసారా మూలలో కూర్చున్న బాలయ్య కమల బయటికి రావడంతో, లేచిని లబడ్డాడు. పొద్దుటినుంచి ఏమి తినలేదమ్మా, జ్వరంగా వుందని. ఇప్పుడు జ్వరం తగ్గినట్ల యింది, ఆకలిగా వుంది. అన్నం వుంటే వెయ్యమ్మా'' అన్నాడు.

ఇంట్లోకి వెళ్లి విస్తరాకులో అన్నం, కూరవేసి వసారాలో వున్న బాలయ్య ముందువుంచి, వంటింట్లోకి వెళ్లింది కమల.

ఆకలిగా వుండటంవలన అన్నం గబగబా తినేశాడు బాలయ్య. సగంకడుపు కూడా నిండి నట్లనిపించలేదతనికి. ''కమలమ్మా'' అని పిలిచాడు. కమల బాత్‌రూమ్‌లో స్నానం చే స్తుండటంవలన అతను పిలిచింది విని పించుకోలేదు.

వంటగదిని ఆనుకుని చిన్నతోటలాంటి ప్ర దేశం వుంది. తోటచుట్టూ రెండు అడుగుల ఎత్తు గోడ వుంది. చిన్నగేటు కూడా వుంది ఆ తోటకు. బాలయ్య విస్తరాకు పట్టుకుని తోటలోకి వచ్చాడు. వంటగదికి దగ్గరగా వుంది కాబట్టి అవసరమయినవి అన్నీ అడిగివేయించుకోవ చ్చు అనుకుని, కమలను మళ్లీ పిలిచాడు.

కమల బాత్‌రూమ్‌లో స్నానం చేస్తూ బాల య్య పిలుపువిని తొందరగా స్నానం ముగించి, చీర చుట్టుకుని బయటకు వచ్చింది.

మీనాక్షమ్మకు దాహంవేసి వంటగదిలోకి వచ్చింది.

కమల చీరను అస్తవ్యస్తంగా చుట్టుకుని

అన్నం బేసిన్ తీసుకుని బాలయ్య దగ్గరకు వెళ్లడం మీనాక్షమ్మ గమనించింది.

ఖాళీ విస్తరాకు రెండు చేతులతో పట్టుకుని నిలబడ్డాడు బాలయ్య. అన్నం కరుడు విస్త రిలో వేస్తూనే, విస్తరాకు చిరిగి అతని చేతి లోంచి విస్తరి జారిపోయింది. అన్నం నేలపాల యింది.

ఊహించని పరిణామానికి బాలయ్య ఒక్క అడుగు ముందుకువేసి విస్తరిలోని అన్నం కరుడును ఎత్తుకునే ప్రయత్నంలో కమలను అనుకోకుండా తాకాడు. అలా తాకడం కమల అంతగా పట్టించుకోలేదు. అనుకోకుండా జరి గిన సంఘటనగానే భావించి వూరుకుంది.

మీనాక్షమ్మకు మాత్రం ఇది విపరీతంగా అనిపించింది. బాలయ్యకు ప్రత్యేకంగా వంట గది దగ్గరగా అన్నం పెట్టడం ఏమిటి? వాడు అలా ఆమెను తాకడం ఏమిటి? వీళ్లిద్దరి మధ్యలో ఏదో వుంది అనిపించింది. కొన్ని నిమిషాల్లోనే మీనాక్షమ్మలోని అనుమానబీజం మహావృక్షమైపోయింది.

ఆతృతగా రమేష్, వరంధామయ్యల కోసం ఎదురుచూస్తూ వుండిపోయింది.




రసాయనశాస్త్రంలో ఈక్వేషన్లు టకటకా చె ప్పుకుంటూ వెళుతున్నాడు టీచర్. మొదటి నుంచి తెలుగు మీడియంలో వుండి, ఒక్కసా రిగా ఇంగ్లీషు మీడియంలో జాయిన్ కావడంతో వాసు సైన్స్‌లో వీక్! అందువలన టీచర్ చెప్పేది అర్థం కావడంలేదు. లంచ్‌బెల్ కొట్ట డంతో క్లాస్ ముగించి వెళ్లిపోయాడు టీచర్.

క్యాంటీన్‌లో కూర్చుని కాఫీ తాగుతున్న లెక్చ రర్ శ్రీధర్ వద్దకు వెళ్లాడు వాసు. ''సార్'' అన్న పిలుపువిని వులిక్కిపడి తల ఎత్తి చూశా డు శ్రీధర్.

ఎదురుగా అయిదు అడుగుల ఎత్తు ఉన్న అబ్బాయి. చాక్‌లెట్‌కలర్ ప్యాంట్‌లో వైట్‌షర్ట్ టక్ చేశాడు. అందంగా, అమాయకంగా వున్న ఆ స్టూడెంట్‌ను చూసి ముచ్చటపడ్డాడు శ్రీధర్.

''ఏం కావాలి?'' అడిగాడు ప్రశ్నార్థకంగా.

''కెమిస్ట్రీ సరిగా అర్థం కావడంలేదు సార్''

వందలకొద్దీ స్టూడెంట్స్ మధ్య వాసుని ఇంతవరకు ప్రత్యేకంగా చూడలేదు శ్రీధర్. ''ఏ క్లాసు?'' అనడిగాడు.

సమాధానం చెప్పాడు వాసు.

శ్రీధర్‌కు తను చేసిన తప్పేమిటో అర్థమ యింది. హైస్కూల్‌నుంచి ఇంటర్‌వరకు వున్న ఎడ్యుకేషనల్ ఇనిస్టిట్యూషన్ కావడంవలన, ప్రిన్సిపాల్ రిక్వెస్ట్ చేయడంతో సైన్స్‌క్లాస్‌కు టీచ్ చెయ్యడానికి వెళ్లడం జరిగింది. ఇంటర్ వాళ్లకు చెప్పినట్లుగా వేగంగా చెప్పుకుంటూపో వడంవలన తక్కువ స్టాండర్డ్ వున్న విద్యార్థు లకు అర్థమయ్యే అవకాశమే లేదు. శ్రీధర్ వాసువైపు పరిశీలనగా చూసి ''మొదటినుంచి రెగ్యులర్‌గా వున్నావా?'' అడిగాడు.

''రెగ్యులర్‌గానే వున్నాను సార్''

వాసుని తొందరగా విడిచిపెట్టాలనిపించలే దు శ్రీధర్‌కు. ''కాఫీ తాగుతావా'' నవ్వుతూ అడిగాడు.

''వద్దుసార్... మీ ఎదుట కూర్చుని తాగా లంటే భయం వేస్తుంది''

శ్రీధర్ కాఫీకి ఆర్డరిచ్చి ''ఇంత పెద్దవాడివ య్యావు. హైస్కూల్‌లో చదువుతున్నావు. ఇంకా సిగ్గుపడితే ఎలాగా?'' వాసువైపు సూ టిగా చూస్తూ అన్నాడు.

కాఫీ ముందుంచినా తటపటాయించి సిగ్గు పడుతూ తాగడం ముగించాడు.

శ్రీధర్ బిల్లు చెల్లించి ''కాంసన్‌ట్రేషన్‌తో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. అర్థం కాకపోతే లీజర్ పిరియడ్‌లో నా దగ్గరకు

వచ్చెయ్. నీకు అర్థం కానిది చెబుతాను'' అని భుజంతట్టి వెళ్లిపోయాడు.

వారం తర్వాత సూపర్‌బజార్‌లో స్టాల్స్‌ని చూస్తూ నడుస్తున్నాడు శ్రీధర్. చేతినిండా అప్పటికే కొన్నవస్తువుల ప్యాకెట్లు వున్నాయి.

''నమస్కారం సార్'' అన్న మాటలు విని పక్కకు తిరిగిచూశాడు.

వాసు నవ్వుతూ కనిపించాడు.

శ్రీధర్ వాసు భుజంతట్టి- ''నువ్వా వాసూ... కెమిస్ట్రీ అర్థం కాలేదన్నావు, లీజర్ పిరియడ్‌లో చెబుతానన్నానుగా.... రాలేదేం?'' అంటూ పక్కనే వున్న సరోజను చూసి- ''ఈమె...'' ప్రశ్నార్థకంగా వాసువైపు చూశాడు.

వాసు సమాధానం చెప్పాడు.

సరోజవైపు కళ్లెత్తి చూస్తూనే అతని మనసులో ఎన్నోభావాలు దోబూచులాడాయి. ముఖానికి బొట్టు లేకపోవడంతో మెడను, కాలివేళ్లను గమనించాడు.

రోడ్డుపైన నడుస్తున్న సరోజ శ్రీధర్ కనుల ముందు మెదులుతోంది. ఎన్నో ఆలోచనలతో సతమతమైపోయాడు. తొలిచూపులోనే మనసును దోచేసింది అనుకున్నాడు సభ్యత లేకుండా తను ఆమెను నిలువెల్లా చూసి. ఆమెవైపు ఇంతగా ఆకర్షింపడటం ఏమిటి?

కానీ తడిసిన గులాబీలా, అరవిచ్చిన మందారంలా, గుబాళిస్తున్న మల్లెలా, బంతిపూవులా నిండుగా, కనకాంబరం పూవులా మెరిసిపోతూవున్న సరోజను చూస్తే ఆకర్షణ కలగకుండా పోతుందా?

ఆమె కళ్లలో ఏదో అయస్కాంతశక్తి, ముఖంలో తేజస్సు వున్నాయి.

సీతలో కూడా ఇదే అందం! ఏమాత్రం చెక్కుచెదరని పురాతన శిల్పంలాంటిది సీత ప్రౌఢలోని అవయవపుష్టితోబాటు కన్నెప్పిల్లలోని చలాకీతనం వున్న సీత!

అరకులోయలోని పచ్చదనం, హిమాలయంలోని తెలుపు, సంధ్యలోని ఎరుపు, మబ్బులోని నీలిరంగు కలబోసుకుని తనో నూతనమైన రంగుతో వుద్భవించిన సీత!

సీత ఎరుపా? నలుపా? అని ఎన్నిసార్లు తరచి చూసినా అర్థం కాకపోయేది శ్రీధర్‌కు. ఇంద్రధనస్సులో రంగులన్నీ కలిసి ఒక వింతను సృష్టించినట్లుగా సీత కూడా ఒక వింత!

సీతను తనకు కాకుండా చేసిన విధిని ఎన్నిసార్లు నిందించినా ప్రయోజనమేముంది? సృష్టిమాన్ని తను మార్చగలడా? అన్నీ తెలిసినవుడి కూడా మనిషి వూరడింపు చెందలేడెందుచేతనో? మనిషి దుఃఖాన్ని మరచిపోగలడు-సుఖాన్ని మరచిపోగలడా?

అగ్నిలా ఎగసే దుఃఖం; కాలమనే నీటి ప్రవాహానికి నమసిపోతుంది. అనుభవించిన సుఖం కాలగమనంలో నదీప్రవాహంతో మేటవేయబడిన సారంతో నిండిన తీరభూముల్లా మనసునిండా నిండిపోతుంది.

ఆమె ఇచ్చిన కొన్నిరోజుల సుఖం జీవితాంతంవరకు సరిపోయేలా వుంది అనుకునే సమయంలో; సీతను మబ్బుల వెనక్కు తోస్తూ; నిండుచంద్రునిలా మెరిసిపోతూ హృదయపు కవాటాల్ని మళ్లీ తెరిపిస్తున్న ఈ స్త్రీ ఎవరు?

క్లాసురూమ్‌లో బోర్డుపై ఈక్వేషన్స్ వేసి సాల్వ్ చేయకుండా వాసుని సమాధానం చెప్పమన్నాడు శ్రీధర్.

వాసు బిక్కముఖం వేసుకుని నిలబడిపోయాడు. శ్రీధర్ వేసిన ఈక్వేషన్లకు క్లాస్‌రూమ్‌లో మరెవ్వరూ సమాధానం చెప్పలేరని శ్రీధర్‌కూ తెలుసు.

స్కూల్ విడుస్తూనే స్కూటర్‌స్టాండ్ దగ్గర నిలబడ్డాడు శ్రీధర్. ఊహించినట్లుగానే వాసు తనవైపు రావడం గమనించాడు. దగ్గరకు వస్తూనే- ''మీరు ట్యూషన్ చెబుతారా సార్?'' అన్నాడు.

''ఎవరన్నారు నీతో నేను ట్యూషన్ చెబుతానని. మూడు సంవత్సరాలవుతోంది నేను ట్యూషన్ చెప్పడం ఆపివేసి. వీలుంటే ప్రయత్నం చేస్తాను'' అంటూ స్కూటర్ స్టార్ట్‌చేసి ''మీ ఇల్లు ఎక్కడ'' అని అడిగాడు శ్రీధర్.

సమాధానం చెప్పాడు వాసు.

''నేను అటే వెళుతున్నాను. నిన్ను డ్రాప్ చేస్తాను... కూర్చో'' అన్నాడు శ్రీధర్.

వాసు కూర్చున్న తర్వాత- ''మా ఇల్లు బేగంపేట్ దగ్గర వుంది. నీవు మా ఇంటికి

వచ్చి ట్యూషన్ చెప్పించుకోవడం కష్టం. మీ నాన్నగారిని అడుగు. నేను మీ ఇంటికి వచ్చి ట్యూషన్ చెప్పడానికి వీలవుతుందేమో?'' అన్నాడు.

''మా నాన్న పల్లెటూరిలో వున్నాడు. మా అన్నయ్య ఇక్కడే యూనివర్సిటీలో పోస్టుగ్రాడ్యుయేట్ చేస్తున్నాడు''

''అయితే మీ అన్నయ్యని కనుక్కో. నేను మీ ఇంటికి వచ్చి ట్యూషన్ చెప్పడానికి వీలవుతుందేమో'' అన్నాడు శ్రీధర్. అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. వాసు అన్న నిరాకరిస్తే?

వాసు ఇంటికి కొంతదూరంలో స్కూటర్ ఆపాడు శ్రీధర్. వాసు స్కూటర్ దిగి ఇంటివైపు వెళ్లడాన్ని గమనించాడు.

వాసు తలుపుతట్టి ''అక్కా'' అని పిలిచాడు.

సరోజ తలుపు తెరవడం, వాసు ఇంట్లోకి వస్తూనే తలుపు వేసుకోవడం కొన్ని సెకన్లలోనే జరిగిపోయింది. సరోజను చూశానన్న తృప్తితో శ్రీధర్ స్కూటర్‌ను స్టార్ట్ చేశాడు.

పాలపుంతలోని నక్షత్ర సమూహాలు ద్విగిణీకృతంగా మెరుస్తున్నాయి. నెలవంకను కప్పివేస్తున్న మేఘమాలలను చూస్తే చిన్నపిల్లలు దాగుడుమూతలు ఆడుతున్నట్లుగా వుంది. ఆకాశం నిర్మలంగా వుంది. ప్రేమికుడు ప్రేయసి చుట్టూ తిరిగినట్లుగా చంద్రుడు, భూమి చుట్టుగా తిరుగుతున్నాడు.

తారలు చంద్రునికి అంత దూరంలో వున్నా చంద్రునికి తారలకు దగ్గరి సంబంధం వున్నట్లుగా కథలు ఎలా వచ్చాయో? ప్రేమికులకు అనంతదూరం కూడా అడుగుదూరంలా కన్పిస్తుందేమో? సరోజ కూడా తారలా తనకు అనంతదూరంలో వుంది. కాని ప్రేమికునికి దూరం ఎన్నటికీ ఆటంకం కాదు!

శిలలా పడివున్న అహల్యలా, రాళ్లగుట్టలో గుర్తింపులేకుండా పడివున్న కోహినూర్‌లా వుంది సరోజ. కోహినూర్‌లాంటి సరోజను వెలికి తీసి మెరుగుపెట్టాలి. సరోజ తనకు దక్కితే తనలా సుఖపడేవారు ఎవ్వరూ వుండరేమో?

సరోజ వైధవ్యం ఆమెకు శాపంగా అనిపించినా, తనకు వరంగా పరిణమించింది.

శ్రీధర్ మూడంతస్తుల భవనంపై పడుకుని ఆలోచనల్లో తేలిపోతున్నాడు. కన్ను మూసినా, తెరిచినా సరోజే కనిపిస్తోంది. 'కొన్ని విషయాలను గురించి ఆలోచించడం మొదలుపెడితే అలసిపోయినట్లుగా అనిపిస్తుంది. ప్రేమ విషయాలను గురించి ఆలోచిస్తే బలం పుంజుకున్నట్లుగా వుంటుంది' మిత్రుడు అన్న మాటలు గుర్తుకు వచ్చాయి శ్రీధర్‌కు. అనుభవంతో చెప్పిన మాటల్లా వున్నాయి అనుకుని నవ్వుకున్నాడు.

* * *

మోహన్ రాత్రి తొమ్మిది గంటలకే బెడ్‌రూమ్‌లోకి రావడం చూసి ఆశ్చర్యపోయింది జ్యోతి. తాగడానికి వీలులేని పరిస్థితి ఏదైనా సంభవించిందేమో? ఇన్ని రోజులుగా, ఇంత త్వరగా ఇంటికి రావడం అనేది ఎప్పుడూ లేదు, మరి.

మోహన్ నైట్‌డ్రెస్ వేసుకుంటూ - ''డొక్కు కారులో తిరగడం నాకెంత నామోషీగా ఉంచో తెలుసా? అందరూ నన్ను చూసి నవ్వుతున్నారు. ఫ్యాక్టరీకీ, క్లబ్‌కీ కూడా వెళ్లలేకపోతున్నాను. డొక్కు కారులో వెళ్ళేవారికి విలువేముంటుంది? కోటీశ్వరులైన మిత్రులు నా కారుచూసి నవ్వుకుంటున్నారు. నా కారు ఒక జోక్ అయిపోయింది. రేపటినుంచి ఎక్కడికీ కదలకుండా నీ గదిలోనే ఉండిపోతాను. విలువ లేని బతుకు బతకడంకంటే చావడంమేలు'' అన్నాడు రుసరుసలాడుతూ.

''మరి నన్నేం చేయమంటారు? మా అన్న అమెరికా నుండి డాలర్లు పంపించాలిగా...''

''మీ అన్న పంపించడం, మీ నాన్న నాకు కారు కొనిపించడం ఈ జన్మలో జరిగేపనేనా? ఇవ్వలేక ఇదొక సాకు...''

జ్యోతి మౌనంగా ఉండిపోయింది, అంత రంగం ఉడికిపోతున్నా.

''పది లక్షలు, కారు ఇస్తాం అని వచ్చినా నేను అమ్మాయి కొంచెం నలుపుగా ఉందని ఆ సంబంధాన్ని చేసుకోలేదు. ఆ సంబంధాన్నే చేసుకుని ఉండవలసింది. నిక్షేపంలా ఉండేవాడిని. నిన్ను చేసుకుని నేనేం సుఖపడ్డాను? మానసికంగా ఎదగనేలేదు నీవు ఇంత




వరకూ! భర్త ఎప్పుడు కోరినా దగ్గరకు రావాలి! నేనెప్పుడు దగ్గరకు వచ్చినా నీవు గింజుకుంటావు. ప్రాణం పోయినట్లుగా ప్రవర్తిస్తావు''

జ్యోతికి చిరాకెత్తింది. తను అన్ని తప్పులూ చేస్తూ, ఏమాత్రం తప్పుచేయని భార్యని ఇంతగా నిందించడమా? ''మీరు పిచ్చిపట్టినట్లుగా మాట్లాడితే పడటానికి ఇక్కడ ఎవ్వరూలేరు. ఆరు లక్షల కట్నంతో వచ్చాను'' అంది జ్యోతి రోషంగా.

''తెచ్చావులే ముష్టి ఆరులక్షలు. ప్రపంచంలో మీనాన్న దగ్గరే డబ్బు ఉంది... మరెవ్వరి దగ్గరాలేదు''

''మా నాన్నను అంటే ఊరుకోను... మా నాన్న గురించిన ప్రస్తావన మరెప్పుడూ తీసుకు రావద్దు''

''కారు ఇచ్చే బాధ్యత మీ నాన్నది. అది ఇప్పించేవరకు ఏమైనా అంటాను. దాటవేయడానికి అన్నీ అబద్ధాలు ఆడుతున్నారు''

''అబద్ధాలు ఆడటం మీకు చేతనయినంతగా మరెవ్వరికీ చేతకాదు. మీ ప్రవర్తన ఇలా ఉంటుందని తెలిస్తే నేను చచ్చినా ఈ సంబంధానికి ఒప్పుకునేదాన్నికాదు. నాకోసం కోటి మంది క్యూకట్టి నిలబడేవారు''

''మరెవరినో చేసుకోకుండా నన్నెందుకు చేసుకున్నావు? నీకు పొగరెక్కువయింది. భర్తఅన్న ఇంగితజ్ఞానం లేకుండా నోటికి వచ్చినట్లుగా వాగుతున్నావ్. ప్రపంచం తలకిందులయినా సరే నెలరోజుల్లో నాకు కారు కావాలి....'' జ్యోతి వైపు కసిగా చూస్తూ అన్నాడు మోహన్.

జ్యోతిలో అసహనం, అసహ్యం ముప్పిరిగొన్నాయి. ''మానాన్న కారు ఇవ్వరు. ఒకవేళ మా నాన్న ఇస్తానన్నా నేనే వద్దంటాను. నీవు వెలగబెడుతున్న రాచకార్యాలు ఏమున్నాయని, తాగి తందనాలు ఆడటం తప్ప''

ఒక్కసారిగా ఆవేశం తగ్గి, తను ఈ మాటలు మాట్లాడవలసింది కాదని అనుకుంది. ఎందుకు మాట్లాడకూడదూ? తనేం తప్పుగా మాట్లాడలేదే? లొంగి ఉండేకొద్దీ ఎదుటివారి ప్రవర్తన విపరీతమై విజృంభించి పోతోంది. కొంతనైనా అణగదొక్కక తప్పదు.

ఆవేశంలో బలహీనమైన ఆమె కళ్ళు అరమోడ్పులయినాయి. కళ్ళు తెరుచుకున్నా ఏదృశ్యం చూడలేనిదై, కల్లోలితమైన అంతరంగంలోకి మరిన్ని సంఘటనలు కీప్పలుతెప్పలుగా వచ్చి మరింత కల్లోలపరచడంతో శరీరం మొత్తం చెమటపట్టింది. స్ట్రీమ్‌బాత్ చేస్తున్నట్లుగా ఉంది. శరీరం తూలిపడబోతున్నా అలాగే నిలబడిపోయింది. మెల్లమెల్లగా పరిసరాలు కళ్ళముందు గిర్రున తిరుగుతున్నాయి.

మోహన్ ఆమె ముఖంపైన, వీపుపైన, ఎదపైన, కడుపుపైన, తొడలపైన తన బలాన్నంతా ఉపయోగించి కొడుతున్నాడు. ఆమె అంతరంగం ఉవ్వెత్తున లేచిన తరంగమై, అస్థిత్వాన్ని తనలో కలిపివేసుకుని మరో లోకమైన మూర్ఛలోకి లాక్కుపోయింది.

* * *

ఆ రాత్రి పావని శరీరం కాలేపెనంలా ఉంది. మందులేదు, ఓదార్చేవాళ్ళులేరు. అడుగు తీసి అడుగువేయడానికి ఆమెకు శక్తిలేదు. మగతగా ఉందికాని నిద్రపట్టడంలేదు. పావనికి అనుక్షణం శ్రీకాంత్ గుర్తువస్తున్నాడు. అతని రూపం కళ్ళముందు అలాగే నిలిచిపోయింది. దేవునికి మొరపెట్టుకుంది శ్రీకాంత్‌ను వచ్చేలా చేయమని.

బతకాలి.... శ్రీకాంత్ కోసమైనా బతకాలి! డాక్టర్ దగ్గరకు వెళ్ళాలి అనుకుని మంచంపై నుంచి లేచి నిలబడటానికి ప్రయత్నం చేసింది. లేచి నిలబడుతూనే కళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. ఒక్క అడుగువేయడానికి కూడా వీలులేని పరిస్థితి.

ఆ రాత్రి గంటలు, నిముషాలు, సెకన్లను లెక్కపెడుతూ గడపాల్సి వచ్చింది. అది ఒక రాత్రిలా కాకుండా ఒక యుగంలా గడిచింది పావనికి. తెల్లవారు ఝామున అయిదు గంటలకు నిద్రలోకి జారుకుంది.

నిద్రనుంచి మేల్కొని కిటికీలోంచి చూస్తే సూర్యుడు నిప్పులు కక్కుతున్నాడు. మంచంపై నుంచి దిగి రెండు అడుగులు వేసింది. అలాగే తూలిపడిపోయింది. కిందికి దిగే శక్తి తనలో లేదని తెలిసి మళ్ళీ మంచంపై పడిపోయింది.

మళ్ళీ గంటలు, నిముషాల్ని లెక్కపెట్టడం! శ్రీకాంత్‌ను తలుచుకోవడం!

సాయంత్రం గడిచింది! దిక్కులేని చావు చావడం తప్పదు అనుకుంది. పావనికి మగతగా అనిపించి గాఢమైన నిద్రపట్టింది.

ఆ నిద్ర పావనిని కోమాలోకి తీసుకు వెళ్లింది.

* * *

వరంధామయ్యా బూతులు తిడుతూ వరండాలోకి ప్రవేశించాడు. తండ్రి వచ్చిన పదినిముషాల తర్వాత రమేష్ కూడా ఇంట్లోకి వచ్చాడు.

వడ్డీకి డబ్బు తీసుకుని, గడువు దాటినా తిరిగి ఇవ్వని ఒక ఆసామిని ఫర్లాంగ్ దూరం నుంచి ఊరు మొత్తం వినబడేలా తిట్టుకుంటూ వస్తున్నాడు. ఆ ఆసామికి రాజకీయ ప్రాబల్యం ఉంది. అతనిని అంత బాహాటంగా తిట్టడం రమేష్‌కు ఇష్టంలేదు. రమేష్ తండ్రి దగ్గరకు వెళ్ళి "ఆవేశంగా ఎందుకు అరుస్తావు? కొన్నిరోజుల తర్వాతైనా ఇవ్వకపోతాడా?" అని విసుక్కున్నాడు.

"గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందంట. నలభయి ఏళ్ళుగా సంసారం చేస్తున్నాను. ఇంత ఆస్తి సంపాదించాను. ఎలా మాట్లాడాలో నాకే చెబుతున్నావా? నేను చేసేపని ఇష్టంలేనప్పుడు, నీవు వేరే ఉండు, నీకాళ్లపైన నీవు నిలబడి బతుకు. ఈ ఆస్తి నా స్వార్జితం" అన్నాడు కోపంగా.

వరంధామయ్యా మాటలకు రమేష్‌కు కోపం ముంచుకువచ్చింది. విసురుగా కొట్టు దగ్గరకు వెళ్ళి సిగరెట్ తాగుతూ ఆలోచనల్లో పడ్డాడు. అయిదు నిముషాల తర్వాత ఇంటిదారి పట్టాడు.

మీనాక్షమ్మకు ఆత్రుతగా ఉంది. తను కనుగొన్న విషయం తండ్రి, కొడుకులకు చెప్పాలా? వద్దా? అన్న సందిగ్ధంలో పడింది. ఇద్దరి ముఖాలు నిప్పుకణికల్లా ఉన్నాయి.

కనుగొన్న విషయం ఎవరికైనా చెప్పలేకపోతే తలభారమై పగిలిపోతుందేమో అనిపించింది మీనాక్షమ్మకు.

కొడుక్కి చెప్పడానికి భయపడింది. "నోరు మూసుకుని మూలకు పడి ఉండక ఏదో చెప్పడానికి వచ్చింది" అని కసురుతాడు. పరంధామయ్యకు చెబితే ఊరంతా చాటింపు వేస్తాడు.

వరండాలోకి జొరబడిన కుక్కను తరుముతూ దానివెంట పడ్డాడు పరంధామయ్యా. కుంటుతూ మీనాక్షమ్మ అతని వెంట నడిచింది.

పరంధామయ్యకు మీనాక్షమ్మను చూస్తే చిరాకువేసింది. "నిండాతిని కాళ్ళు చాపుకుని కూర్చోవడం తప్పితే ఇంట్లోకి ఏదివచ్చినా పట్టించుకోవా ఏం?" కసురుకున్నాడు.

"కోడలు నీకు, నాకు పెట్టేలా ఉందా? ఆమె చేసిందంతా బాలయ్యకే సరిపోవడంలేదు! పొద్దటి నుంచి రామ... రామ.... నా నోటితో చెప్పలేను"

పరంధామయ్యా పని తొందరలో ఉన్నందున మీనాక్షమ్మ చెప్పేది వినిపించుకోలేదు. కొట్టు నుంచి తిరిగివస్తున్న రమేష్‌కు తల్లి మాటలు వినిపించాయి.

రమేష్‌లో కోపం తారాస్థాయికి చేరుకుంది. తల్లి దగ్గరకు వేగంగా వచ్చి "నీకు తిన్నది అరగడం లేదా ఏమి? ఊరికే కూర్చోలేక కోడలిమీద అభాండాలు వేస్తున్నావ్. ఇటువంటి విషయాలు బయటివాళ్ళు వింటే మనకెంత అప్రతిష్ఠ అన్న విషయం ఆలోచించావా?" అని కసురుకున్నాడు.

"ఉన్నమాటంటే ఉలకెక్కువట. నీ పెళ్లాం షోకునీ నెత్తికెక్కి కూర్చుంది. నీవెనుక అది ఎన్నెన్ని నాటకాలు ఆడుతుందో నీకు తెలియడం లేదు. ఎన్ని రంకులు సాగిస్తోందో నీకేం తెలుసు! చదువుకున్న ఆడపిల్లలు మన పల్లెటూరి వారికి తగరని నెత్తినోరు కొట్టుకున్నా విన్నావా? బాలయ్యకు జ్వరం వచ్చిందా? అంతావాడి నాటకం! ఈ రంకులాడి ఇవ్వాళ్ళ వాడిని ఇంటిదగ్గరే ఉండమని చెప్పినట్లుంది. ఇంట్లో ఎవ్వరూ లేనిది చూసి పెరటిగేటు తెరుచుకుని లోపలికి వచ్చాడు. ఇది స్నానంచేసి చీరైనా సరిగా కట్టుకోకుండా వాడిదగ్గరకు వచ్చింది. ఇకఇకలు పకపకలు! సినిమాల్లోలా ఒకరిపై ఒకరు పడుకోవడాలు! నాకేం తెలుసు ఈ భాగోతం ఎన్ని రోజులుగా నడుస్తోందో! మంచినీళ్ళు తాగుదామని వంటగది

లోకి వెళితే ఇదంతా కనిపించింది'' చేతులు తిప్పుతూ మీనాక్షమ్మ చెప్పింది.

''పిచ్చి పిచ్చిగా మాట్లాడితే గొంతు పిసికి చంపుతాను. దానిపైన ఏదో కోపం పెట్టుకుని, నాచేత కొట్టించాలని నీవు అల్లిన కథ ఇది''

''నీకు పెళ్ళాంమీద ప్రేమ ఉంటే మంచిదే కాని దారిలో పెట్టుకోక తప్పదు. నేను చెప్పే దంతా నిజం''

రమేష్‌కు నమ్మకం కుదరలేదు. తల్లి దేవుని పైన, భర్తపైన ప్రమాణం చేయడంతో రమేష్‌లో కోపం కట్టలు తెంచుకుంది. అప్పటికే తండ్రితో ఘర్షణ పడటం వలన రగులుతున్న కోపం ఇంకా తగ్గనేలేదు.

రమేష్ వంటగదిలోకి రావడం కమల చూడలేదు. ద్వారానికి రెండు చేతులు ఉంచి కమలవైపు తదేకంగా చూస్తూ ఉండిపోయాడు రమేష్.

అన్నం ముద్ద నోటిదగ్గరకు తీసుకునే సమయానికి రమేష్ కనిపించి కంపించిపోయింది కమల. అంత తదేకంగా అతను కమలవైపు ఎన్నడూ చూడలేదు.

''పైకిరా...'' అంటూ వేగంగా మేడపైకి వెళ్ళిపోయాడు.

కమలకు గుండెచేసే చప్పుడు వినిపిస్తోంది. చేయికడుక్కుని, మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ మేడపైకి వెళ్ళింది.

రమేష్ అసహనంగా కమల రాకకోసం మెట్లవైపు చూస్తూ ఉండిపోయాడు. కమల రూములోకి వచ్చి నిలబడుతూనే ఒక్కసారిగా ఆమెపైకి దూకి చెంప ఛెళ్ళుమనిపించాడు.

మరోసారి చెయ్యి ఎత్తబోయాడు. కమల మహంకాళిలా మారిపోయి అతని చెయ్యి పట్టుకుని - ''నీ ఇష్టం వచ్చినట్లుగా కొట్టడానికి నేను పశువును కాదు, నేను చేసిన తప్పేమిటో చెప్పకుండా కొట్టే అధికారం నీకు లేదు'' అంది కఠినంగా.

రమేష్ క్రూరంగా కమలవైపు చూస్తూ - ''బాలయ్యకు, నీకు ఉన్న సంబంధం?'' అన్నాడు.

రమేష్ అడిగేదేమిటో అవగాహన చేసుకోవడాని కొన్ని నిముషాలు పట్టింది కమలకు. కోపాన్ని అసహ్యాన్ని అంతరంగంలోనే అదిమిపట్టుకుని, ముఖంలో ఏమాత్రం ఆవేశాన్ని కనిపించనీయకుండా - ''ఎవరు చెప్పారు మా ఇద్దరికీ సంబంధం ఉందని?'' రమేష్ వైపు కళ్ళెత్తి చూడాలంటేనే అసహ్యం అనిపించి, నేలచూపులు చూస్తూ అడిగింది.

''మా అమ్మ''

''మీ అమ్మ సంగతి మీకు తెలియదా? ఎన్ని భయంకరమైన అబద్ధాలు ఆడుతుందో?''

''నిప్పులేందే పొగరాదు'' ఛీత్కారంగా కమలవైపు చూస్తూ అన్నాడు.

''మీ ఇంట్లో మనుషులు మనుషులు కాదు... సర్కస్ జంతువులు. మా నాన్న తెలియక ఈ జూలోకి నన్ను పంపించాడు. మీ కసిదీరా నన్ను పీక్కుని తినండి... మీ ఆకలి తీరేవరకు. నాపైన ఇటువంటి అభాండం వేసిన మీరు సర్వనాశనమైపోతారు'' అణిచిపెట్టుకున్న కోపాన్నంతా బహిర్గతపరచింది.

''రంకుతనం నేర్పిందేకాకుండా మమ్మల్ని నానామాటలు అనడానికి నీకెన్ని గుండెలు. నిన్ను నరికి ముక్కలు చేస్తాను'' అంటూ మూలకు ఉన్న దొడ్డుకర్రను తీసుకున్నాడు.

చలించకుండా నిలబడింది కమల. కండరాలన్నీ ఆవేశంతో బిగుసుకుపోయాయి. కళ్ళు నిప్పులు కురుస్తున్నట్లుగా ఉన్నాయి. శిరస్సు నుంచి వచ్చిన స్వేదంతో తడిసిన కుంకుమ నుదిటినిండా పరచుకుపోయింది.

ఆమె అతడిని కొట్టకుండా ఆపగలిగి ఉండేదే, కాని అతను జీవితాంతం వరకు పశ్చాత్తాపపడేందుకే అవకాశాన్నిచ్చింది.

కమలకు దెబ్బలు తనమీదపడటం శారీరకంగా దుర్భరంగా ఉన్నా మానసికంగా సుఖంగా ఉంది. ఒక్కొక్క దెబ్బే ఆలుమగలు అనే పవిత్ర బంధపు ముడులు విప్పుతోంది. మానసికంగా స్థిరపడివున్న ఆమెను ఆ దెబ్బలు ఏమీ చేయలేకపోయాయి. దెబ్బలుపడిన స్థానంలో శరీరం కందిపోయింది తప్పితే, ఏ బంధం పవిత్రమైనదని, కలకాలం కలిసి ఉండాలని వేదఘోషతో కలిపారో ఆ బంధం సంపూర్తిగా విడిపోయింది.

శరీరంపైన అంగుళం భాగాన్నికూడా విడ వకుండా కొట్టాడతను. బతుకుతుందా, చనిపో తుందా అన్న ఆలోచనకూడా చేయలేదు. కొట్టి కొట్టి అలసి కిందికి వెళ్ళిపోయాడు రమేష్.

కమల శరీరం ఎర్రగా కమిలిపోయింది. కళ్ళు వాచిపోయాయి. ముక్కులోంచి రక్తం ధారాపాతంగా కారుతోంది. పెదవులు చిట్లి రక్తం చుబుకంపైకి జారుతోంది కాని కమల మనసుకు ప్రశాంతత లభించింది. ఇన్నిరోజు లుగా హాలాహలాన్ని గొంతులోనే దాచుకుని బాధపడింది. రమేష్ దెబ్బలకు ఆ హాలా హలం పూర్తిగా దిగిపోయింది.

శరీరపు బాధ భరించలేక ఏడ్చింది. మన ను వెళుతున్న మార్గాన్ని తలుచుకుని నవ్వింది. ఒకక్షణంలో బాధ, మరోక్షణంలో స్వే చ్ఛ అనుభవించాలి అన్న భావనతో సంతోషం.

కమల పిచ్చిదైపోయింది. కొంతసేపు నవ్వింది బిగ్గరగా. కొంతసేపు బిగ్గరగా ఏడ్చింది. పిచ్చిదానిలా గది అంతా తిరిగింది. తను చేయబోయే పనికి తనకే స్వాంతన కుదరలేదు.

కొన్నిగంటల తర్వాత స్థిరమైన నిశ్చయాని కి వచ్చింది. ఆలోచనలతో మండిపోతున్న మెదడు విశ్రాంతి కోరింది శారీరక బాధల్ని కూడా లెక్కచేయకుండా.

★ ★ ★

ఆకర్షణతో ఉట్టిపడే వర్చస్సు. ఆరడుగుల ఎత్తు. ఎత్తుకు తగినట్లుగా శరీర అవయవాల న్నీ పొందికగా ఉన్నాయి. ముప్పయి అయిదు సంవత్సరాల వయసున్నా ముప్పయి సంవత్స రాలని నమ్మేవిధంగా ఉన్నాడతను.

గంభీరత తెచ్చిపెట్టే కళ్ళద్దాలు ముఖానికి వన్నె కూడా తెచ్చాయతనికి. బ్లూ కలర్ ఫుల్ షర్ట్, వైట్‌కలర్ ప్యాంట్‌తో టక్‌చేశాడు.

మెరిసిపోతున్న మాస్. మెడలో సన్నటి



వైన్, మెరుస్తున్న గోల్డ్‌చైన్ రిస్ట్‌వాచ్. ఎడమ చేతి వేలికి ఉన్న ఉంగరపు కెంపుల తళుకులు దూరంగా ఉండేవారికి కూడా కనిపిస్తున్నాయి.

ముందుగది పరదాను తోసుకుని వచ్చిన అతడిని చూసి వాసుతో చెస్ ఆడుతున్న సరోజ చటుక్కున మధ్యగదిలోకి వెళ్ళిపోయింది!

వాసు నమస్కారాలను స్వీకరించి, కుర్చీలో కూర్చుండిపోయాడు శ్రీధర్. టేబుల్‌పైన ఉన్న చెస్‌బోర్డ్‌ను చూసి "నీవు చెస్ ఆడతావా వాసూ" అంటూ మెచ్చుకోలుగా అతనివైపు చూశాడు.

"ఆడతానండి... అక్కకు కూడా బాగావచ్చు. మొదట మంచిస్టెప్స్ తీసుకుని, ఆఖర్నమాత్రం కావాలనే రాంగ్‌స్టెప్స్ తీసుకుని నేను గెలిచేలా చేస్తుంది" అన్నాడు వాసు.

"నీలో చెస్ అంటే మరింత ఉత్సాహం రావడానికి నిన్ను గెలిపిస్తుంది. ఎప్పుడూ ఓడిపోతూ ఉండటంవలన మనిషిలో ఉత్సాహం చచ్చిపోతుంది" కొంచెం గట్టిగానే అన్నాడు శ్రీధర్- లోపలి గదిలో ఉన్న సరోజకు వినిపించేలా.

అలమారాలోఉన్న క్లాస్ పుస్తకాలను తీసుకు వచ్చాడు వాసు.

పదిహేను నిముషాలు ట్యూషన్ చెబుతూనే కాఫీ కప్పులతో ముందుగదిలోకి ప్రవేశించింది సరోజ.

వాసు అక్క చేతుల్లోని ట్రేని అందుకని మాస్టారు ముందు నిలబడ్డాడు. శ్రీధర్ కాఫీ కప్పు తీసుకున్నాడు.

ముందురోజు సరోజ, వాసుల మధ్య ఘర్షణ జరిగింది. మాస్టారు ఫీజు ఎంతో కనుక్కోమని సరోజ చెప్పింది. మాస్టారు చాలా మంచివారు, నాకు అడగడానికి సిగ్గుగా ఉందని వాసు అన్నాడు. సరోజకు మరోమార్గం తోచలేదు. సిటీకి వచ్చిన తర్వాత అందరితోనూ ఫ్రీగా మాట్లాడటం అలవాటుచేసుకుంది. ట్యూషన్ ఫీజు విషయంపై రాద్ధాంతం చేయకుండా తనే అడగడానికి పూనుకుంది. మామూలుగా కాఫీ ఇవ్వడానికి అయితే వాసును కేకవేస్తే వంటగదిలోంచి తీసుకుని వెళ్ళేవాడు.

కాఫీ సిప్‌చేస్తున్న శ్రీధర్‌ను చూసీ, చూడనట్లుగా చూసింది సరోజ. అతిజాగ్రత్తగా ఆమె వైపు చూస్తూకూడా ఏమాత్రం చూపులు కలిసి దొరికిపోయే అవకాశాన్ని కల్పించుకోలేదు శ్రీధర్. 'ఫస్ట్ ఇంప్రెషన్ ఎవర్‌లాస్ట్' అన్నానుడి గుర్తుకు వచ్చింది.

మొదటిచూపులోనే శ్రీధర్ అంటే సదభిప్రాయం ఏర్పడింది సరోజలో. "మీ ఫీజు చెబితే... ఇక్కడ మొదటే ట్యూషన్ ఫీజు ఇవ్వడం రివాజని వాసు అన్నాడు" సన్నటి స్వరంతో మెల్లగా అంది సరోజ.

సరోజ మాటలకు ఉలిక్కిపడి తలఎత్తి ఆమె వైపుచూసి క్షణంలో సర్దుకుని, "ఫీజు విషయంలో తొందరేమొచ్చిందండి? ముందు వాసు సబ్జెక్ట్ నేర్చుకోవడం ముఖ్యంకదా? వాసు సబ్జెక్ట్ నేర్చుకున్న తర్వాత నేనే అడుగుతాను. మీరేం బెంగపెట్టుకోకండి"

సరోజ మౌనంగా చిరునవ్వు నవ్వుతూ ఉండిపోయింది.

"మీరు చెస్ బాగా ఆడతారని వాసు చెప్పాడు" నవ్వుతూ అడిగాడు.

"ఏదో ఊసుపోక ఆడతానండి... చాంపియన్ని ఏమీకాదు" అంది సరోజ.

ఓసారి వాచీ చూసి ఆ తర్వాత ఆమె కళ్ళలోకి చూసి "ఇక వస్తానండి" అన్నాడు శ్రీధర్.

శ్రీధర్ పరదా తోసుకుంటూ, బయటకు వెళ్ళిపోయేవరకు చూస్తూ ఉండిపోయింది సరోజ.

మర్నాడు

శ్రీధర్ వాచీ చూస్తూ వీక్లీలను చకచకా తిప్పివేస్తూ వాసు రాకకోసం ఎదురుచూస్తున్నాడు. ట్యూషన్ మొదలుపెట్టి అయిదురోజులైనా కాలేదు, అప్పుడే వాసుకి బోర్ అనిపించిందా ఏం? అనుకున్నాడు.

చెస్ బోర్డ్‌పైకాయిన్స్‌అరేంజ్‌చేసి, రెండు వైపులా తనొక్కడే ఆడటం సాగించాడు శ్రీధర్.

ముందుగదిలోకి వచ్చిన సరోజ, శ్రీధర్‌కు నమస్కారం చేసి "మా అన్నయ్య వాసును ఎవరో ఫ్రెండ్ ఇంటికి పంపాడు. ట్యూషన్




టైమ్‌కు రావాల్సిందే! సిటీబస్‌లు....''

సరోజ వాక్యం పూర్తికాకుండానే ''ఈ సమయంలో సిటీబస్‌లు నిండుగర్భిణీ స్త్రీలలా ఉంటాయి'' అన్నాడు శ్రీధర్.

శ్రీధర్ మాటలకు సరోజ నవ్వు ఆపుకోలేకపోయింది. శ్రీధర్ చెస్ ఆటను చూస్తూ ఉండిపోయింది.

సరోజ నిలబడి ఉండటంచూసి ''మైగాడ్... నిలబడే ఉన్నారే, కూర్చోండి. మీ ఇంట్లో మీకే అతిథి మర్యాదలేమిటని ఆశ్చర్యపోకండి'' శ్రీధర్ సరోజ కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

శ్రీధర్ మాటల్లో కృత్రిమత్వం లేదు. ఆత్మీయతాభావం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది. పది మాటలుకూడా మాట్లాడుకోకుండానే పది సంవత్సరాల పరిచయస్తునిలా శ్రీధర్‌తో సన్నిహితత్వం ఏర్పడినట్లు తోచింది సరోజకు.

శ్రీధర్ పక్కనేఉన్న కుర్చీ జరుపుకుని కూర్చుంది సరోజ. ''మీకు అభ్యంతరం లేకపోతే మనిద్దరం చెస్ ఆడదాం''

శ్రీధర్ మాటలకు సరోజ సమ్మతంగా తల పంకించడంతో మళ్ళీ కాయిన్స్‌ను క్రమంలో పేర్చాడు శ్రీధర్.

శ్రీధర్ మొదట వేసిన స్టెప్స్ మామూలుగా అనిపించినా, అలా ఎందుకోసం వేశాడో తర్వాత తెలిసింది సరోజకు. సోల్జర్స్ విని యోగం ఎక్కువ శ్రీధర్ ఆటలో. దేనినీ చంపకుండా 'చెక్' చెప్పాడు.

'ఎక్సలెంట్' అన్నమాట విని ఇద్దరూ ఆశ్చర్యంతో తలఎత్తి చూశారు. వాసు చప్పట్లు కొడుతూ కనిపించాడు.

సరోజ కుర్చీలోంచి లేచి నవ్వుతూ ''మీతో గెలవడం చాలా కష్టమండీ'' అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

* * *

సాయంత్రం అయిదు గంటలు దాటినా వాసు రాకపోవడంతో ద్వారం దగ్గర నిలబడి చూస్తూ ఉండిపోయింది సరోజ. కొంతసేపట్లోనే వాసు దూరం నుంచి రావడం గమనించి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

''అక్కా''

వంటపనిలో ఉన్న సరోజ తలఎత్తి వాసు వైపు చూసి ఆశ్చర్యపోయింది. బుగ్గగీసుకుపోయి ఎర్రగా అయింది. మోచేతులకుకూడా గాయాలయినాయి.

వాసుని దగ్గరకు తీసుకుని బుగ్గనుంచి స్రవిస్తున్న రక్తాన్ని తుడిచింది. ''ఏమిట్రా ఇదంతా?'' ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

''బస్సు వెళుతున్నా క్రాస్‌లో దిగడం అలవాటు. ఎప్పుడూ అలాగే దిగేవాణ్ణి, ఇవ్వాళ్ళ స్లిప్‌అయి పడిపోయాను'' ఏడుపు గొంతుతో అన్నాడు వాసు.

వాసు ఎడమచేతిని పట్టుకుని మోచేతి నుంచి స్రవిస్తున్న రక్తాన్ని తుడవబోయింది సరోజ. వాసు బాధతో విలవిలలాడిపోయాడు.

సరోజ కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. మోచేతి ఎముక విరిగిందా ఏం? ఇప్పుడేం చేయాలి? శ్రీనివాస్ రాత్రి ఎనిమిది గంటలదాకా రాడు! తెలిసిన డాక్టర్లుకూడా లేరు!

తలికిడి కావడంతో ముందుగదిలోకి వెళ్ళారు ఇద్దరూ! శ్రీధర్ కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

ఆ ఇద్దరి పరిస్థితిచూసి ఆశ్చర్యపోయాడు శ్రీధర్.

జరిగిందంతా తెలుసుకుని ''ఈమాత్రానికే మీరు కంటతడిపెట్టాలా? నాకు తెలిసిన ఆర్థోపెడిక్ సర్జన్ ఉన్నాడు. ప్లాస్టరింగ్ చేయించి తీసుకువస్తాను'' అంటూ ఆటోకోసం బయటికి వెళ్ళాడు.

శ్రీధర్, వాసు ఆటోలో వెళ్ళిపోతూనే సరోజ మనసంతా ఎలాగో అయింది. ఏం చేయాలో తోచక ద్వారం దగ్గర నిలబడిపోయింది.

రెండుగంటల తర్వాత శ్రీధర్ వాసుని ఇంటికి తీసుకువచ్చాడు. వాసు చేతికి బ్యాండేజ్, చెంపకు ప్లాస్టర్ ఉన్నాయి.

వాళ్ళిద్దరినీ చూస్తూనే సరోజ ఆత్రుతతో ''ఎముక తొందర్లోనే అతుకుతుందని చెప్పారా డాక్టర్?'' అంది.

''నెలరోజుల్లోనే మామూలుగా అవుతాడు. మీరు కంగారుపడకండి'' ఓదార్పుగా అన్నాడు శ్రీధర్.

సరోజ సంతృప్తిగా ఊపిరి పీల్చుకుని ''మీరు చాలా శ్రమపడ్డారు. మీ రుణం ఎలా

తీర్చుకోవాలో తెలియడం లేదు... భోజనం చేసి వెళ్ళండి" అంటూ అతని సమాధానానికికూడా ఎదురుచూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

డైనింగ్ టేబుల్‌పైన అన్నీ అమర్చింది. వాసు పిలుస్తూనే డైనింగ్ రూమ్‌లోకి వచ్చి తినడానికి ఉపక్రమించాడు శ్రీధర్.

వాసు చేతికి బ్యాండేజ్ చేయించడానికి ఖర్చెంతయిందో కనుక్కుని డబ్బు ఇవ్వాలను కుంది సరోజ. కొంత తటపటాయిస్తూనే, "ప్లాస్ట రింగ్‌కు ఖర్చు ఎంతయిందో చెబితే..." అంది.

శ్రీధర్ ఒక్కసారిగా తినడం ఆపివేసి సరోజ వైపు చూశాడు. "మీరు నన్ను ఇంకా సరిగా గుర్తించలేదన్న మాట... మీరన్నమాటే నేనూ అంటే? భోజనానికి ఎంత అవుతుందో చె బితే..." అని నవ్వి కొంతసేపు మౌనంగా ఉండి మళ్లీ తినడం సాగించాడు. ఆ తర్వాత "నాకు తెలిసిన డాక్టరే. నా ప్రాణమిత్రుడు. నా దగ్గర ఒక్కరూపాయి ఫీజుకూడా తీసుకోలేదు" అంటూ ఖాళీ ప్లేటు చూపిస్తూ "కొంచెం అన్నం పెడతారా?" అన్నాడు.

శ్రీధర్ చొరవకు నవ్వుకుని ఖాళీ రైస్ బేసిన్‌లో అన్నం నింపి తెచ్చి అతని ముందుంచింది.




జ్యోతి కళ్ళు తెరుస్తూనే పక్కనే శవంలా హాయిగా పడుకుని ఉన్న మోహన్ కనిపించా డు. ఆమె శరీరం అంతా పుండులా అయింది. బుద్ధి తెలిసినప్పటి నుంచి ఎవ్వరూ చిన్న దెబ్బ కూడా కొట్టలేదు. కొట్టడమే కాదు- తిట్ట డంకూడా జరగలేదు. ఇంత వరకట్నం ఇవ్వడం మోహన్ చేత దెబ్బలు తినడానికేనా? నిద్రలో ఉన్న మోహన్ గొంతు నులిమి చంపివేయాలనిపించింది జ్యోతికి. మగతగా ఉండటంతో మళ్ళీ నిద్రపోయింది.

నిద్ర లేస్తూనే టైంపీస్ వైపు చూసింది- తొమ్మిది గంటలు దాటుతోంది. మెల్లగా బాత్ రూమ్‌లోకి వెళ్ళి స్నానాదులు ముగించుకుని డైనింగ్ హాల్‌లోకి వచ్చింది. వంటమనిషి రాజ మ్మతో కాఫీ పెట్టమని చెప్పి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుండిపోయింది. పదిహేను నిము షాలైనా రాజమ్మ కాఫీతో రాలేదు. కిచెన్‌లోకి వెళ్ళి"కాఫీ తేలేదేం రాజమ్మా" అని అడిగింది.

"తెస్తానమ్మా అలా తొందరచేస్తే ఎలా అవుతుంది" విసుక్కుంది రాజమ్మ.

కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యంగా రాజమ్మ వైపుచూసింది కోపంతో. కాఫీ తాగకుండానే రూములోకి వెళ్ళిపోయింది. గంట తర్వాత పనిమనిషి కృష్ణయ్యకు టిఫిన్‌పైకి తీసుకుర మ్మని చెప్పింది.

గంటదాటినా టిఫిన్ రాలేదు. ఇక ఆగలేక కిందికి వెళ్ళి రాజమ్మను నిలదీసింది.

"అందరూ టిఫిన్ చేసి వెళ్ళారమ్మా... మిగల లేదు" అంది రాజమ్మ.

"గంటముందు కృష్ణయ్యను పంపించాను కదా?" అడిగింది కోపంగా.

"కృష్ణయ్య నాదగ్గరికే రాలేదే..." అంటూ జ్యోతి ఎదురుగా నిలబడకుండా దూరంగా వెళ్ళిపోయింది రాజమ్మ.

గదికి వెళ్ళి బిస్కెట్స్ ఉంటే అవే ఫలహా రంగా తీసుకుంది. రాత్రి జరిగిన సంఘటన కళ్ళముందు కదలాడి మనసంతాఎలాగోఅయి పోయింది. గదిలో కూర్చోలేక మిత్రురాలు వసంత ఇంటికి వెళ్ళడానికి నిశ్చయించు కుంది.

వసంతతో కలిసి మార్నింగ్‌షో చూసి ఇంటి కి వచ్చింది జ్యోతి. డైనింగ్ హాల్‌లోకి వెళ్ళి చేతులు కడుక్కుని డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుండిపోయింది. ఎంతసేపటికీ రాజమ్మ రాకపోవడంతో కిచెన్‌లోకి వెళ్ళింది.

"పది నిముషాలుగా నేను టేబుల్ దగ్గర కూర్చుని ఉన్నా కనిపించడం లేదా నీకు?" విసుక్కుంది జ్యోతి.



# మాటలకందని మధురక్షణంలో...

అదివారి మొదటి రాత్రి.

ట్యూబ్‌లైట్ల కాంతి తెల్లని పాలవెన్నెలలా గదంతా పరచుకుంది.

అగరవత్తుల సువాసనలు గాలిలో చేరి గదినంతా అలవోకగా ఆక్రమించుకుంటు న్నాయి. గది మధ్యలో వేసిన మంచం, దానిమీద పరిచిన తెల్లని దుప్పటి పాలసముద్రంలో పూలపడవలా మనోహరంగా వున్నాయి.

పక్కనే వూరూరించే పళ్ళు, మిఠాయిలూ...

పెళ్లికొడుకు గోపాలకృష్ణ క్షణమొక యుగంగా భార్య ఆగమనానికి ఎదురు చూస్తున్నాడు.

అప్పుడే గదిలోకి అడుగుపెట్టిన రామలక్ష్మి కళ్లెత్తి గదివంతా ఒక్కసారి కలయచూసింది.

ఆమెలో ఏదో తెలియని ఖంగారు, నిరుత్సాహం...

అక్కడి అలంకరణలన్నీ తన వ్రతభంగానికి ఆహ్వానాలుగా గోచరించాయి.

భర్త సన్నిధిలో సర్వప్రపంచాన్ని మరిచిపోవలసిన ఆ మధురవేళలో ఆమె చేయబూనిన వ్రతమేమిటి?

అది నెరవేర్చుకోడానికి ఆమె చేసిన ప్రయత్నం ఫలించిందా?

కె. గోదావరిశర్మ రాసిన తెలుగుకథ

జనవరి **విపుల** లో చదవండి

రాజమ్మ అటూ ఇటూ చూసి ఎవ్వరూ లేకపోవడంతో, "అమ్మా... నీవు గొప్పింటి బిడ్డవు! నేనా పూటకు గడవనిదానిని! నీతో వైరం పెట్టుకోవాలని ఉంటుందా నాకు? అంతా నీ దురదృష్టమమ్మా! పెద్ద అమ్మగారు మీకు ఏదీ ఇవ్వడానికి వీలులేదని చెప్పారు! అసలు మిమ్మల్ని పట్టించుకోనేకూడదట? ఆమె చెప్పినదానికి వ్యతిరేకంగా ఏమాత్రం చేసినా నన్ను ఉద్యోగంలోంచి తీసివేస్తానని కూడా అన్నారు..." అంది దిగులుగా

జ్యోతి కాళ్ళకింద భూమి కంపించినట్లయింది. వేగంగా గదిలోకి వెళ్ళి బెడ్‌పైన పడిపోయి కరవుదీరా ఏడ్చింది. ఈ పరిస్థితిలో తన కర్తవ్యం ఏమిటి? ఎంతగా ప్రశ్నించుకున్నా బోధపడటం లేదు.

మోహన్‌కు కారుపిచ్చిపట్టేలా పరిస్థితులను కల్పించాడు మామగారు. మరోవైపునుంచి అత్తగారు నరుక్కుంటూ వస్తున్నారు. మోహన్ తనను చంపడానికి కూడా వెనుకాడడు. కొన్నాళ్ళు ఇలాగే గడిస్తే చంపేస్తాడు. నాకేం తెలియదని తప్పించుకుంటాడు కూడా!

తండ్రి దగ్గరకు వెళ్ళి కారు తీసుకురావాలి! మరో గత్యంతరం లేదు! ఏముఖంపెట్టుకుని వెళ్ళాలి?

దీనికోసం తనను ఇంత ఘోరంగా అవమానించడమా! దీనికంటే గుక్కెడు విషం ఇచ్చినా నయంగా ఉండేదే.

పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడిలా ఉంది పరిస్థితి! అభిమన్యుడు వీరమరణం పొందాడు. మరి తను కుక్క చావు చావవలసిందేనా?

★ ★ ★

శ్రీకాంత్ టీచింగ్ విధానం నచ్చిన ప్రిన్సిపల్ మరో రెండువందలు జీతం పెంచాడు. ఓవర్‌టైమ్‌కూడా కలిపితే నెలకు వెయ్యి రూపాయలదాకా అవుతోంది.

మూడు వందలు వచ్చినా సర్దుకుపోగలనని అంది పావని. వెయ్యి రూపాయలతో తృప్తిగా బతకలేదా?

పావనిని తొందరగా వైజాగ్ తీసుకురావాలి. పావని, తను ప్రశాంతమైన ప్రదేశంలో చిన్నఇల్లు తీసుకొని జీవితాన్ని సాఫీగా కొనసాగించాలి.

సుఖానికి నిర్వచనం పావని. జీవితంలో మరేదీ లభించకున్నా పావనిని తనకు ఇచ్చినందుకు ప్రకృతికే తను ఎప్పుడూ రుణపడి ఉంటాడు!

"టెలిగ్రామ్" అంటూ పోస్ట్‌మాన్ తలుపుతడుతూనే దిగ్గున లేచి తలుపుతెరిచాడు శ్రీకాంత్.

సంతకం చేసి టెలిగ్రామ్ తీసుకున్నాడు. కవర్ విప్పుతూనే "పావని సీరియస్... "స్టార్ట్ ఇమిడియట్లీ రామారావు" అని ఉంది.

శ్రీకాంత్ కళ్ళు తిరిగాయి. అలాగే పక్కనే ఉన్న బెడ్‌పై శూన్యమనస్సుతో కూర్చుండిపోయాడు. మెల్లమెల్లగా గుండె దిటువుపరచుకుని క్షణంలో డ్రెసప్ అయ్యాడు. రూమ్‌కు తాళంవేసి, రిక్షాకోసం చూస్తే కనుచూపుమేరలో ఎక్కడా కనిపించలేదు. బస్‌స్టాండ్ కేసి నడక సాగించాడు.

బస్‌లో కూర్చున్నా మనసంతా శూన్యంగా అనిపించింది శ్రీకాంత్‌కు. పుట్టింటినుంచి ఇంత త్వరగా పావని అత్తవారింటికి రావడం ఏమిటి? సీరియస్ అయిపోవడం ఏమిటి? అసలు తనులేకుండా ఆ నరకకూపంలోకి పావని ఎలా వచ్చింది? తెలిసి తెలిసి నిప్పుల్లో కాలు ఎలా పెట్టింది? వీళ్ళంతా కలిసి పావనిని ఏమైనా చేశారా?

బస్సుదిగి రిక్షా మాట్లాడుకున్నాడు ఇంటికి. రిక్షా ఇంటికి చేరగానే పరుగుపరుగున ముందుగదిలోకి వెళ్ళాడు. ముప్పయిమంది దాకా ఉన్నారా గదిలో. తల్లిదండ్రుల కళ్ళు ఏడ్వడంవలన ఉబ్బివున్నాయి. తమ్ముడు, చెల్లెలు వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

అందరూ కనురెప్పలు కూడా కదల్చకుండా శ్రీకాంత్‌వైపు చూస్తున్నారు.

శ్రీకాంత్‌కు ఒక్కసారిగా గుండెవేగం హెచ్చింది. తన గుండెచప్పుడు తన చెవులకే వినిపిస్తోంది.

"పావని ఏదీ?" తల్లిదండ్రులవైపు చూసి ప్రశ్నించాడు శ్రీకాంత్.

అతని ప్రశ్నకు ఎవ్వరూ సమాధానం చెప్ప

లేదు.

డాబాపైనుంచి నలుగురు స్త్రీలు దిగివస్తున్నారు. శ్రీకాంత్‌కు పరిస్థితి ఏమాత్రం అర్ధంకాలేదు. డాబాపైకి పరుగుతో వెళ్ళాడు.

పావని మంచంపైన కాకుండా కిందే పడుకునివుంది. నిండా బ్లాంకెట్ కప్పబడివుంది. గది కిరోసిన్‌వాసన, బట్టలు కాలిన వాసన.

అక్కడ నిలబడినవాళ్ళు కళ్ళు వెడల్పు చేసుకుని శ్రీకాంత్‌వైపు చూస్తున్నారు.

పావని కళ్ళు మూసుకుని ప్రశాంతంగా పడుకుని వుంది. మోకాళ్ళపై ఆమెరు దగ్గరగా కూర్చున్నాడు. మెల్లగా "పావనీ ... నేను - శ్రీకాంత్‌ను వచ్చాను, కళ్ళు తెరువు" అన్నాడు.

ఏమాత్రం కదలికలేదు పావనిలో.

మరోసారి పిలిచాడు.

అక్కడే ఉన్న ముసలమ్మ "మన లోకంలో ఉంటేగా నాయనా పలకడానికి?" అంది.

శ్రీకాంత్ అర్ధంకానట్లుగా ఆమెవైపు చూశాడు.

ముసలావిడ ముందుకువచ్చి పావనిపై కప్పివున్న బ్లాంకెట్‌ను ఒక్కసారిగా తొలగించింది.

శ్రీకాంత్ అవాక్కయిపోయాడు. ఒక్కసారిగా "పావనీ" అన్నాడు గొంతు పగిలిపోయేలా. చలిజ్వరం ఆవహించినట్లుగా వణికిపోయాడు. శరీరం ప్రకంపించింది షాక్‌ను తట్టుకోలేక. శక్తినంతా కూడదీసుకుని నిలదొక్కుకోవలసి వచ్చింది.

పావని శరీరం నల్లగా కమిలిపోయివుంది. ఎక్కువగా కాలడంవలన అక్కడక్కడా అట్టలుగా లేచి వచ్చింది చర్మం. అంగాలన్నీ వికృతరూపం దాల్చాయి. ఒకవిధమైన వాసన చుట్టుపక్కలకు వ్యాపించింది కాలిన చర్మంనుండి.

అతని కళ్ళలో దుఃఖంలేదు. మనసులో విషాదంలేదు. అపారమైన ప్రేమవాహినిలో ఓలలాడించిన పావనిని ఆ పరిస్థితిలో చూసి స్థంభించిపోయాడు. మనసు, శరీరంలేని ప్రాణిలా అచేతనావస్థలో వుండిపోయాడు.

కొన్నిక్షణాల్లోనే పరిసరజ్ఞానం కలిగిందతనికి. పావనిని ఆ స్థితిలో చూసి దుఃఖానికి ఆనకట్ట వేయలేకపోయాడు. అలాగే పావని శరీరానికి పెనవేసుకుపోయాడు. కాలిన శరీరం అతనికి అసహ్యంగాలేదు. తనను సుఖపుటుయ్యాలలో ఊగించిన ఆ శరీరంలాగే కనిపించింది. ఆమె శరీరాన్ని ముద్దులతో నింపాడు. అతని ముద్దులతో బొబ్బలు చిట్లి నీళ్ళు స్రవిస్తున్నాయి.

అక్కడివారంతా అవాక్కయి ఆ సంఘటనను చూస్తూ వుండిపోయారు.

★ ★ ★

ముందుగది ద్వారం దగ్గర నిలబడి ఉన్న సరోజ శ్రీధర్ వెంట సుమారు అరవై సంవత్సరాల వయసుగల స్త్రీ రావడం చూసి ఆశ్చర్యపోయింది.

సరోజ వారిని సాదరంగా ఆహ్వానించింది. శ్రీధర్ ఆమెను సరోజకు పరిచయం చేశాడు. శ్రీధర్ తల్లి ఆమె.

"మిమ్మల్ని చూద్దామని నేనే రావాలనుకున్నానండి! మావాడు మీగురించి ఎంత పొగుడుతాడో చెప్పలేను! మా అమ్మను మరిపించారట మీరు! మీరే నన్ను వెతుక్కుంటూ వచ్చారంటే ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో తెలియడంలేదు..." అంది సరోజ.

ఆ వినయానికి ఆశ్చర్యపోయింది రాధమ్మ. సరోజని తన్మయత్వంతో చూస్తోంది.

"దానిదేముందమ్మా ... స్నేహానికి వయసుతో నిమిత్తంలేదు. మా శ్రీధర్ రోజూ నీగురించి చెప్పడమే ... నిన్ను పొగడటమే" అంది.

మార్కెట్‌కు వెళ్ళి వచ్చిన వాసు రాధమ్మను చూస్తూనే "మీరు మా ఇంటికి వస్తున్నట్లు ఒక్కసారికూడా నాతో అనలేదు" అన్నాడు.

రాధమ్మ నవ్వుతూ "చెబితే ఏంచేసేవాడివి అబ్బాయ్?" అంది.

శ్రీధర్, సరోజ నవ్వుకున్నారు.

శ్రీధర్ అలవాట్లగురించి రాధమ్మ, వాసు చిలిపితనం గురించి సరోజ కొంతసేపు ముచ్చటించుకున్నారు.

"మీకు మనమలు మనమరాళ్ళు లేరా?"

నరోజ హటాత్తుగా అడిగింది.

రాధమ్మ ముఖం ముడుచుకుపోయింది. "నాకు ఉన్నది ఒక్కగానొక్క కొడుకు - వీడే! శ్రీధర్‌కు ఎనిమిది సంవత్సరాల వయసున్నప్పుడు అతని తండ్రి చనిపోయాడు. నేనే ఏవేవో కష్టాలుపడుతూ వీడిని చదివించాను. ఉద్యోగం దొరుకుతూనే పెళ్లిచేశాను. కోడలు బంగారుబొమ్మలా ఉండేది. పేరు సీత. వీళ్ళిద్దరి అన్యోన్యంతో ఇల్లు కళకళలాడిపోయేది. విధి వక్రించి సీత బ్రెస్ట్‌కాన్సర్‌తో ఈ లోకంనుంచే నిష్క్రమించింది. సీత చనిపోయి ఆరేళ్ళు అవుతున్నా, మా కళ్ళముందు కదలాడుతూనే వుంది" కళ్ళనీళ్ళు తుడుచుకుంది రాధమ్మ.

టీ తాగి వెళ్ళిపోయారు శ్రీధర్, రాధమ్మ.

ఆరోజు ఆదివారం వాసు అన్న శ్రీనివాస్‌తో కలిసి మ్యాట్నీ సినిమాకు వెళ్ళాడు. సరోజకు సినిమాలు చూడటం ఇష్టం వుండదు. శ్రీనివాస్, వాసు ప్రాధేయపడినా సినిమాకు వెళ్ళడానికి అంగీకరించలేదు సరోజ. ఆమె గతజీవితమే లక్ష్మణరేఖలా ముందుకు సాగనివ్వడంలేదు. దుఃఖం ముఖంలో కనిపించకున్నా అంతరంగం అల్లకల్లోలమైపోయింది. బద్దలవబోయే అగ్నిపర్వతంలా వుంది ఆమె అంతరంగం.

బూట్ల చప్పుడు వింటూనే ముందుగదిలోకి వచ్చింది.

శ్రీధర్ కుర్చీలో కూర్చుని వున్నాడు.

సరోజను చూస్తూనే "వాసులేడా?" అని అడిగాడు శ్రీధర్.

సమాధానం చెప్పింది సరోజ.

"నాకు బోర్ అనిపించి వాసును తీసుకుని షాపింగ్‌చేసి, ఫస్ట్‌షో సినిమా చూసి రావాలని అనుకున్నాను"

"కాఫీ తీసుకువస్తాను" అంటూ కిచెన్‌లోకి వెళుతున్న సరోజను వారించి "మా అమ్మగారికి ఇచ్చిన మాటను మరిచిపోయినట్లున్నారు" అన్నాడు శ్రీధర్ సరోజవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ.



సరోజకు అర్థమవడానికి కొన్ని సెకన్లు పట్టింది. రాధమ్మగారు తన ఇంటికి రమ్మని ఆహ్వానించడం. మాటవరసకు తను సమ్మతించింది.

సరోజ మౌనంగా వుండిపోయింది. శ్రీధర్‌తో ఎక్కువగా మాట్లాడాలంటే ఆమెకు సిగ్గుగా వుంది. శ్రీధర్ ముందు ఏవిధమైన ఆలోచనలు రావు. మనసు ప్రశాంతంగా వుంటుంది. శ్రీధర్ అంటే ఏదో తెలియని ఆకర్షణ ఏర్పడింది.

"మీరొక్కరే ఉన్నట్లున్నారు. వాసు వుంటే మిమ్మల్ని ఇంటికి తీసుకెళ్ళేవాడిని"

సరోజ నవ్వుని ముఖంలో కనిపించనీయకుండా లోలోపలే నవ్వుకుంది. నవ్వుని అణచుకుంటే శరీరం అంతటా వ్యాపించి ఒకవిధమైన మానసిక ఉత్తేజాన్ని కలిగిస్తుంది.

"ఎంతటి ఆత్మాభిమానం ఉన్న మగవాడైనా అందమైన స్త్రీముందు మనసును అదుపులో వుంచుకోలేడు అనుకుంది. శ్రీధర్ ఇంట్లోకి రావడానికి కారణం సమంజసమైనదే! అంతర్లీనమైన కోరిక మరొకటి. అంతర్లీనమైన కోరిక ఏక్షణంలోనైనా మనిషి గౌరవాన్ని కించపరచే ప్రమాదముంది. వాసుతో సినిమాకు వెళతానన్నాడు. రెండు నిముషాల తర్వాత వాసు వుంటే తన ఇంటికే తీసుకువెళతానన్నాడు. బలీయమైన, అంతర్లీనమైన కోరిక అంతరంగంనుంచి ఉబికివస్తుంది. ఎంతటి ఆత్మాభిమానం ఉన్న మనిషినయినా పుట్టుకతో వచ్చిన కొన్ని బలహీనతలు లొంగదీసుకుంటాయి. తన శక్తినంతా కూడదీసుకుని ఆ కోరికలను అంతరంగపు అట్టడుగుకు తోసివేస్తాడు. కొన్ని బలహీనక్షణాల్లో అవి ఒక్కసారిగా తమ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తాయి" వాసుదేవరావుగారు అన్నమాటలు గుర్తుకువచ్చాయి.

"ఫరవాలేదు... వెళదాం పదండి" అంది.

అందేగానీ సరోజకే ఆశ్చర్యం వేసింది, తను అన్నమాటకు. ఊహించకుండానే మాట అనేసింది. ఆలోచిస్తే శ్రీధర్‌తో ఒంటరిగా వెళ్ళడం హర్షణీయంకాదు. తీరా ఆ మాట అన్నాక మళ్ళీ తిరస్కారాన్ని ప్రదర్శిస్తే పిచ్చితనమౌతుంది. మనసు అట్టడుగుపొరల్లో తనకు తెలీకుండానే శ్రీధర్‌తో ఏకాంతాన్ని తను కాంక్షిస్తున్నట్లుంది.

శ్రీధర్ ఒక్కసారిగా ఆశ్చర్యపోయి "ఆటో తీసుకువస్తాను" అంటూ ఇంట్లోంచి రోడ్‌వైపు నడిచాడు. క్షణమాత్రం ఆలస్యం చేసినా సరోజ తిరస్కరించే ప్రమాదముంది అనుకున్నాడు శ్రీధర్.

పదినిముషాల్లో సరోజ చీరమార్చుకుని లైట్‌గా మేకప్ అయింది. చుట్టుపక్కల ఉన్న గృహిణులెవ్వరికీ సరోజ జీవితం తెలియదు. సరోజ పెళ్లికాని అమ్మాయే అనుకున్నారు.

ఆటోదిగి ముందు గదిలోకివచ్చిన శ్రీధర్ సరోజను చూస్తూనే "నగలతో, ముఖంనిండా రంగులతో మేకప్ చేసుకునే స్త్రీలంటే నాకెందుకో ఎలర్జీ. ఇంత సింపుల్‌మేకప్‌తో, మీ అందాన్ని ఎంతగా ద్విగుణీకృతం చేసుకోగలిగారు?" అన్నాడు.

శ్రీధర్ చేసిన కామెంట్ నచ్చినా ఏభావాన్నీ ప్రదర్శించకుండా వుండిపోయింది.

స్త్రీ తన బలహీనతను పురుషునిముందు ప్రదర్శించకూడదు. ఆ బలహీనతను అలుసుగా తీసుకుని మగవాడు స్త్రీని తన అదుపులోకి తీసుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఏరకమైన బలహీనతా ప్రదర్శించని స్త్రీ మగవానితో మోసపోయే ప్రమాదమేలేదు" అన్నవాసుదేవరావుగారి మాటలు గుర్తుకువచ్చాయి.

సరోజ మౌనంగా ఇంటికి తాళంవేస్తూ చుట్టుపక్కల చూసింది. గృహిణులెవ్వరూ బయట నిలబడిలేరు. శ్రీధర్ ముఖంవైపు చూసింది. స్వచ్ఛంగా, కల్మషరహితంగా కనిపించింది.

"ముఖాల్లో ఉట్టిపడే తేజస్సునుబట్టి మనిషిని అంచనావేయడంలో నేనెప్పుడూ తప్పిదం చేయలేదు. మనిషి ముఖంలోనే మనిషి అంతరంగం కనిపిస్తుంది తెలుసుకోగలిగినవాళ్ళకి" అనేవారు వాసుదేవరావుగారు. శ్రీధర్ ముఖంలోని స్వచ్ఛతచూస్తే అతను అసభ్యంగా ప్రవర్తిస్తాడని కలలోకూడా ఊహించడానికి వీలులేదు. కాని ఒక బలహీనమైన క్షణం మనిషిలోని మృగాన్ని మేల్కొలుపుతుంది.

సరోజ ఆటోలో కూర్చునేప్పుడు "మనిద్దరం ఒకే ఆటోలో వెళ్లడం మీకు అభ్యంతరం లేదనుకుంటాను. మరో ఆటో పిలవమంటారా?" అన్నాడు సరోజవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"ఫరవాలేదు" అంటూ ఆటోలో ఒక మూలకు ఒదిగికూర్చుంది. శ్రీధర్ ఆటోలో కూర్చుని వెళ్ళవలసినచోటు చెబుతూనే ఆటో కదిలింది.

శ్రీధర్ ట్రాఫిక్‌వైపు చూస్తున్నాడు. సరోజ మనసు అల్లకల్లోలంగా వుండటంతో బాహ్యపరిసరాలపై ఆమె మనసు నిమగ్నంకావటంలేదు.

సడన్‌బ్రేక్ వేయడంతో పట్టులేకుండా కూర్చున్న సరోజ తల ముందువున్న కడ్డీని తగిలింది.

శ్రీధర్ అనాలోచితంగా ఆమె చేయిపట్టుకుని మామూలుగా కూర్చుండబెట్టాడు. తర్వాత తనుచేసిన పొరపాటు తెలిసివచ్చి "సారీ" అన్నాడు.

సరోజ ముభావంగా వుండి సర్దుకుని కూర్చుంది.

పదినిముషాల్లో శ్రీధర్ ఇంటిముందు ఆటో ఆగింది.

ముందుగదిలోనే ఉన్న రాధమ్మ సరోజను చూస్తూనే "ఇన్నాళ్ళకు మాపైన దయకలిగిందన్నమాట" అంది, ఆప్యాయంగా ఆహ్వానిస్తూ.

సరోజ మనసు ఒక్కసారిగా భారమైపోయింది. వీళ్ళగురించి తనెంత తక్కువగా అంచనావేసింది? వయసులోనూ, అనుభవంలోనూ పండిపోయిన ఈ స్త్రీ తనరాకకోసం ఇంతగా ఎదురుచూస్తోందా?

"ఎంతమాటన్నారు! పెద్దవారు, మీదయ మాపై వుండాలి. వాసు చెయ్యి ఇంకా కుదురుకోలేదు. అందుకుని రాలేకపోయాను. శ్రీధర్‌గారే వచ్చి ఆహ్వానిస్తే కాదనలేకపోయాను" అంది.

శ్రీధర్ కలగజేసుకుని "అమ్మా... టిఫిన్, కాఫీలు ఏమైనా వున్నాయా?" అన్నాడు.

రాధమ్మ నవ్వుతూ వంటగదివైపు వెళ్ళింది.

సరోజ సోఫాలో కూర్చునివుంది. సోఫాకు ఎదురుగావున్న కుర్చీలో శ్రీధర్ కూర్చున్నాడు. కొంతసేపు మౌనంగా గడిపారిద్దరూ.

సీత లైఫ్‌సైజ్ ఫొటోపై సరోజ దృష్టిప

డింది. సోఫాలోంచి లేచి ఫొటోకి దగ్గరగావెళ్ళి ప్రత్యేకంగా చూసింది. శ్రీధర్ చిన్నప్పటి ఫొటోలు, శ్రీధర్ తండ్రి ఫొటో చూస్తూ వుండిపోయింది.

"సీత ఫొటోచూస్తే మీకేమనిపిస్తోంది" హఠాత్తుగా అడిగాడు శ్రీధర్.

"మిమ్మల్ని విడిచివెళ్ళిపోయిన సీత దురదృష్టవంతురాలో లేక సీత ఇంత త్వరగా దూరంకావడం మీ దురదృష్టమనాలో తెలీటంలేదు"

శ్రీధర్ నిశ్చేష్టుడై సరోజవైపు చూస్తూ వుండిపోయాడు. అందంతోబాటు ఉన్నతమైన భావ సంపదకూడా ఈమె సొత్తా? ఈ స్త్రీలో లేనిది ఏమిటి?

"విశిష్టమైన వ్యక్తిత్వమున్న సతీష్‌ను మీరెందుకు దూరంచేసుకున్నారో అర్థంకావడంలేదు. మీ నాన్న వ్యతిరేకించినా శ్రీనివాస్ సహకారాన్ని అనరాగా చేసుకుని..."

సరోజ ముఖంలో రంగులు మారడాన్ని గమనించి, సంభాషణపై అయిష్టత చూపుతున్నట్లుగా గుర్తించి అసంపూర్ణంగా వాక్యాన్ని ఆపివేశాడు శ్రీధర్.

"మీగురించి పూర్తిగా శ్రీనివాస్‌ద్వారా తెలుసుకున్నాను. సురేష్‌పై అంతగా ప్రేమను మీరు పెంచుకోవడం శ్రీనివాస్‌కుకూడా అర్థంకాలేదట"

సురేష్ అన్న శబ్దం వింటూనే ఆమె ముఖం మళ్ళీ మామూలుగా మారిపోయింది. పెదవులపై దరహాసం విరిసింది.

'సురేష్‌ను తను మరిచిపోగలదా? శరీరంలోని నరాలన్నిటినీ వీణాతంత్రులుగాచేసి మీటిన సురేష్. సురేష్ బతికివుంటే తన జీవితం నందనవనం అయివుండేది. సుఖపు టంచుల్ని చవిచూసివుండేది' అనుకుని "మీ ప్రశ్నకు సమాధానం నాకుకూడా తెలియదు" అంది.

"ఏమంత్రం జపిస్తే మీ హృదయద్వారాలు తెరుచుకుంటాయో చెబుతారా?"

సరోజ కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. శ్రీధర్ ఎందుకిలా తనలో ఆశల్ని రేపుతున్నాడు? "యవ్వనంలోనే ముసలివాడివికమ్మని శుక్రునిచే శపింపబడిన యయాతిలాంటిదాన్ని నేను. గాజుపాత్రలాంటి ఈ హృదయం పగిలిపోయింది. మళ్ళీ ముక్కలన్నిటినీ అతికించాలని ప్రయత్నంచేసినా అతుకులబొంతలాగానే కనిపిస్తుంది తప్ప కొత్తదనం గోచరించదు. మీకు యవ్వనం ఉంది. ఉద్యోగం వుంది. ప్రేమించే హృదయం వుంది. మరే యువతి అయినా..."

రాధమ్మ ముందుగదిలోకి రావడంతో అర్ధాంతరంగా సంభాషణ ముగిసింది.

★ ★ ★

మోహన్ కోపంతో జ్యోతి బెడ్‌రూమ్‌లోకే కాదు. అసలు ఇంటికే రావడంలేదు. గెస్ట్ హౌస్‌లోనే పడుకుంటున్నాడు.

వారంరోజులుగా జ్యోతి ఇంట్లో తినడమే లేదు. హొటల్‌కు వెళ్ళి భోజనం చేసివస్తోంది.

భర్త, అత్త, తోటికోడళ్ళు, మామగారు, ఇంట్లోని పనిమనుషులు జ్యోతివైపు కన్నెత్తి కూడా చూడటంలేదు.

పరిస్థితులను వివరిస్తూ తండ్రికి ఉత్తరం రాసింది జ్యోతి.

★ ★ ★

తెల్లవారుఝామునే నిద్రలేచాడు రమేష్. పక్కన కమల కనిపించలేదు. కిందికివెళ్ళి అన్నిగదుల్లోనూ వెతికాడు కమలకోసం. ఎక్కడా కనిపించకపోవడంతో రమేష్‌కు భయంవేసింది. ఆమెను కొట్టినప్పటినుంచి అతను మానసికంగా కృంగిపోతున్నాడు. కమలకు క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాడు. కమల తననుంచి దూరంగా పారిపోయినట్లుగా తోచిందతనికి. కళ్ళలో నీళ్ళు నిండాయి. కమల లేనిలోటు ఆక్షణంలో కొట్టవచ్చినట్లుగా కనిపించింది.

మైలుదూరంలో ఉన్న బస్‌స్టేజీకేసి పరుగు తీశాడు. అక్కడకూడా కమల కనిపించలేదు. బస్‌స్టేజీనుంచి నేరుగా అత్తవారింటికి వెళ్ళాడు రమేష్.

★ ★ ★

పైకి కిందకి రోజుకు పదిసార్లయినా తిరిగే జ్యోతి ఒక్కసారిగా కనిపించడం మానివేయడంతో రాజ్యలక్ష్మికి అనుమానంవేసి మోహన్‌తో




చెప్పింది.

మోహన్ జ్యోతి బెడ్‌రూమ్ తలుపుతట్టాడు. 'జ్యోతీ' అని ఎన్నిసార్లు పిలిచినా సమాధానంలేదు. తలుపులు ఎంతగా బాదినా జవాబు లేదు. పనిమనుషులు తలుపులు బలంకొద్దీ నెట్టడంతో బోల్ట్‌నట్స్ లూజ్‌కావడంవలన తలుపు తెరుచుకుంది.

ప్రశాంతంగా మంచంమీద పడుకుని ఉంది జ్యోతి. పక్కనే నీళ్లగ్లాసు ఉంది.

ఎంతగా తట్టినా ఆమెలో చలనంలేదు. మోహన్‌లో భయం ఆవహించింది. జ్యోతి అంటే అతనికి ప్రేమ ఉన్నా, ఆ ప్రేమను కొన్ని బలహీనతలు కప్పివేస్తున్నాయి.

డాక్టర్‌వచ్చి పెదవి విరిచాడు. జ్యోతి పరంజ్యోతిలో కలిసిపోయింది.

కుటుంబసభ్యులు ఒకరొకరుగా వచ్చారు. అందరి ముఖాల్లోనూ విషాదచ్చాయలు అలుముకున్నాయి. శేషగిరిరావు ముఖంలో నెత్తురు చుక్కలేదు. రాజ్యలక్ష్మికి బి.పి. పెరిగింది. ఒక్కసారిగా తను చేసిన తప్పు తెలిసివచ్చి భోరుమని ఏడ్చింది.

జ్యోతి శవం పోస్ట్‌మార్టంకు పంపారు. నిద్ర మాత్రలు ఎక్కువగా మింగడంవలన ప్రాణం పోయిందని రిపోర్ట్ వచ్చింది.

ఆరోజు మోహన్ విపరీతంగా తాగడంవలన బార్‌లో నుంచి బేరర్ల సహాయంతో బయటికి రావలసివచ్చింది. కారు డ్రయివ్‌చేయడానికి వీలుపడక అలాగే డ్రయివింగ్ సీటులోనే ఉండిపోయాడు. తెలిసినవాళ్లు మోహన్ పరిస్థితి గురించి ఇంట్లోవాళ్లకు ఫోన్ చేయడంతో వాళ్లొచ్చి అతన్ని ఇంటికి చేర్చారు స్పృహలేని స్థితిలో.

తల్లి, తండ్రి రాకుండానే జ్యోతికి అంత్యక్రియలు జరిగాయి.

* * *

కొంతమంది పావని కిరసనాయిల్ పోసుకుని చనిపోయిందని అంటున్నారు. మరి కొంతమంది మీ అమ్మానాయినా కిరసనాయిల్ పోసి తగలబెట్టారని అంటున్నారు. నిజం భగవంతునికి తెలును'' ఆ గుంపులోంచి ఒక మనిషి అన్నాడు.

శ్రీకాంత్ ఆ మాటలు విన్నాడో లేదో తెలియదు. డాబా పైనుంచి ఒక్కొక్క మెట్టే దిగుతున్నాడు. ఆ ఖరీదైన కర్ర మెట్లు పగిలిపోయేలా చప్పుడవుతున్నాయి, అతని పాదాల తాకిడికి.

అడుగులో అడుగువేసుకుంటూ తల్లి నాగరత్నమ్మ దగ్గరకు వచ్చాడు. కొడుకు అవతారం చూసి ఆమె భీతిల్లింది. క్షణంలో సర్దుకుని "మన ప్రారబ్ధం నాయినా... హాయిగా కాపురం చేసుకుంటూ నూరేళ్లు బతకక ఈ పని చేసిపోయింది. పువ్వుల్లోపెట్టి చూసుకున్న మనకు ఎంతచెడ్డపేరు వచ్చిందో చూడు. ఇటువంటి పని చేస్తుందని ఊహించనేలేదు. గదిలోంచి పొగలు వస్తున్నాయని ప్రక్కయింటి వాళ్లు చెబితే తెలిసింది. వెళ్లి చూసేవరకే అంతా అయిపోయింది. అక్షణంలోనే నీకు టెలిగ్రామ్ ఇచ్చాం'' అంది.

పావనిని తన తల్లి ఎందుకు చంపిందో శ్రీకాంత్‌కు తెలుసు. నెలరోజుల క్రితం తనకు మరో పెళ్లిచేయడానికి పురోహితుడితో మంతనాలు సాగించడం గుర్తువచ్చింది.

పావని ఏపరిస్థితిలోనూ ఆత్మహత్య చేసుకోదని శ్రీకాంత్‌కు గట్టి నమ్మకం. పావని నెల తప్పడం శ్రీకాంత్‌కు తెలుసు. గర్భంతో ఉన్న ఏ స్త్రీ ఇటువంటి దారుణానికి ఒడిగట్టదు.

ఒకరోజు శ్రీకాంత్ ప్రామిస్ కూడా చేయించుకున్నాడు పావనితో. ఏపరిస్థితిలోనూ ఏ అఘాయిత్యం చేయవద్దని. పావని నవ్వి "నాఆత్మను నీకు అంకితం చేశాను. ఆత్మనాలో మిగిలివుంటేగా నేను ఆత్మహత్య చేసుకోవడానికి'' అంది.

క్షణక్షణానికి శ్రీకాంత్ ముఖంలో వస్తున్న మార్పును గుర్తించి ఏదో భీభత్సం జరగబోతుందని భయపడ్డారు అక్కడున్నవారంతా.

దక్షునిచే పరాభవించబడి ఆత్మాహుతి చేసుకున్న సతిని చూసి ఆగ్రహం చెందిన శివునిలా ఉన్నాడతను.

"ఎందుకు చంపావు పావనిని?"

ఒక్కొక్క అక్షరం వొత్తివలుకుతూ అన్నాడు.

నాగరత్నమ్మ ఆశ్చర్యపోయింది. మరుక్షణం భయపడి అడుగువెనక్కు వేసింది. ఆమె అడుగువెనక్కువేసిన క్షణంలోనే శ్రీకాంత్

రెండు చేతులు ఆమె మెడచుట్టూ బిగుసుకు పోయాయి. ఆమెకు ఊపిరి ఆడటంలేదు. శ్రీకాంత్ రాక్షసబలం ముందు విడిపించుకోవ డానికి ప్రయత్నంచేస్తున్న ఆమె రెండు చేతులు గడ్డిపోచలయినాయి.

అక్కడ ఉన్నవాళ్లందరూ షాక్‌లోంచి తేరుకుని నాగరత్నమ్మను శ్రీకాంత్‌నుంచి విడిపించారు. ఆమె అలాగే నేలకు ఒరిగిపోయింది.

రామారావుగారి కోపం తారాస్థాయిలో చేరుకుంది. "దుర్మార్గుడా... కన్నతల్లినే చంపడానికి ప్రయత్నిస్తావా?" అంటూ అతనిపైకి ఉరికాడు.

రామారావు జుట్టు పట్టుకుని అయన్ని విసిరాడు శ్రీకాంత్. రామారావు మొదలు నరికిన చెట్టులా విరుచుకుపడిపోయాడు.

శ్రీకాంత్‌లోని రాక్షసత్వం తగ్గుముఖం పట్టింది. వికృతంగా నవ్వుతూ జుట్టుపీక్కున్నాడు. చేతికి అందిన వస్తువులను తీసుకుని ఎదురుగా కనిపించిన గోడకేసి విసరడం ప్రారంభించాడు.

కొంతసేపటి తర్వాత "అదిగో పావని" అంటూ ఇంట్లోంచి బయటకు బుల్లెట్‌లా దూసుకుపోయాడు.

★ ★ ★

శ్రీధర్‌తో ముప్ఫయి సంవత్సరాల యువకుడు ముందు గదిలో కూర్చుని ఉండటం చూసి ఆశ్చర్యపోయింది సరోజ.

అతనికి సరోజను పరిచయంచేశాడు శ్రీధర్.

"మీరు, మా సిస్టర్ ఇద్దరూ ఒకేపోలికలా ఉన్నారు. అభ్యంతరం లేకుంటే మిమ్మల్ని సిస్టర్ అనవచ్చా" అన్నాడతను.

మొదటి పరిచయంతోనే అంతగా కలిసిపోయే అతని మనస్తత్వం ఎబ్బెట్టుగా అనిపించినా- అతని ముఖంలో కృత్రిమత్వం లేదు.

"ఈయనపేరు నరేంద్ర... సైకియాటిస్ట్‌గా ప్రాక్టీస్ చేస్తున్నాడు. నరేంద్ర నాన్న సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగిగా సిటీలో ఉండటంవలన ఇక్కడే చదువుకున్నాడు నరేంద్ర. తెలుగుబాగా నేర్చుకున్నాడు" శ్రీధర్ అపరిచితుని పూర్తి వివరాలు చెప్పాడు.

"మీ కేస్ హిస్టరీ కొంత శ్రీధర్ వలన తెలిసింది. మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు వేస్తాను- సంకోచం లేకుండా చెబుతారా?" అన్నాడు నరేంద్ర సరోజవైపు చూసి.

సరోజకు భయంవేసింది. శ్రీధర్ స్నేహం లిమిట్‌దాటి వెళ్లిందేమో అనిపించింది. అతనికి ఎదురుచెప్పే సాహసం చేయలేకపోయింది. "మీరు నా విషయాన్ని అంత ప్రత్యేకంగా నరేంద్రగారితో ఎందుకు చెప్పారు? నాకేమయిందని?" అంది మాటల్లో కోపాన్ని మిళితంచేస్తూ.

శ్రీధర్ మౌనంగా ఉండిపోయాడు. నరేంద్ర కలగజేసుకుని, "మీరు ఈ విషయాన్ని సీరియస్‌గా ఎందుకు తీసుకుంటున్నారు. ప్రపంచంలో ప్రతిమనిషి ఏదో ఒక విషయానికి సంబంధించిన మానసికరోగానికి లోనైవుంటాడు. నేనే అందుకో ఉదాహరణ. నా మానసికరోగానికి మరో సైకియాట్రిస్ట్ దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాను. మీరు నార్మల్‌గానే ఉన్నారు. మీరు కొన్ని విషయాల్ని మీ అంతరంగంలో స్థిరపరచుకుని, వాటికి లోబడి ముఖ్యమైన జీవితానుభవాల్ని తృణప్రాయంగా తీసివేస్తున్నారు. మీలో స్థిరపరచుకున్న అభిప్రాయాలు మీ జీవితగతిని మార్చివేస్తున్నాయి. సజెషన్స్ ద్వారా ఆ అభిప్రాయాల్ని తొలిగించవచ్చు. ట్రీట్‌మెంట్ అంటూ ప్రత్యేకంగా ఏమీ లేదు. రెండుగంటలు మీరు మాతో సహకరిస్తే సరిపోతుంది"

సరోజ ముభావంగా ముందుగదినుంచి నిష్క్రమించడం చూసి ఆమె మనసును గాయపరిచానేమో అనుకున్నాడు శ్రీధర్.

అయిదు నిముషాల్లో కాఫీ కప్పులతో ఆమె తిరిగి రావడం, ముఖంలో చెరగని చిరునవ్వు చూసి శ్రీధర్ సంతసించాడు.

నరేంద్ర కాఫీతాగుతూ- "శ్రీధర్, నేను చిన్ననాటి స్నేహితులం. ఏదో సందర్భంవచ్చి అనుకోకుండా మీ విషయాన్ని చూచాయిగా చెప్పాడు. నేను గుచ్చి గుచ్చి అడగడంతో మీ గురించిన పూర్తి విషయాన్ని అతను నాకు

చెప్పక తప్పలేదు. మేము సైకియాట్రిస్ట్ లంకదా! మాముందు ఎవ్వరూ మనసులోని విషయాన్ని దాచకూడదు. మీకుతెలుసుగా! ఏసుప్రభువు భక్తులు ఫాదర్స్ ముందు కన్ఫెషన్ చేస్తారు. దాంట్లోవున్న తప్పిదం ఏమిటి? మేమూ అలాంటివాళ్లమే.

ఫాదర్స్ కన్ఫెషన్స్ విని సలహా ఇచ్చి స్వాంతన చేకూర్చుతారు. మేము స్వాంతన చేకూర్చడంతోనే ఆగిపోక గాయపడిన అంతరంగానికి పూర్తి చికిత్సను చేస్తాం! మీ విషయాల్ని శ్రీధర్ నాకు చెప్పలేదు. శ్రీధర్‌నుంచి నేను లాక్కున్నాను. అనలైజ్ చేయడానికి వీలైన ఏ కేసునైనా మేము విడిచిపెట్టడం జరగదు. రేస్‌బుక్ చేతిలో పట్టుకున్న పంటర్‌లాంటి వాళ్ళం మేము. కేస్‌హిస్టరీ చేతిలోకి తీసుకున్న తర్వాత ఇహ వెనుకడుగువేయం'' అన్నాడు.

సరోజ నరేంద్ర చెప్పే విషయాలను జాగ్రత్తగా వింటూ ఉండిపోయింది.

''మీకు వీలుంటే నా డిస్పెన్సరీకి రావడానికి ప్రయత్నం చేయండి. పేషంట్‌గా ఇష్టంలేకుంటే, స్నేహితురాలిగానైనా రావచ్చు'' అంటూ కుర్చీలోంచి లేచాడు నరేంద్ర.

సరోజ సందిగ్ధంలో ఉండిపోయింది.

★ ★ ★

జ్యోతి చనిపోయిన విషయం శేషగిరిరావు కుటుంబసభ్యులకు షాక్ తగిలినట్లుగా ఉంది. నిరంతరంగా వచ్చే ఫోన్‌లకు సమాధానం చెప్పలేక రింగ్ అయిన రిసీవర్ ఎత్తకుండా అలాగే ఉండిపోతున్నారు.

ఫ్యాక్టరీలకు రెండురోజులు సెలవుదినాలుగా ప్రకటించి ఇంటిదగ్గరే ఉండిపోయాడు శేషగిరిరావు.

పలకరించడానికి వచ్చినవాళ్లతో మాట్లాడుతూ కూర్చున్న శేషగిరిరావు సబ్-ఇన్స్‌పెక్టర్ రావడంతో ఆశ్చర్యపోయాడు.

''మీ ఇంట్లో ఉండే జ్యోతి అనే అమ్మాయి నుంచి మాకు ఒక ఉత్తరం వచ్చింది. ఇక్కడి సర్కిల్ పోలీస్‌స్టేషన్‌కు ఉత్తరం రాస్తూ ఇంట్లో వాళ్ళందరూ తనని చంపడానికి ప్రయత్నించేస్తున్నారనీ; ఒకవేళ తను చనిపోవడం అంటూ జరిగితే అది ఈ ఇంట్లోవారి వల్లనే జరుగుతుందనీ; తనను చంపి, బయటివాళ్లకు ఆత్మహత్యగా కనిపించేలా చేసేందుకు ప్రయత్నం చేస్తున్నారనీ ఆ ఉత్తరంలో ఉంది''

సబ్ ఇన్స్‌పెక్టర్ మాటలకు శేషగిరిరావుకు మూర్ఛవచ్చినట్లయింది.

''మీకు నమ్మకం కుదరకపోతే ఆమె రాసిన ఉత్తరం చూడండి'' అంటూ ఉత్తరాన్ని శేషగిరిరావుకు చూపాడు సబ్‌ఇన్స్‌పెక్టర్.

అతను చెప్పినట్లుగానే ఉత్తరంలో రాసివుంది.

సబ్--ఇన్స్‌పెక్టర్ వైపు అలాగే చూస్తూ ఉండిపోయాడు శేషగిరిరావు.

''జ్యోతిని పిలుస్తారా?''

''నిన్న ఆత్మహత్యచేసుకుంది. రాత్రి అంత్యక్రియలు పూర్తయ్యాయి''

''ఇంత పెద్దమనుషులు అయివుండి కూడా ఒకస్త్రీ ఆత్మహత్యచేసుకునే పరిస్థితులకు పురికొలిపారంటే; మీరు హత్యచేసినట్లే అవుతుంది. దీనికి బాధ్యులైన వాళ్లని అరెస్ట్ చేయకతప్పదు''

శేషగిరిరావుకు చేతులు వణికాయి. మొట్టమొదటిసారిగా ఒక పోలీస్ ఆఫీసర్‌ముందు తలవంచుకునే పరిస్థితి ఏర్పడినందుకు తనను తానే నిందించుకున్నాడు. ఫోన్ దగ్గరికి వెళ్లి డైల్‌చేసి సబ్--ఇన్‌స్పెక్టర్‌ని పిలిచాడు ఫోన్‌లో మాట్లాడటానికి.

పైఅధికారితో రెండునిముషాల సంభాషణతోనే అతని ముఖంలోని అధికారదర్పం నీరుకారిపోయింది. ''జ్యోతిగారు ఆత్మహత్య చేసుకున్నారని ఒక రిపోర్ట్ రాసివ్వండి. మిగతా ఫార్మాలిటీస్ మేము చూసుకుంటాం. మీరేమీ గాబరాపడవలసిన అవసరంలేదు'' అంటూ శేషగిరిరావుకు షేక్‌హాండ్ ఇచ్చి వెళ్లిపోయాడు సబ్ ఇన్స్‌పెక్టర్.

పలకరించడానికి వచ్చిన స్నేహితులతో ఇల్లంతా సందడిగా ఉంది. బెడ్‌రూములోకి వెళ్లి విశ్రాంతి తీసుకోవాలనిపించింది శేషగిరిరావుకు. కాని రెండుగంటలు పడుకున్నా అతనికి మనశ్శాంతి లభించలేదు. జ్యోతి ఇంత సాహసం చేస్తుందని అతను ఊహించలేదు. సున్నితమైన మనసు అని గ్రహించి ఇంతదాకా లాగకుండా ఉండవలసింది! చూసిర

మ్మంటే, కాల్చివచ్చినట్లు మంచిగా అడగరా అని మోహన్‌కు చెబితే, వాడు ఆత్మహత్య వరకు లాక్కువెళ్లాడు. అయినా రాజ్యలక్ష్మికి అనుభవంలేదా? ఆలు-మగల సమస్యలు వాళ్లే పరిష్కరించుకుంటారని ఊరుకోక మధ్యలో తలదూర్చి జ్యోతి మనసు పూర్తిగా విరిచేసింది. ఏది జరిగినా ఇంటిపెద్దగా తను బాధ్యత వహించాలి! ఇంత డబ్బు ఉండి కూడా సంఘంలో తలఎత్తుకుని బతకడానికి వీలులేని పరిస్థితి కల్పించింది జ్యోతి.

★ ★ ★

వాసుకు ట్యూషన్ చెప్పడం అయిపోతూనే "నరేంద్ర ఇవ్వాళ మిమ్మల్ని డిస్పెన్సరీకి రమ్మని ఆహ్వానించాడు" అన్నాడు శ్రీధర్ సరోజతో.

సరోజకు డిస్పెన్సరీకి వెళ్లడానికి సంకోచంగా ఉంది. కాని దీనిని కూడా ఒక అనుభవంగా ఎందుకు తీసుకోకూడదు- అనుకుని వెళ్లడానికి ఒప్పుకుంది.

సాయంత్రం ఆరుగంటల సమయం. శ్రీనివాస్‌కు చెప్పివెళ్లడం సమంజసమేమో అనిపించింది సరోజకు. తను ఏదిచేసినా శ్రీనివాస్ వ్యతిరేకించడు!

శ్రీధర్, సరోజ, వాసు ఆటోలో నరేంద్ర డిస్పెన్సరీకి ప్రయాణమయ్యారు. ఇరవయ్యి నిముషాల్లో డిస్పెన్సరీ చేరుకుంది ఆటో.

డిస్పెన్సరీ ఫ్రంట్‌హాల్ తెల్లగా మెరిసిపోతూ స్వచ్ఛతకు మారుపేరుగా ఉంది.

నాలుగు కుర్చీలు టీపాయ్, మూలకువున్న పొడవాటి స్టూల్‌పై జాడీలో ఫ్రెష్‌గా ఉన్న పూలగుత్తి.

టీపాయ్‌పైనున్న మాగజైన్స్ తిరగేస్తూ కూర్చుంది సరోజ. అటెండర్‌కు తన పేరు చెప్పాడు శ్రీధర్.

రెండు నిమిషాల్లో ఫ్రంట్‌రూంలోకి వచ్చాడు నరేంద్ర.

సరోజను చూసి "మీరు తప్పకుండా నా డిస్పెన్సరీకి వస్తారని ఊహించాను. అంతర్గతంగా నిక్షిప్తమైన విషయాలనే కాకుండా భవిష్యత్తును కూడా చెప్పగలం మేము" నవ్వుతూ అన్నాడు.

సరోజ, శ్రీధర్ కూడా నవ్వారు.

"లోపలికి వస్తారా సరోజగారూ" అంటూ



నరేంద్ర తన గదిలోకి దారితీశాడు.

శ్రీధర్‌వైపు కళ్ళెత్తి చూసింది సరోజ. 'మరేం భయంలేదు' అన్నట్లుగా ఉన్నాయి అతని చూపులు.

నరేంద్రను అనుసరించింది సరోజ.

నరేంద్ర రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చున్నాడు. విశాలమైన టేబుల్‌పై కొన్ని పుస్తకాలు పేర్చివున్నాయి. గోడలకు ఫ్రాయిడ్, జంగ్ ఫొటోలు వేలాడుతున్నాయి.

సరోజ టేబుల్‌కు ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంటూనే "డాక్టర్ దగ్గర పేషంట్ తన రోగాన్ని ఏమాత్రం దాచకుండా చెప్పేటట్లే మీరుకూడా నేను అడిగే ప్రశ్నలకు ఏ మాత్రం సిగ్గుపడకుండా సమాధానం చెప్పాలి" అన్నాడు.

సరోజ తల ఊపింది సమ్మతిస్తున్నట్లుగా.

చిన్నప్పటి అలవాట్లు, పెళ్లితర్వాత మనసులోని భావాలు, అప్పటికలలు గుర్తున్నంతవరకు- నరేంద్ర ప్రశ్నలకు సమాధానాలు చెప్పింది!

"ఈమధ్య మీకు ఎటువంటి కలలు వస్తున్నాయో చెబుతారా?"

"తెల్లగోడలపైకి ఎగబాకుతున్నట్లు, మైదానంలో వేగంగా పరుగుతీస్తున్నట్లుగా"

"ప్రతిరోజు ఏటైమ్ మీరు ఇష్టపడేది?"

"సాయంత్రం అయిదు, ఆరు గంటలమధ్య"

"ఏ టైమ్ మీరు ఇర్రెసిస్టెంట్‌గా ఫీలవుతారు?"

"రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో"

"మీరు ఫ్రీగా ఉన్నప్పుడు ఏ విషయాలపై మీ మనసు వెళుతుంది?"

"నా చిన్నతనంలో కొన్ని సంఘటనలు, మా అమ్మనాన్నల గురించి, మా గురువుగారైన వాసుదేవరావు, సతీష్‌ల గురించికూడా ఆలోచిస్తాను. నా భర్త సురేష్‌పైనే ఆలోచనలు ఎక్కువగా వస్తాయి"

"మీరు ఇర్రెసిస్టెంట్‌గా ఉన్నప్పుడు, మీకు మీరు స్వాంతన ఏ విధంగా చేకూర్చుకుంటారు?"

సరోజ తొందరగా సమాధానం చెప్పలేకపోయింది. తొట్రుపాటుగా "పక్కింటివాళ్ళ దగ్గరకు వెళ్ళడం చేస్తుంటాను" అంది.

"సెక్స్ గురించిన ఆలోచనలు ఎప్పుడు వస్తాయి?"

"నా భర్త సురేష్ ఫొటో చూసినప్పుడు"

పక్కనేవున్న కాట్‌పై సరోజను పడుకోమని చెప్పాడు నరేంద్ర. తల దగ్గర లావాటి రెండు స్పాంజ్‌దిండ్లు ఉన్నాయి. విశ్రాంతి తీసుకుంటున్నట్లుగా ఈజీగా ఉండమని చెప్పాడు నరేంద్ర.

"పూర్తి ఈజ్‌గా ఫీల్‌అవండి. ఏ విధమైన కంపల్షన్ వున్నట్లుగా భ్రమపడకండి. పదిసార్లు మెల్లగా బ్రీత్‌చేయండి. నిద్రరావాలనుకున్నప్పుడు రొటీన్‌గా ఏవిధంగా ఫీల్‌అవుతారో ఆవిధంగా ఫీల్‌అవండి"

నరేంద్ర చెప్పినట్లుగానే చేసింది సరోజ. స్లీప్‌మూడ్ రావడానికి అయిదునిముషాలు పట్టింది.

నరేంద్ర ఆమె తల దగ్గరకు వచ్చి ఓ చైన్ కొసను మెరుస్తున్న పదిపైసల నాణెంలాంటిది ఆమె కళ్ళమధ్యకు ఒక అడుగు ఎత్తునవుంచి దానిపై కాన్‌సెన్‌ట్రేట్ చేయమని చెప్పాడు.

కళ్ళు బరువుగా అవుతూనే కాయిన్ గిర్రున తిరిగేలా చేశాడు. కొంతసేపట్లోనే సరోజ హిప్నటైజ్ అయిపోయింది.

పదిహేను నిముషాల్లో తనకు కావలసిన విషయాలన్నీ ఆమెనుంచి గ్రహించాడు నరేంద్ర.

సరోజను కాన్షియస్‌లోకి తీసుకువచ్చాడు. ముందు హాల్‌లోకి దారితీశారు ఇద్దరూ.

సరోజను ఇంటికి తీసుకువెళ్ళమని వాసుతో చెప్పాడు శ్రీధర్.

సరోజ, వాసు నిష్క్రమిస్తూనే నరేంద్ర శ్రీధర్ భుజంపైన చేయివేసి, "ఇట్‌ఈజ్ వాట్‌ఏ సింపుల్‌కేస్ ఆఫ్ ఫ్రిజిడిటీ. తనలోని శారీరక స్పందన, మానసిక స్పందనల మధ్య ఎటువెళ్ళాలో తేల్చుకోలేకపోతోంది. సురేష్‌తో అతీతమైనస్థాయిలో సెక్స్ చవిచూడటంవలన సురేష్ అంటే విపరీత ప్రేమ ఏర్పడింది. ఈ ప్రేమకు బేస్‌అంతా సెక్స్ మాత్రమే. మామూ

లుగా హిందూమతంలో వుండే పతిభక్తికూడా కొంతవరకు వుండవచ్చు" అన్నాడు.

"మనిషిలో మానసిక స్పందన ఏర్పడిన తర్వాత, శారీరకమైన కోరికలను పూర్తిగా అణ గదొక్కడం మొదలవుతుంది. హిందూమ తంయొక్క ఫండమెంటల్స్ కోరికలను అణు చుకోవడం అన్న విషయాలచుట్టే తిరుగు తాయి. మనిషిలోని శారీరక స్పందన కొంతవ రకు అనిమల్ ఇన్‌స్టింక్ట్ వంటిది. తొక్కిపట్టి వుంచిన స్ప్రింగ్‌లాంటిది. మానసికంగా ఎంతగా ఎదిగినా స్ప్రింగ్‌ను ఎంతవరకు తొక్కి పట్టి వుంచగలడు? ఏమాత్రం ఏమారినా స్ప్రింగ్ జంప్‌చేసినట్లుగా ఇన్‌స్టింక్ట్ ముందుకు దూసుకువస్తుంది. కొంతవరకు శా రీరక స్పందన కలిగించే మగవాడు దగ్గరగా వున్నప్పుడు సరోజలోని సెక్సువల్ ఫీలింగ్స్ ఒక్కసారిగా విజృంభిస్తున్నాయి. అయినా తెలి విగా వాటిని అణగదొక్కుతూ ముందుకుసాగు తుంది.

సరోజలోని ఆలోచనాసరళి క్రమబద్ధంగా వుంది. షిఈజ్ ఫర్‌ఫెక్ట్‌లీ ఆల్‌రైట్. సజెషన్స్ ద్వారా సబ్-కాన్షియస్‌ను కంట్రోల్ చేయవ చ్చు. అపూర్వమైన మేధాసంపత్తి వున్న సరో జకు ప్రతి విషయాన్ని ఛానలైజ్‌చేసి తనకు అనుకూలంగా మార్చుకునే కెపాసిటీ వుంది. సజెషన్స్ ప్రభావం వలన క్రమంగావున్న సబ్-కాన్షియస్ దెబ్బతినే ప్రమాదం వుంది. రోగం ఉన్నప్పుడే మందు వాడాలి. ఆరోగ్య వంతుడు మందు వాడితే కొత్తరోగం వచ్చే అవకాశం వుంది. అడవికాచిన వెన్నెలలా ఆమె యవ్వనం, అందం సమసిపోవడానికి వీలులేదు. అలాఅని మానసికంగా పరిణీత కావాలనుకునే ఆమె స్వేచ్ఛకు అడ్డుకట్ట వేయ డానికి వీలులేదు. ఆమెలో నిక్షిప్తమైవున్న స్లె యిట్ సెక్సువల్ ఇన్‌స్టింక్ట్‌తో నీవు ఊహించి నంత వేగంగా ఆమె నిన్నుచేరే అవకాశంలే దు. నీవు చేతల్లో, మాటల్లో, చూపుల్లో ఆమెలో సెక్సువల్ ఇన్‌స్టింక్ట్ పెరిగేలా చేయాలి. విత్త నంనుంచి మొలక వచ్చినట్లుగా మెల్లమెల్లగా ముందుకుసాగాలి. ఏమాత్రం హెవీగా వెళ్ళినా పరిస్థితి తారుమారవుతుంది

సెక్స్ ఇన్‌బిటివిన్ సొసైటీ అండ్ స్పిర్చువా లిటీ పైన నేను థీసిస్ రాస్తున్నాను. సరోజ కేస్ నా థీసిస్‌కు ఎంతగానో ఉపయోగపడుతుంది.

సెక్స్ మానవుల ఇన్‌బార్న్ నేచర్. ఇన్‌బార్న్‌నే చర్ అక్వాయిర్డ్‌పైన డామినేట్ చేస్తాయి. సరోజ అక్వాయిర్డ్ అయిన సాంప్రదాయాల్ని, స్పిర్చు వాలిటీని తనవిగా చేసుకోవాలని ఎంతగా ప్రయత్నంచేస్తున్నా ఇన్‌బార్న్‌అయిన సెక్స్ ఆమె భావాలకు అడ్డుకట్ట వేస్తుంది.

అక్వాయిర్డ్ కారెక్టర్స్ దేశ కాలపరిస్థితులను అనుసరించి మారుతుంటాయి. తరతరాలకు మార్పుచెందుతుంటాయి.

సాంప్రదాయం, స్పిర్చువాలిటీలలో నిక్క చ్చిగా నిజం ఎంతవుందో తెలుసుకోడం కష్టం. ఇన్‌బార్న్ నేచర్‌ను మించి ఇవి మనిషిని రూల్ చేస్తున్నాయి.

స్వేచ్ఛకూడా మానవుని ఇన్‌బార్న్ నేచర్. దీన్నికూడా అక్వాయిర్డ్ అయిన కొన్ని విషయా లు డామినేట్ చేస్తున్నాయి.

ఇన్‌బార్న్ నేచర్‌గా వున్న సెక్స్, స్వేచ్ఛకు- అక్వాయిర్డ్‌గా వచ్చిన విషయాలన్నీ అను సంధానంగా వెళితేనే మనగలుగుతాయి. వీటి కి పారలల్‌గా వెళ్ళిన ఏ సిద్ధాంతం నిలదొక్కు కోలేకపోతుంది.

ఉదాహరణకు బౌద్ధమతం సెక్స్‌కు పారల ల్‌గా వెళ్ళి నిలదొక్కుకోలేకపోయింది; అలాగే స్వేచ్ఛకు పారలల్‌గా వెళ్ళిన ఏ రాజకీయ సిద్ధాంతమూ నిలదొక్కుకోలేదు. రాచరిక వ్యవ స్థ కూలిపోవడానికి కారణం ఇదే"

శ్రీధర్ నరేంద్రవైపు కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాడు. భగీరథుడు గంగను మానవా ళికి సమర్పించినట్లుగా, కొత్త సిద్ధాంతాల్ని మానవజాతికి అందించడానికి ఉద్భవించిన వాడిలా కనిపించాడు నరేంద్ర.

"నీవు పోస్ట్-గ్రాడ్యుయేట్‌వి కాబట్టి పార్ట్‌క ట్‌లో విషయాలన్నీ చెప్పాను. అర్ధమయిందనే అనుకుంటాను?" ప్రశ్నార్థకంగా శ్రీధర్‌వైపు చూశాడు.

శ్రీధర్ చిరునవ్వు నవ్వి నరేంద్రకు కరచాల నంచేసి వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"గుడ్‌లక్" అంటూ చిరునవ్వు నవ్వుతూ "నేను చెప్పిన విషయాలన్నీ యధాతథంగా ఆచరించు. సరోజ నీది అవుతుందన్న

నమ్మకం నాకుంది. సరోజ నీ జీవిత సహచారిణి అవడం సంభవిస్తే యు విల్‌బిద లక్కియెస్ట్ పర్సన్' అన్నాడు నరేంద్ర.

శ్రీధర్ చిరునవ్వు నవ్వాడు.

★ ★ ★

జ్యోతి తనువు చాలించి మూడురోజులవుతోంది. జ్యోతి రాసిన ఉత్తరం, శేషగిరిరావుగారు పంపిన టెలిగ్రాఫ్ ఒకేసారి చేరాయి రాజేశ్వరరావుగారికి. ఉత్తరం చదువుతూనే రాజేశ్వర్రావుగారి గుండె ఆగినంతపనయింది. కళ్ళలో నీళ్ళు నిలిచాయి. జ్యోతి తల్లికి ఈ విషయం చెప్పాలా, వద్దా- అన్న సందిగ్ధతలో పడ్డాడు. సిటీకివెళ్ళి విషయాలన్నీ సానుకూలంగా పరిశీలించి భార్యకు జ్యోతి మరణవార్త చెప్పాలనుకుని, ఆ క్షణంలోనే సిటీకి ప్రయాణమయ్యాడు రాజేశ్వరరావు.

ఫ్రంట్‌హాల్‌లో సోఫాలో కూర్చుని ఆలోచిస్తున్న శేషగిరిరావుకు రాజేశ్వరరావు రావడంచూసి గుండె వేగంగా కొట్టుకుంది.

సోఫాలోంచి లేచి, రాజేశ్వరరావు చేతిని పట్టుకుని సోఫాలో కూర్చుండబెట్టాడు శేషగిరిరావు.

అయిదు నిముషాలు గడిచిపోయినా ఇద్దరి మధ్యా సంభాషణ జరగలేదు.

రాజేశ్వరరావు చేతిని పట్టుకుని తన బెడ్‌రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు.

రూములోకి వెళుతూనే, "మా తప్పులు క్షమించు బావా! ఇవి చేతులు కావనుకో" రాజేశ్వరరావు రెండు చేతుల్ని పట్టుకున్నాడు శేషగిరిరావు.

"అల్లారుముద్దుగా పెంచుకున్న బిడ్డను, రాబందుల్లా పొడిచి చంపేశారు, ఏ ముఖం పెట్టుకుని క్షమించమని అడుగుతున్నావో అర్థంకావడంలేదు" రాజేశ్వరరావు గొంతులో కరుకుదనం తొంగిచూసింది.

"కోడలు ఈ పనిచేస్తుందని నేను ఊహించలేదు?"

"కూటికి లేనివాడు డబ్బుకోసం ఎంత నీచానికైనా తలపడతాడని నేను అనుకునేవాణ్ణి. పేదవాడికి నీతైనా వుంటుంది. మీకదీ లేదు. కోట్ల ఆస్తి వుండికూడా డబ్బుకోసం ఇంతగా దిగజారతారని నేను ఊహించనేలేదు. బంగారులాంటి నా కూతురిని ఆఖరిచూపులుకూడా చూసుకోకుండా చేశారు. డబ్బు వుందని ఎన్ని ఆటలు ఆడినా సాగుతాయని అనుకుంటున్నావేమో? మిమ్మల్ని సర్వనాశనం చేసిగాని నేను నిద్రపోను. మీ చేతులకు సంకెళ్ళు వేయించకపోతే..." రాజేశ్వరరావు ముఖం భావతీవ్రతతో రౌద్రాకారంగా మారింది.

శేషగిరిరావు షాక్ తిన్నాడు. పోలీసులకు రాసినట్లే తండ్రికి పూర్తి విషయాల్ని తెలుపుతూ జ్యోతి ఉత్తరం రాసినట్లుంది. ప్రీప్లాన్డ్‌గా తనను సర్వనాశనం చేయడానికే పంతంపట్టినట్లుగా వుంది. రెండు నిముషాలు మాట్లాడటానికి అతని నోరు పెగలలేదు. "బావా... నీవు ఇచ్చిన వరకట్నం ఆరులక్షలు తీసుకో" అన్నాడు.

రాజేశ్వరరావు ముఖంలో ఏ భావమూ ప్రస్ఫుటంగా కనిపించలేదు.

"బావా... అపోజిషన్‌లో వుండి నీవేం సాధిస్తావు? ఎలక్షన్లు దగ్గరకు వస్తున్నాయి. రూలింగ్ పార్టీ టికెట్ ఇప్పిస్తాను. నీ ప్రాంతంలో నీవు ఎదురులేని నాయకుడివి... తప్పకుండా గెలుస్తావు. ఒక్కో నియోజకవర్గానికి అయిదులక్షల రేటు నడుస్తోంది"

రాజేశ్వరరావు నుంచి మాట పలుకులేదు.

"గెలుస్తూనే నిన్ను మినిస్టర్ చేసేపూచి నాది. హోంమినిస్టర్ మనవాడే. ముఖ్యమంత్రి దగ్గర మంచి పలుకుబడి వుంది. నమ్మకం లేకుంటే హోమ్ మినిస్టర్‌తో ఫోన్‌లో మాట్లాడు" అంటూ డైల్‌చేసి రిసీవర్ రాజేశ్వరరావుకు ఇచ్చాడు.

"హలో... రాజేశ్వరరావుగారా... ప్రస్తుత ఎమ్మెల్యే మీరేగదా! తప్పకుండా ప్రిఫరెన్స్ వుంటుంది. పార్టీ టికెట్ మీకు ఖాయం అనుకోండి" అన్న మాటలు వినిపించాయి రాజేశ్వరరావుకు.

రిసీవర్ శేషగిరిరావు తీసుకున్నాడు. "శేషగిరిరావుగారూ! నా సమస్త శక్తులను కూడగట్టుకుని మిమ్మల్ని కాపాడగలిగాను. మీరు పార్టీ ఫండ్‌గా ఆరులక్షలు, సీటుకోసం అయిదు లక్షలు పంపించండి. ఇవ్వాళ్ళ చేసిన సహాయం మీకు కాబట్టి చేశాను, చిరకాల

మిత్రత్వం వలన. ఇక ఎటువంటి ఇబ్బందిరాదు. ఒకవేళ వచ్చినా వెంటనే నాకు ఫోన్‌చేసెయ్'' అంటూనే లైన్ కట్‌అయింది.

శేషగిరిరావు దీర్ఘంగా నిట్టూర్చాడు.

శిలలా నిలబడివున్న రాజేశ్వరరావు భుజంపైన చేయివేసి, ''కాఫీ తాగుదాం రా బావా'' అని అంటూనే శేషగిరిరావు ముందుకు నడిచాడు.

* * *

పదిహేనురోజులుగా శ్రీధర్ ప్రవర్తన అసహజంగానూ, అసభ్యంగానూ అనిపిస్తోంది సరోజకు. కాని అతను చేసేవనులకు ఎదురుచెప్పలేకపోతోంది.

అవసరం లేకుండా తాకడం, రెండు మూడు నిముషాలు చేతిని పట్టుకుని వదలడం, కళ్ళలోకి సూటిగా చూడటం చేసినా చూసీచూడనట్లుగానే వుండిపోయింది.

అతను చేసే పనులకు చీవాట్లు పెట్టాలని వున్నా మాటలవల్లగాని, కనీసం చూపులవలన కూడా తన కోపాన్ని వ్యక్తపరచలేకపోయింది.

అతను అలా తాకాలని, అతను తన చేయి పట్టుకోవాలని మనసు కోరడం ఒకవిధమైన ఆశ్చర్యాన్ని కలిగించింది.

శ్రీధర్ మార్నింగ్‌షో సినిమాకు వెళదామంటే కాదనలేకపోయింది. వాసు స్కూల్‌కు వెళ్ళాడు. శ్రీధర్ కాలేజీకి వెళ్ళకుండా తనను పిక్చర్‌కు రమ్మనడం ఎందుకో ఆమెకు అర్థంకాలేదు. శ్రీధర్ అంటే ఒక విధమైన సదభిప్రాయం ఏర్పడటంవలన అతనుచేసే పనులకు ఎదురుచెప్పలేకపోతోంది.

అదొక ఇంగ్లీష్ సినిమా. బాల్కనీలో ఇరవయిమందికంటే ఎక్కువగాలేరు. ఇద్దరూ వెళ్ళి ఒక మూలలో కూర్చున్నారు.

అందులో ముద్దులూ, డాన్సులూ వుండటంచూసి, శ్రీధర్ తనను ఇటువంటి పిక్చర్‌కు ఎందుకు తీసుకువచ్చాడా అనుకుంది. మొదటిసారిగా శ్రీధర్‌పైన కోపం వచ్చింది.

కాని, సినిమా చూడటంవలన తన శరీరంలో ఏదో సంచలనం జరగడం గుర్తించింది. ఇంతకుముందు ఎప్పుడూ పొందని అనుభూతి అది.

ఇంతలో శ్రీధర్ చేయి తన భుజంపైపడటం గమనించింది. తెలియక వేసివుంటాడనుకుని తీసివేయమని చెప్పలేకపోయింది.

ఆ స్పర్శవలన, శరీరంలో ఒక విధమైన మత్తుతో కూడిన సంచలనంకలిగి క్రమంగా ఎక్కువయింది.

కాని ఊహించని పరిణామం జరిగింది ఆ మరుక్షణం. శ్రీధర్ ఒక్కసారిగా సరోజవైపు తిరిగి ఆమె తలను రెండు చేతుల్తో పట్టుకుని అధరాలను చుంబించాడు.

కాళ్లకింద భూమి కంపించినట్లయింది ఆమెకు. శరీరం బెలూన్‌గా ఉప్పొంగింది. కళ్ళముందు శూన్యంతప్ప మరేం కనిపించలేదు. నరాల ప్రకంపనం తీవ్రమై శరీరం వణకడం సాగించింది. పెదాలు అదురుతున్నాయి. ఊపిరి వేగం హెచ్చింది.

ఆ వెంటనే జడత్వంలోంచి అస్తిత్వంలోకి వచ్చి కుర్చీలోంచి లేచి హాల్ బయటకు పరుగుతీసింది.

శ్రీధర్ ఆమెను అనుసరించాడు.

బయటకు వస్తూనే శ్రీధర్ ఆటో మాట్లాడాడు. ఇద్దరూ ఆటోలో కూర్చున్నారు. కాని ఉధృతమైన భావాలు ఇద్దరిలోనూ ముప్పిరిగొనడంతో ఒకరితో ఒకరు మాట్లాడుకొనే అవకాశమే లేకపోయింది.

'శ్రీధర్ ఎందుకిలా చేస్తున్నాడు? తననెందుకిలా పురికొల్పుతున్నాడు? తనను కాంక్షిస్తున్నాడా? దీనికోసమేనా ఇన్నిరోజులుగా ఆదరణ, ఆప్యాయత చూపడం?' సరోజలో అంతరంగమథనం జరుగుతోంది.

శ్రీధర్ ఎటో చూస్తున్నాడు. సరోజ అంతరంగంలో ఎగిసే భావాలు వాక్ ప్రవాహంగా వచ్చి- తనను తలవంచుకునేలా చేస్తుందేమోనని తలిచాడు. సరోజ ముఖంలోకి చూడాలంటేనే సిగ్గుగా వుంది.

''నన్ను క్షమించండి'' తగ్గుస్వరంతో అన్నాడు శ్రీధర్.

''ఎందుకు?'' ప్రశ్నార్థకంగా చూసింది సరోజ.

ఆశ్చర్యపోవడం శ్రీధర్ వంతయింది. ★

# రచయితలకు సూచనలు




★ "చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో పేరి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.



మీ సస్యాలకు రక్షణ... అన్నదాత
మీ పశుపోషణలో శ్రీరామరక్ష... అన్నదాత
మీ ఆర్థిక స్థోమతకు పునాది... అన్నదాత
మీ పంటలకు జవం జీవం... అన్నదాత
చీడపీడలపై బ్రహ్మాస్త్రం... అన్నదాత
రైతులకు, సంస్థలకు వారధి... అన్నదాత

---

## బోనస్ బుక్

నెలనెలా ఇచ్చే వార్తలు, వ్యాసాలు, వివరాలు సలహాలేకాక, వ్యవసాయ రంగానికి, దాని అనుబంధ రంగాలకి చెందిన ముఖ్యమైన ఒక్కో అంశాన్ని కూలంకషంగా చర్చిస్తూ పూర్తి వివరాలతో, ఫోటోలతో కూడిన సప్లిమెంట్‌ను ఒక క్రమపద్ధతిలో ఇచ్చే 'బోనస్‌బుక్' 'అన్నదాత' పాఠకులకొక అమూల్యమైన కానుక.

నెలనెలా అన్నదాత చదవండి!
మీ పురోభివృద్ధికి మీరే మార్గంవేసుకోండి!!



సంవత్సర చందాకై రు. **30/-** అన్నదాత పేరిట డి.డి.ని అన్నదాత, ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్‌కి పంపండి.



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. సమీక్ష'' అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతురప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

**జనవరి 'చతుర' నవల రక్తం కార్చిన కాటుక కళ్లు**

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

# చమర కథలు



## కత్తి- కరాటే!

“ఆ వెధవలు చాలా డేంజరుగాళ్ళు. మొన్న మన సుందరంగాణ్ని ఈ రైలుకట్ట మీదే ఒంటరిగా చూసి బుర్రవగలకొట్టి వాచీ, పర్సూ ఆఖరుకు ‘పాకెట్ కూంబ్’ సహితం దోచుకుపోయారట”... సుబ్బారావు చెప్పుకుపోతున్నాడు సినిమా నుంచి తిరిగి వస్తుండగా. భయంతో వెన్నులోంచి వణుకు మొదలయి ంది నాకు.

అసలు ఈ మధ్య ఇలాంటి దారిదోపిడీలు ఎక్కువయ్యాయి. దేవుడనే వాడుంటే- వాడి దయవల్లే నేనింకా ఆ దొంగ వెధవల బారిన పడలేదు. పడకూడదు కూడా! ఆలోచిస్తున్న నాకు ఓ ఆలోచన వచ్చింది. మిత్రుడి దగ్గర సెలవు తీసుకొని ఇంటిదారిపట్టాను.

ఆ మర్నాడే “టాప్.... టాప్ కరాటే ఇన్‌స్టిట్యూట్”కు సాదరంగా ఆహ్వానించారు బ్లాక్‌బెల్ట్‌గ్రహీత ఆ ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్‌గారు.

“నెలలోగా నాకు కరాటే అంతా వచ్చేలా చెయ్యాలి!” చెప్పాన్నేను.

ఓ అరగంట ఆలోచనతో ఒప్పుకున్నారాయన. ఆనందంతో పరవశించిపోయాను. ఈనెలలోగా నన్నెవరూ అడ్డగించకుండా చూడమని దేవుడికి డ్యూటీ వేశాను.

నెల రోజులు గడిచాయి- నా నిర్విరామ కృషి ఫలితంగా లాప్... లాప్‌గారి అపూర్వశిక్షణ ఫలితంగా నాకు కరాటే వచ్చేసింది.

ఆరోజే ఫస్ట్! సాధారణంగా దొంగవెధవలు విజృంభించే రోజు ఇదే. కావాలనే ఆరోజు ఆఫీసుకు పల్చటి చొక్కా వేస్కొచ్చాను. పైజేబులో జీతం డబ్బు పెట్టి చూసుకున్నాను- ఆమడదూరాన్నించైనా చూడొచ్చు- నాజేబులో డబ్బుల్ని.

తృప్తిగా బయలుదేరాను. సాధ్యమైనంత వరకూ చీకటి సందులగుండా, జనసంచారంలేని ప్రదేశాలు సర్వేచేస్తూ చివరికి రైలుకట్టమీదికి వచ్చాను.

-- అప్పుడు చూశాను ఆ చీకట్లో ఓ జత కళ్ళు నన్నే గనునించటం.

ఇంకేం... నా నిరీక్షణ ఫలించింది!

పక్కనే ఉన్న సందులోకి దారితీసి వేగంగా నడవటం మొదలుపెట్టాను భయం నటిస్తూ అలాకొంతదూరం నడిచాక వెనుదిరిగి చూశాను. పరుగులాంటి నడకతో నా వెనుకే వస్తున్న వాడు నన్ను చూసి ఠక్కున ఆగి దిక్కులు చూడ్డం మొదలుపెట్టాడు.

సందేహంలేదు వీడు దొంగ వెధవే! పైగా ఒక్కడే. నాలో ఉత్సాహం తారాస్థాయికి చేరుకుంది. వెంటనే స్పీడుగా నడవటం మొదలు పెట్టాను. నా వెనుక పరిగెత్తుతున్న అడుగుల శబ్దం! నడుస్తూనే ఆలోచిస్తున్నాను- ఈ వెధవనెక్కడ తన్ని మరెక్కడ పారేయాలా అని?! నా ఆలోచనలకు రూపాన్నిస్తూ ఓ చిన్నసైజు మైదానంలోకి వచ్చేశాము.

చప్పున నడవటం ఆపాన్నేను.

వెనుక కూడా పరుగు శబ్దం ఆగిపోయింది.

నెమ్మదిగా వాడికి ఎదురు తిరిగి నుంచున్నాను. ఓ పది అడుగుల దూరం ఉంది మా మధ్య. చొక్కా చేతులు పైకి లాగి మడిచాను- యుద్ధానికి సిద్ధంగా.

వాడి చేతుల్లో 'టక్'మంటూ విచ్చుకున్న బటన్‌నైఫ్‌ను ఆ మసక చీకట్లో నా కళ్ళు గమనించాయి!

నేను రెడీ అవసాగాను.

ఇంతలోనే అనూహ్యమైన వేగంతో ఎగిరి వచ్చి నా మీదకు దూకాడు వాడు.

ఓ మనిషి నిలువునా కుప్పకూలిపోవడానికి సరిపడే దెబ్బ ఒక్కటే ఒక్కటి పడింది నా మెడమీద.

"ప్చ్! పాపం పూర్ క్రీచర్, మొత్తం జీతం అంతా జేబులోనే వుంది." పర్సులోని నోట్లు లెక్కబెట్టుకుంటూ వాడు అనటం వినిపించింది. బరువుగా కళ్ళు తెరిచి చూశాను. చీకట్లో కూడా గుర్తుపట్టాను. ఇంకెవరూ? వాడే, "లాప్... లాప్ కరాటే ఇన్‌స్టిట్యూట్"కు పోటీగా ఆ ఎదురుగా మరో ఇన్‌స్టిట్యూట్ నడుపుతున్న కత్తుల కాంతయ్యేవాడు.

**-- చిరుమామిళ్ళ మనోహర్**

# నిన్నటి బేరం

సాయంత్రం ఆరయింది. కొత్తరోడ్ జంక్షన్‌లో బస్‌దిగాను. రోజూకంటే రద్దీగావుంది. ఆమరునాడు, ఏదో వ్రతం కావడంతో పళ్ళదుకాణాలన్నీ బిజీగా ఉన్నాయి. సాయంత్రం ఆఫీస్ నుండి వచ్చేటప్పుడు నాలుగైదురకాల పళ్ళు తీసుకురమ్మని చెప్పింది మా ఆవిడ.

ఒక పళ్ళదుకాణం దగ్గరచేరి నెమ్మదిగా లోపలికి ప్రవేశించి పళ్ళ నాణ్యం చూడసాగేను. రకరకాల సైజుల్లో యాపిల్స్, అరటిపళ్ళు, ద్రాక్షపళ్ళు, దానిమ్మపళ్ళు అందంగా పేర్చబడి ఉన్నాయి దుకాణంలో.

ఇంతలో దుకాణదారు ఎవరితోనో ఘర్షణపడుతున్నట్లనిపించింది. పళ్ళుకొంటున్న అందరి దృష్టీ అటువైపు తిరిగింది. కాసేపు వాళ్ళిద్దరి ఘర్షణవిన్న తరువాత అర్థమయిన విషయమిది.

పావతనితో ఘర్షణపడుతున్న కుర్రవాడి వయసు పధ్నాలుగేళ్ళుంటుంది. డజను అరటిపళ్ళు రెండున్నరకు బేరమాడి తీసుకుని అయిదు రూపాయల నోటిచ్చి పావతను తిరిగి రెండున్నరఇస్తుంటే ఇంకో అయిదురూపాయలు వస్తాయని పేచీపెడుతున్నాడట.






ఇద్దరి గొడవ ఎంతకీ తెగడంలేదు. కొంత మంది ఉత్సాహవంతులు కుతూహలంగా గమనిస్తున్నారు వాళ్ళ గొడవను. నాకు చిరాగ్గా వుంది. త్వరగా పనిముగించుకుని ఇంటికి వెళ్ళిపోవడానికి ఆత్రపడుతున్నాను. షాపతను ఆ కుర్రాడితోనే జగడమాడుతూ మిగతా వాళ్ళ సంగతి పట్టించుకోవడంలేదు.

త్వరగా తగవుతీరుద్దామనే సదుద్దేశంతో నేను కలుగజేసుకున్నాను వాళ్ళిద్దరిమధ్య.

''అతను ఎంతిచ్చాడు మీకు?'' అడిగాను షాపతన్ని.

''అయిదు రూపాయలనోటిచ్చాడు సార్! డజను అరటిపళ్ళకి రెండున్నర తీసుకుని మిగిలిన రెండున్నర ఇవ్వబోతుంటే ఇంకో అయిదు రూపాయలు వస్తాయని పేచీపెడు తున్నాడు... చూడండి'' అన్నాడు షాపతను.

''అవును ఎందుకురావు. నాకింకా ఏడున్నర రావాలి. న్యాయం రోజుకోవిధంగా మారిపోతే ఎలా?'' అరుస్తున్నాడా కుర్రాడు.

నేను ఈసారి ఆ కుర్రవాడి వైపుతిరిగాను.

''అసలు నువ్వు షాపతనికి ఎంత నోటి చ్చావ్?'' అడిగాను.

''అయిదు రూపాయలనోటు సార్'' అన్నాడు కుర్రాడు.

''మరయితే నీకు తిరిగి రావాల్సింది రెండున్నరేకదా! ఏడున్నర అడుగుతున్నావేమిటి?'' ఆశ్చర్యంగా అడిగాను.

''అవునుసార్... నాకు రావలసింది ఏడున్నరే'' మొండిగా అన్నాడా కుర్రాడు.

''చూశారా సార్! అయిదు రూపాయలే ఇచ్చానంటున్నాడు. ఇంకా ఏడున్నర తనకు వస్తుందంటున్నాడు. ఇదేం న్యాయమో మీరే చెప్పండిసార్'' అంటున్నాడు షాపతను.

''అదేలాగ. రోజుకోరకంగా ప్రవర్తిస్తున్నావు నువ్వు'' అన్నాడు ఆ కుర్రాడు ఆవేశంగా

''అతను రోజుకోవిధంగా ప్రవర్తించడమేమిటి?'' ఆశ్చర్యంగా అడిగాను ఆ కుర్రాడిని.

''అవును సార్! నిజమే... ఈ పెద్దమనిషి రోజుకోవిధంగా ప్రవర్తిస్తున్నాడు. నిన్న యిదే టైములో డజను రెండున్నర చొప్పున అరటిపళ్ళు తీసుకుని అయిదు రూపాయల నోటిస్తే – తిరిగి ఏడున్నర రూపాయలు ఇచ్చాడు కదా? ఇవాళ ఎందుకు ఇవ్వడు. రోజుకోరకం న్యాయమా?'' గట్టిగా అరుస్తూ ప్రశ్నించాడా కుర్రాడు.

–కోనే నాగవెంకటఆంజనేయులు



చతుర ... 129

వచ్చేనెల

# చతుర

## రూ.6000/- బహుమతి పొందిన నవల




అదో కీకారణ్యం. మధ్యన ఏకాకిలా ఓ చిన్న గిరిజన పల్లె. నడి వీధిలో అభం, శుభం తెలీని ఆ పసివాడిని కాళ్లు, చేతులు కట్టిపడవేశారు. కుండలో ఎలుకను పెట్టి దాన్ని వాడి కడుపుమీద బోర్లించారు. దారి, తెన్ను లేకా, ఊపిరాడకా ఆ ఎలుక వాడి కడుపు కొరుక్కుంటూ లోపలికి చొచ్చుకుపోతోంది. రక్తం ధారలు కడుతుంటే, భయంకరమైన బాధతో విలవిలలాడి పోతున్నాడా పసివాడు...

చలించకపోగా, వికటంగా నవ్వుకుంటూ వినోదాన్ని చూస్తున్నారా అధికారులు.

ఏమిటీ రాక్షసం? చేయని నేరానికి ఎందుకా భయంకర శిక్ష? ఎవరి స్వార్థానికా పసివాడినలా బలిపశువుని చేశారు?

వసంతరావ్ దేశపాండే చెట్లు, పుట్టలే గూళ్లుగా బ్రతుకీడ్చే అమాయక గిరిజనుల జీవన పోరాటాన్ని అపూర్వంగా చిత్రించిన "అడవి" నవల ఫిబ్రవరి "చతుర"లో మీ ముందుకు వస్తోంది.

'చతుర' నవలల పోటీలో ద్వితీయ బహుమతి రు: 6000/- పొందిన యదార్థ జీవన వ్యధార్త చిత్రం "అడవి"... దేశాన్నే ఓ ఊపుఊపిన 'ఇంద్రవెల్లి'కి కేంద్రం ఈ "అడవి".

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

వస్త్ర ప్రపంచానికే తలమానికం!



# చందన బ్రదర్స్

(A.C)

లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్

జగదాంబ సెంటర్

విశాఖపట్నం

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402